# న క్ష త్ర ము లు

ఇ య్యా ది

మద్రాసు ఆంధ్రసభవారిచే కణ్ణస్‌శ్రేష్ఠిగారి రత్నఖచిత స్వర్ణపతకమును,
ఆంధ్రయూనివర్సిటీవారి Every day Science బహుమానమును
కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి కౌలివిజ్ఞాన బహుమానమును
బడసిన వైజ్ఞానికులును, ఇంగ్లీషున Scripture of
the Heavens రచించి ప్రాక్ప్రతీచీ మహా
మహుల ప్రశంసలకు పాత్రులైన
జ్యోతిర్విద్యావిశారదులును
నగు

శ్రీ గొబ్బూరు వేంకటానందరాఘవరావు B. A. గారిచే
ర చిం ప బ డి న ది

శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు
పంతులుగారి గ్రంథనిధి
16 వ ప్రచురణము

1954

వెల 2-8-0

# విషయసూచిక





---

# A few select Opinions and high appreciations re - Raghava Rau's famous Scripture of the Heavens

1. **Professor, Dr. F. O. Soprader, Kiel University Germany :—**

   " I admire the enthusiasm with which this Scripture is written, and which appears to have been kindled by the knowledge of the books of late Prof. Jeans, which also I highly appreciate.

2. **Prof. Raneau - Franch Sanskrit Academy Paris.**

   " Your work on Indian Astronomy and Vedic Sciences is very imposing ".

3. **Mr. Justice B. Jagannadh Das, M.A., M.L. Judge, Federal Court, Delhi :—**

   Even a bare and cursory reading of the Book discloses extra-ordinary erudition and insight.

4. **Sir C. P. Ramaswami Aiyar, Vice - Chancellor Annamali University :—**

   The Book is an eye - opener demonstrating the intuitive and comprehensive knowledge possessed by Vedic Rishis and reconciling our ancient faith with modern Science.

5. **Dr. R. Nagaraja Sarma, M.A., L.T. Et.**

   " This brilliant research work devotes itself to a systematic scientific exposition of the astronomical knowledge of the ancient Vedic Sages.

6. **Dr. T. A. Purushottam, M.A., Ph.D. Professor of Philosophy, Mysore University :—**

There can be no excuse for a born Hindu hereafter to be ignorant of the theme of your Scripture

**RAGHAVA RAU'S SCRIPTURE OF THE HEAVENS.**

THE MADRAS MAIL :— 30-10-1949

" It is an interesting work correlating the Vedas with modern scientific knowledge ".

THE INDIAN EXPRESS :— 27-11-49

" He explains how Light - Physics, the Zodiac etc. were all well-known to ancients. He stimulates in the readers a curiosity as to how much more light he will shed on ancient Sciences.

THE HINDU :— 4-6-1950

He has to be congratulated for going a long way to meet the demands of Scholars all over the country.

**Price Rs. 6 — 8 — 0**

*Can be had of* :—

**VITHAL ASRAM**

Sesha Vilas

ELURU (West Godavery Dist.)

# తొలి పలుకు

బహు ప్రాచీనకాలమున నారదుడొకప్పుడు సనత్కుమారుని సందర్శించి తనకు బ్రహ్మవిద్య నుపదేశింపుమని ప్రార్థించెను. 'ఇప్పటికి ఎన్నివిద్యల నభ్యసించితి?' వని సనత్కుమారు డడుగగా, నారదుడు ఈక్రిందివిద్యల జాబితా వివరించెనని ఛాందోగ్యోపనిషత్తులో చెప్పబడినది. (చూ. 7-1) "నాలుగువేదములు, ఇతిహాసపురాణములు, వ్యాకరణము, పైతృకశ్రాద్ధకల్పము, రసవిద్య, గణితము (Science of Numbers), దైవికవిద్య (అధి దైవికవిషయమైన విద్య) (Cscience of Natural Phenomena), నిధి విద్య (భూగర్భమున ద్రవ్యనిధులనుజూపు శాస్త్రము) (Geology and mining), తర్కము, నీతిశాస్త్రము, దేవవిద్య (అనగా నిరుక్తమని శంకరమతము). బ్రహ్మవిద్య (వేదాంగ, భూత శిక్షాది విద్యలు) భూతవిద్య (వశీకరణవిద్య గాలి, పదార్థ విజ్ఞాన విద్య), క్షత్రవిద్య (ధనుర్విద్య), నక్షత్ర విద్య (జ్యోతిషము) సర్పవిద్య, గాంధర్వవిద్య (సంగీతము), వైద్యవిద్య"

ఈపట్టిక చూడగా, ప్రస్తుతము సాధారణముగా నేటి విశ్వవిద్యాలయములలో నేర్పెడు విద్యలపట్టికవలెనే ఉన్నది. ఇంతవివరములతో లేనప్పటికిని, ఈసంగతులే మహాభారతము—శాంతిపర్వములోగూడ నున్నవి. దీనినిబట్టిచూడగా ఆకాలములో యువకులీవిద్యలను అభ్యసించువాడుక కలదని తోచక మానదు.

ఇందు నక్షత్రవిద్యకూడ ముఖ్యముగా పేర్కొనబడినది అయినను కొందరు పాశ్చాత్యులును కొందఱు భారతీయులును కూడ, జ్యోతిశ్శాస్త్రమును, అందు ముఖ్యాంగములైన నక్షత్రనామములను, రాసులనామములను, గ్రహముల నామములను, వాటినడకవిషయములను మనపూర్వులు గ్రీకులనుండి నేర్చుకొనిరను దురభిప్రాయములు కలిగియుండుటయేగాక ఆవిషయమై విశేషప్రచారముకూడ కావించుచున్నారు. మన పూర్వుల ప్రాచీన విజ్ఞాన సంపత్తిని గూర్చి యేమాత్రము తెలిసికొనినను, యీ ఆరోపణ నిరాధారమని తేటపడగలదు. శ్రుతి స్మృతి ప్రమాణములతో సహేతుకముగా మనవారీసత్యమును ఏకముగా ఋజువు చేయకపోవుటచేత నిట్టి యజ్ఞానము లోకమున ప్రబలియుండుట మిక్కిలి విచారకరము. ఈపరిస్థితికి కారణములున్నవి. సంస్కృతము తెలిసినవారికి శాస్త్రవిజ్ఞానము (Modern Scientific knowledge) లేకపోవుట. ఈ శాస్త్ర విజ్ఞానముగలవారికి సంస్కృతజ్ఞానము లేకపోవుట. అయినప్పటికి కొందరు పాశ్చాత్యులును, భారతీయులును కూడ ఈవిషయమై చాలపరిశోధనలుచేసి, ఛాందోగ్యమున గల విషయములు చాలవఱకు నిజమని నిరూపింప గలిగినారు. కాని జ్యోతిశ్శాస్త్రవిషయమై కొందరు కొంతపనిచేసినప్పటికిని మనపూర్వులకు నక్షత్రములు, రాసులు, వీటినిగురించి పూర్తిగా తెలిసినట్లు సవిస్తరముగా చెప్పగలిగినవారు ఈపుస్తకమును రచించిన శ్రీరాఘవరావుగారు. ఈపుస్తకము

ఎన్నో సంవత్సరముల పరిశోధనాఫలితము. దీనికి కావలసిన సాధన సంపత్తి వారిదగ్గర ఉండుట భారతీయుల భాగ్యము. వీరికి సంస్కృతమునందును, ఆధునిక శాస్త్రములందునుకూడ మంచిపరిచయముగలదు. దానికి తగిన పట్టుదల, ఉత్సాహము కూడ వారికి కలవు. వారి నిరంతరకృషిమూలముగా నింత వఱకు నిగూఢముగానున్న ప్రాచీన భారతీయ విజ్ఞానము మనకు తేటతెల్లమైనది.

వీరు ఆంధ్రులకు చిరపరిచితులు. భారతిలోను, తక్కిన పత్రికలలోను నక్షత్రములనుగూర్చి వ్రాసిన వీరి వ్యాసములను చదివి, ఆనందించి, మనభారతీయప్రాచీన విజ్ఞానమిట్టిదని తెలిసి గర్వించనివారు ఎవ్వరు నుండరని నానమ్మకము. వారిపరిశోధనల నన్నిటిని కేంద్రీకరించి యీపుస్తకముద్వారా ఆంధ్రలోకము నకు సమర్పించుచున్నారు. ఆంధ్రులు ప్రత్యేకముగా గర్వించ దగిన విషయమిది. వీరి పరిశోధనల మూలముగా, మన పూర్వులకు నక్షత్రవిద్య తెలియునని స్థిరపడుటే కాక, ఖగోళ నాటకమంతయు జనసామాన్యమునకు తెలియునట్లు, వారు మన పురాణేతి హాసములలో చేర్చి వర్ణించినట్లు స్పష్టము చేసి నారు. పాశ్చాత్యులే మనపూర్వుల నక్షత్ర విజ్ఞానము సంగ్రహించి రను సత్యము ప్రపంచమునకు వెల్లడిచేయబడినది.

ఈపుస్తకములో శ్రీరాఘవరావుగారు ఒకముఖ్యమైన అంశమును తెలియపర్చినారు. వెలుగువేగము (Velocity of

light) సెకండునకు 1, 86, 000 మైళ్ళని మనపూర్వులకు తెలిసినట్లు ఋజువుతో వెల్లడిచేసినారు. గెలీలియో (Galileo) 15 వ శతాబ్దమునందు వెలుగునకు వేగమున్నదని తెలిపినందుకే అతని మేధావిత్వమును ఆధునిక శాస్త్రజ్ఞులు ప్రశంసించుచున్నారు. మరికొన్ని శతాబ్దముల తరువాత పరిశోధకులా వేగమును నిర్ణయింప గలిగిరి. అట్టిది మన పూర్వులకు తెలిసియున్నదని ఋజువుచేయుట సామాన్య విషయముకాదు.

ఇంకొక సంగతి. మనయువకులకు ప్రాచీన విజ్ఞానము తెలిసికొనుటయందు అభిరుచి తక్కువ. ఆఫ్ఘనిస్థానములో సంస్కృతభాషాజ్ఞానము ప్రతివిద్యార్థికీ ఉండితీరవలె నని నిర్బంధ మేర్పరచినట్లు కాబూల్ వార్తలు తెలుపుచున్నవి. అట్టి నిర్బంధ సంస్కృత విద్యావశ్యకత మన పాలకవర్గమునకు ఇంకను బోధపడకుండుట మిగుల శోచనీయము. పంచాంగములను చూచువారు మనదేశములో చాలతక్కువ. అందును నక్షత్రములనుపోల్చి తెలుసుకొనువారు మరియు తక్కువగా నున్నారు. శ్రీరాఘవరావుగారి పుస్తకము తిరిగి మవ ప్రాచీన విజ్ఞానమునందు అభిరుచి కలిగించ కలదని నా ఆశ. అప్పుడు గాని మన ఔన్నత్యము ప్రపంచకమునకు తెలియదు.

860 గగన్ మహల్ రోడ్డు
దోమల్‌గుడా — హైదరాబాద్
(డక్కన్)
తే. 25 — 4 — 1952

జయంతి చినకామేశ్వరరావ్,
M. A., D. Sc.
Professor of Physics.
Nizam College.

# ప్రకటనకర్తల విజ్ఞప్తి



కీ. శే. శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు పంతులు గారి నిధినుండి ప్రకటితములయిన గ్రంథ తారకలలో ఈ "నక్షత్రములు" 16 వ చక్కనిచుక్క. దీని రచయిత శ్రీ గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు. వారి ఖగోళ జ్యోతిర్విజ్ఞానప్రకాశముచే ఆంధ్రులకే గాక అన్యదేశముల కును వెలుగు జూపిన ప్రసిద్ధులు. వారి ప్రతిభావిశేషమును ఏతద్గ్రంథమే చాటుచుండగా మేము వేరే విస్తరించుట ముంజేతి కంకణము నద్దములో జూపినటులగును. శ్రీ వ. సూ. రావుగారి ధర్మమాయని యీలాంటి గ్రంథరత్నములను పొంద గలిగిన యాంధ్రుల యదృష్టమును ప్రశంసించుచున్నాము. యావజ్జీవ కృషివలన నార్జించిన విత్తమును శ్రీ వ. సూ. రావుగారును విజ్ఞానమును గ్రంథకర్తలును లోకకళ్యాణమునకై ధారపోసి లోకుల శాశ్వత కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు.

ఈ గ్రంథముద్రణకు కొన్ని అనివార్యకారణములచే విలంబనము కలిగినది. అందుకు విచారించుచున్నాము. ఇంత వఱకు వ్రాసియిచ్చిన గ్రంథకర్తలవలెనే యికముందును విద్వాంసులు శాస్త్రీయ విజ్ఞానమును గ్రంథరూపమున లోక

మునకు ప్రసాదించి శ్రీ వ. సూ. రావు పంతులుగారి విశ్రణమునకు వన్నె బెట్టుదురని యాశించుచున్నాము.

ఈగ్రంథ ముద్రణనిధికి దాతలును స్వశక్త్యనుసారము తోడ్పడి క్రొత్త క్రొత్త పాత్తములను తెనుగునందు బయలు పరుప బూనుకొందురుగాక యని మావిజ్ఞప్తి.

ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠ పాలక సంఘము కొవ్వూరు }
దిం 20-1-1954

ఇట్లు
శ్రీ వల్లూరి సూర్యనారాయణ
రావుగారి ట్రస్టు పరిపాలకులు



# గ్రంథకర్త విన్నపము

నీలపు మేలుకట్టున లావణ్యవిభ్రాజితములైన ముత్యము లను తలచుచుగాను, తళుక్కుగల రత్నములను అనదుగను, కూర్చినట్లు మనశిరస్సులపై ప్రతిరాత్రియు మెఱయు గ్రహ నక్షత్ర తారామయమైన నభోరంగమును చిన్నప్పటినుండియు చూచుచు, నెంతో అలరుచు, తన్మయుడనగుచు తిలకించు చుంటిని. ప్రాక్ప్రతీచీ జ్యోతిర్విజ్ఞాన సమన్వయ దృష్టితో, ఏక లవ్యునివలె పెక్కుసంవత్సరములు నక్షత్రవిద్యను అభ్యసించి ఈ గ్రంథమున వ్రాయబడిన విశేషాంశములలో చాలవఱకు బహు కాలము క్రిందటనే తెలిసికొని యుంటిని. కాని ఆ విజ్ఞానమును ప్రకటించుటకు తగు ధైర్యమును, ఆత్మవిశ్వాసమును చాలక నాలో నేనే జీర్ణించుకొని యుంటిని.

ఇట్లుండ, నా అదృష్టవశముచేత మన తెనుఁగు నలువ బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు—శ్రీకవిగారు విశాఖపట్టణపు కాపురము విడిచి మా ఎలమంచిలో నివసింప నారంభించిరి. వారిశిష్యరత్నము — బ్రహ్మశ్రీ ఆకెళ్ళ సూర్య నారాయణగారు శ్రీ వారికి సుమారు పదునాలుగుఎకరముల నేల దానమిచ్చిరి. అందొక చక్కనిమామిడితోట వేయించి కవిగారు పెంచుచుండిరి. ఆతోట ఎలమంచిలికి రెండుమైళ్లు దూరములో నున్నది. అందుచేత వారు సకుటుంబముగా ఎలమంచిలి

కాపురమునకు వచ్చిరి. మా ఇద్దరి మతములును ఆశయములు నొక్కటై యగుటవలన మా మనస్సు లేకమైనవి.

పిమ్మట నొకనాటి రాత్రి వారిని మాయింటికి పిలిచి నాకు తెలిసిన జ్యోతివిషయములను వారి కెఱిగించితిని. ముఖ్య ముగా వారును సాహిత్యసామ్రాట్ శ్రీ విక్రమదేవవర్మ - జయపురమహారాజు గారును సంస్కరించి ప్రకటించిన నన్నయ కృత భారతమున అరణ్యపర్వమునందు, శరత్కాలము వర్ణిం చుచు, కడపట వ్రాసిన పద్యములను చదివించి, ఆ పద్యభావ ములు వ్యాసకృతమూల భారతమున లేవనియు, నవీనకాల పడమటి జ్యోతిర్వేత్తలకు తెలిసిన విశేష విషయములను తొమ్మిదిశతాబ్దములక్రిందటనే బాగుగ నెఱిగిన ప్రోఢ నన్నయ భట్టారకుడని నా నిశ్చితాభిప్రాయమును తెలిపి, Constellations, and how to find them - అను నింగ్లీషు నక్షత్ర గ్రంథమునుండి కావలసిన యుపపత్తులను చూపించి తిని. అపు డాయనముఖమున తాండవించిన తేజోమయమైన ఆనందము ఇప్పుడుకూడ నా హృదయ చక్షుస్సు నెదుట తళుక్కుమను చున్నది. వారు అత్యంతమైన వాత్సల్య ముతో నాయుద్యమమును ప్రోత్సహించి కొండంత ధైర్యమిచ్చి నక్షత్ర విజ్ఞాన విషయములపై నాభావములను వెంటనే గ్రంథ స్థము గావింపుమని ఆనతిచ్చిరి.

అంతకు పూర్వము నేను పరిశ్రమించి శ్రీకలవల కణ్ణను శ్రేష్ఠిగారి వలన, రాజధాని-పోటీలో ప్రథమ బహుమతిగా

రత్నఖచిత స్వర్ణపతక బహుమానము నందిన గద్య వాఙ్మయ చరిత్ర ప్రకటన సందర్భమున నార్థికముగా దెబ్బతిని యున్నం దున, నక్షత్రగ్రంథ ప్రకటనభారము నేను భరింపజాల నంటిని. నిరుద్యోగి, నిర్ధనుడునైనను, ఆమహాపురుషుడు అద్భుతధైర్య ముతో "ఆర్థిక ప్రాతికూల్యమని నక్షత్ర గ్రంథ ముద్రణ వెను కకు నెట్ట వీలులేదు, మీ గ్రంథమును నేను ముద్రించి ప్రక టింతును. రేపటినుండి మీరు ఈ గ్రంథ రచన ప్రారంభించ వలెనని" శాసించిరి.

అంతేకాదు. వ్రాత పూర్తియగువఱకు ప్రతిదినము, రెండుపూటలవచ్చి చూచి నన్ను హెచ్చరించి వెళ్లుచుండిరి. ఏనాడైన, ఏకారణముచేతనైన వ్రాత సాగని పక్షమున, మరునాడు వారు వచ్చుచున్నారనగా, "ఏమి సమాధానము చెప్పుదునని" నాలో నేను ఎంతో భయపడుచుంటిని.

విషయము సామాన్యమైనదికాదు. మనస్సులో ఊహలు పొడచూపుట వేరు ; స్పష్టార్థము స్ఫుటముగా గోచరించునట్లు అక్షరరూపమున వెలయించుట వేరు ; అందులో వేదములకు భాష్యమువ్రాసిన విద్యారణ్యయతీంద్రుల భావములను, ఆంధ్ర భోజుడు, విజయనగరమహారాజు, ఆనందగజపతీంద్రుల వలన ముప్పదివేల రూపాయలు విరాళముగ్రహించి, ఋగ్వేదమును ఇంగ్లీషులోనికి పరివర్తించి, జగత్ప్రఖ్యాతి గడించిన Max Müller పండితునివ్రాతలను "స త్య మ్ ప ర మ్ ధీ మ హి"

అని సత్యనిరూపణచింతతో విమర్శించుట నాకెంతో కష్టమని పించినది. లోకమునకు శాస్త్రమర్మములను, సత్యమును వెల్లడి చేయు సందర్భమున గెలిలియో మహాశయుని వలెనే, వ్యక్తు లెంత గొప్పవారైనను, లక్ష్యపెట్టక, సత్యార్థప్రకాశముపొంటు నిస్సందేహముగా విమర్శింపకతీరదని శాసించుచు మాకవిగారు నాకెంతో ధైర్యమిచ్చిరి.

మొదట నీ నక్షత్ర గ్రంథమును న్యాచేత వ్రాయించి ఆవ్రాతప్రతిని విశాఖపట్టణస్థమైన మాకవితాసమితివారి వైశాఖ సంచికలో చేర్చి ఆసమితి యధ్యక్షులైన శ్రీకవిగారు ముద్రణ నిమిత్తము ఆంధ్రపత్రికా ముద్రాలయమున కంపిరి. శ్రీ కవి గారికి నాయందుగల వాత్సల్యము, నౌదార్యము నాకు ప్రాతః స్మరణీయములు.

అంతలో ఉప్పుసత్యాగ్రహపు గొడవలు ప్రారంభమైనవి. విశాఖపట్టణమునకును, మండలమునకును మాకవిగారు కిరీటము లేని మహరాజు. ఆమండల కాంగ్రెసున కధ్యక్షులై, మరియే నాయకునికిని తీసిపోకుండ సత్యాగ్రహోద్యమమును విశాఖ మండలమున జేగీయమానముగా నడిపించి, రాయవేలూరున కవిగారు శ్రీకృష్ణజన్మస్థానము నలంకరించి ఆఱునెల లచట నుండిరి.

దేశోద్ధారక నాగేశ్వరరావుగారును, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారును, కూడ అపుడు వేలూరు జైలులోనే

నిర్బంధితులై యుండిరి. బహుగ్రంథావలోకనపరులైన సీతారామయ్యగారు Hindu, Times of India లోనగు నింగ్లీషు పత్రికలలో, Stars for the month, రాత్రి తొలిజాముస ప్రతినెలలో గానవచ్చునక్షత్రపటములను వివరములతో చూచుచుండి అట్టివి తెనుగుపత్రికలలో కనబడకపోవుటకు చింతించి, నాగేశ్వరరావుగారితో నొకనాడిట్లనిరి : "ఏమండీ! పంతులుగారూ! తెలుగు దేశము గొడ్డుపోయినదా? తెలుగువారికెవరికి నక్షత్రవిద్య అబ్బలేదా? మీరెవ్వరును ఎందుచేత ఇట్టి నెల-నక్షత్ర వ్యాసములను ప్రకటించరని" ఇంగ్లీషుపత్రికలలో నక్షత్రపటములను, వ్యాసములను చూపించిరి. "ఇంతకుముందు నాకీవిషయము తట్టలేదు ; చెన్నపురి ఇంటికి వెళ్ళగానే ముందీ ప్రయత్నమే చేయగలన' ని పంతులుగారు పట్టాభిగారికి సమాధాన మిచ్చిరి.

స్వేచ్ఛబడసి, దేశోద్ధారకులు చెన్నపట్టణము తిరిగి వచ్చినవెంటనే, వారు, 'భారతి' సంపాదకులు, శ్రీగన్నవరపు సుబ్బరామయ్యగారితో నక్షత్రవిషయ ప్రకటననుగూర్చి సంప్రతించిరి "నక్షత్రవిద్యయందు ఆరితేరి కావలసినవ్యాసములను వ్రాయగలవారు ఇదిగో - ఇక్కడేఉన్నారు " అనుచు సుబ్బరామయ్యగారు, అక్కడనే ముద్రితమగుచున్న నా నక్షత్రవ్యాసమును పంతులుగారికి చూపిరి. వారుచాలప్రీతులై వెంటనే చెన్నపట్టణము రావలసినదని నాపేర జాబువ్రాయించిరి. నేను వారి దర్శనముచేసి, విషయము తెలిసికొని, వ్యాసముతో

ముద్రించవలసిన చిత్రములను పెన్సిలుతో వ్రాయించి పంపగల ననియు, వానికి బ్లాకులను తయారుచేయించి ప్రకటింపవలె ననియు విన్నవించితిని. వారట్లే చేయుదుమనిరి.

ఈ యేర్పాటు ననుసరించి నేను బహు సంవత్సరములు ప్రతినెల నక్షత్ర పటములతో వ్యాసములు పంపుచుంటిని. శ్రీ నాగేశ్వరరావుగారు సజీవులై యున్నంతకాలము ఈ వ్యాస పరంపర ప్రతినెల భారతిలో ప్రకటన మగుచుండెను.

మధ్యనొక ముఖ్యవిషయము వ్రాయ మఱచితిని. పైనివ్రాసినట్లు నేను రచించి శ్రీ కవిగారి కందిచ్చిన నక్షత్ర వ్రాతప్రతి ముద్రించి ప్రకటించుటే గాక, మరొకవిధమున గూడ వారు నాకత్యంత సాహాయ్యము చేసిరి. నాకు వారితో పరిచయము బలపడిన పిమ్మట కొలది దినములలోనే, కవితా సమితి వార్షికోత్సవము జరిగెను. నన్ను ఆసభకు రప్పించుటే గాక, మాకవిగారు, సభాకార్యక్రమములో నా ఉపన్యాసమును చేర్పించి, మాటలాడక తప్పదనిరి. నాగుండె ఝల్లుమనెను. సభకధ్యక్షులు - విజయనగర సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామి M.A. గారు. వేద పురుషుడు ఆసభలో సాక్షాత్కరించునట్లు, బ్రహ్మశ్రీ ప్రభల లక్ష్మీనరసింహము పంతులుగారు, వేదప్రభ వెదజల్లుచు, అధ్య క్షులయెదుట గంభీరముగా నాసీనులై యుండిరి. ఈయుద్దం డుల యెదుట వేదికనెక్కి మాటలాడుటకు జంకి, దూరము

మండి రెండుచేతులు జోడించి, కవిగారికి దండము పెట్టి, సంజ్ఞ చేసి, దయచేసి నన్నొకసారి విడిచిపెట్టుడని వేడితిని. ఆయన వేదికపైనుండి దిగి, కడువేగముతో నడచి నావద్దకువచ్చి రెండు చేతులను పట్టుకొని, వేదిక కడకీడ్చుకొనిపోయి, వేదికమీద కెక్కించి, తలపంకించి, "ఊం! మరికానియ్యండి" అని యుపన్యాసము ప్రారంభింపు మనిరి.

అదే నా మొదటి యుపన్యాసము. ఆడుముకొనుచు అప్పటికి తోచిన విధమున ప్రాక్ప్రతీచీవిజ్ఞానములకు సమన్వయము కూర్చి, మన దేవతల వాహన ధ్వజాది వివరములు, వారి వారి పండగల వివరములు మనవి చేసితిని.

వెంటనే ప్రభలవారు లేచి నన్నయభట్టు వర్ణించినట్లు ప్రబల జలధరధ్వాన గంభీర భేరీధ్వనివంటి సహజ ధోరణిలో మహోపన్యాసము గావించి నాయుద్యమమును ప్రశంసించి, నన్నాశీర్వదించి గొప్పగా ప్రోత్సాహ మొసగిరి. అధ్యక్షులు పరవస్తువారును అదేధోరణిలో నాకృషిని శ్లాఘించిరి. "స్థూల దృష్టితో చూచినపుడు ప్రాక్ప్రతీచిజ్యోతిర్విద్యలు భిన్నమార్గ ముల ననుసరించి పోవునట్లు కనబడునుగాని, సత్యమూలము లగుట వానికి నిజముగా భేదములేదు వానిమధ్య నగాధ సింధువున్నదనుకొనుట భ్రాంతి. ఈభ్రాంతి మూలమైన విభేద సింధువును తరింపగలసేతు నిర్మాణ మొనరించుట ప్రశంసా పాత్రమైన ముఖ్య కర్తవ్యమని నొక్కివాక్కాణించి నాయుత్సా

హము నినుమడింపజేసిరి. ప్రభలవారు ఏవేదసభకు వెళ్ళినను, వేదజ్యోతిష సమన్వయవిశిష్టమైన నాకృషిబాహాటముగా ప్రక టించుచు వచ్చిరి. విశాఖపట్టణములో పరవస్తువారి స్వగృహ మునగల భాండాగారమునందలి యుద్గ్రంథములును, విజయనగర సంస్కృతకళాశాలా భాండాగారమునందలి మేటిగ్రంథములును తసవిదీర చదువుకొనుటకునాకు చక్కనియవకాశము లభించెను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులవంటి యీమూర్తి త్రయమును నాకెంతో తోడుపడి అల్పుడను, ఒహుకించిజ్ఞుడనునగు నాచేత నక్షత్రవిద్యాభివృద్ధిపొంటె కొంతపని చేయించిరి.

దీనికి మూలకారకులు – మాకవిబ్రహ్మ – మన తెనుగు నలువ – మాకవిగారు. వారిని తలుచుకొనినప్పుడు నాహృద యము విశ్వాసముతో నుప్పొంగుచుండును. ఇప్పుడు ముద్రిత మైన యీగ్రంథము నాలుగైదుసంవత్సరముల క్రిందటనే తయా రైనది. అయినను నాకంటిలో Cataract జబ్బుపుట్టి దృష్టికి మాంద్యదోష మాపాదించి మూడు నాలుగు సంవత్సరములు నన్ను చదువనియ్యక, వ్రాయనివ్వక, చాల ఇబ్బంది కలుగ చేసినది. ఒకప్పుడు నేనెందుకో కొవ్వూరులోనిగి గీర్వాణవిద్యా పీఠమునకు వెళ్ళితిని. ఆవిద్యాలయాధ్యక్షులు బ్రహ్మశ్రీ కేశిరాజు వెంకటనృసింహ అప్పారావు M.A. గారు నాగ్రంథ మేదేని విద్యాపీఠమునకు ప్రకటన నిమిత్తము ఇమ్మనికోరిరి. సరే అంటిని.

1952 ఆగస్టు 12వ తేదీని, కింగుజార్జి హాస్పిటలులో నేత్ర ధన్వంతరి, శ్రీ డాక్టరు గంతాయత్ గారు, నాకన్ను ఆపరేషనుచేసిరి. అక్టోబరు 20 తేదీవఱకు నేను చికిత్సపొందుచు ఆతేదీని డిశ్చార్జి కాబడితిని. భగవత్కృపవల్లను, డాక్టరు గంతాయత్ గారి చేతిచలువ వల్లను, మిత్రుల గాఢ సంకల్ప బలమువల్లను, నేత్రదోషముతొలగి ఎప్పటివలె నేను వ్రాయను, చదువను సామర్థ్యముమరల పొందగలిగితిని.

నక్షత్ర విషయమునుగూర్చి, ఇంగ్లీషున, నేను రచించిన Scripture of the Heavens అచ్చున కియ్యబోవుచు, దారిలో బెజవాడలోదిగితిని. మిత్రులు శ్రీఅయ్యంకి వేంకట రమణయ్యగారు ఏర్పాటుచేసిన సభలో వేదములకు, జ్యోతి శ్శాస్త్రమునకుగల సంబంధమును గూర్చి ఉపన్యసించితిని. ఆసభకు మిత్రులు శ్రీదిగవల్లి శివరావుగారుకూడ వచ్చిరి. సభ ముగియుగానే శ్రీశివరావుగారెంతో సద్భావముతో నన్ను తమయింటికి తీసికొనివెళ్ళి ఇట్లనిరి. “మాతల్లిగారి దినవార ములు నిన్న నేముగిసినవి. ఆమెతుదికోరిక ఆమెపేరున, వేద విద్యాభివృద్ధికొఱకు ఏబదిరూపాయలు పాత్రులకు దానమియ్య వలెనని నన్నుకోరెను. మీ ఉపన్యాసము వినిన తరువాత మీఉద్యమమునకు తోడుపడుటే యోగ్యమైనదానమని నాకు తోచినది. మీకు ఈపైకముఇచ్చుటచేత ఆమెఆత్మ సంతసింప గలదు” అనుచు తక్షణమే తెచ్చి నాకు ఏబది రూపాయలు

విరాళమిచ్చిరి. నేను అద్భుతపడితిని. వజ్రాలదిన్నెవంటి మన తెనుగునాట, వేదవిద్యయం దభిమానముగల సతీమతల్లులు – శ్రీమతి దిగవల్లి సూర్యమాణిక్యాంబ గారివంటి మాతృదేవత లును, వారియాశయములను పవిత్రమైన భక్తితో నెరవేర్చు, శివరావుగారివంటి సత్పుత్రులును చాలమంది ఉన్నారు; కాని గుప్తముగాఉన్నారు. కాలమువచ్చినపుడు, వేదవిద్య, వారి యౌదార్యము మూలముగా, పునరుజ్జీవితము కాగలదని నాకు ధైర్యముకలిగినది. ఆమాతాపుత్రులకు నాధన్యవాదములతో కృతజ్ఞతావందనములు సమర్పించి వారియౌదార్యమును స్మరించుట నావిధి అంతకుముందే శ్రీ చుండూరు వెంకటరెడ్డి గారు ఇంగ్లీషుగ్రంథమున ముద్రింపవలసిన చిత్రములకైను బ్లాకులకు నూరురూపాయలు విరాళమిచ్చిరి. వీరి యౌదార్యమునుగూడ మీఅందరియెదుట స్మరించుచున్నాను.

ఈనక్షత్ర గ్రంథమును అక్షరరూపమున మొదట వెలయించివారు, తొలిసారిముద్రింపించి ప్రకటించినవారు, నాభయ ముడిపి సభావేదికనెక్కించి, తొలియుపన్యాస మిప్పించినవారు, కంటికిరెప్పవలె యావజ్జీవము నన్నురక్షించుచు, పితృవాత్సల్యముతో నన్నును నాయుద్యమమును ఆశీర్వదించి ప్రోత్సహించినవారు తెనుగునాట నాకును, నక్షత్ర విద్యకును గతి చూపినవారు శ్రీ మా క వి గా రు. ఆమహనీయుని ఆశీర్వచన సంకల్ప బలములచేత, నేడు మనతెనుగునాట చాలమంది తమ ధ్యానమును కేవలమధోదృష్టితో మట్టుపరువక, ఒకప్పుడు

గాకున్న నొకప్పుడైనను, ఊర్ధ్వదృష్టికలిగి, తలయెత్తి గ్రహ నక్షత్ర తారాగణ శోభితమై 'లలితరుచినొప్పు నాకాశలక్ష్మి చెలువు' చూచుచుండుట, శుభావహము.

## గ్రహ, నక్షత్ర, తారాగణము

శాస్త్రదృష్ట్యా ఈ పదములకు భిన్నార్థములున్నవి. ఆయర్థభేదములను మొదట తెలిసికొనుట మేలు. గ్రహములు సూర్యకుటుంబములోనివి. ఎద్దు గానుగచుట్టు తిరిగి వచ్చునట్లు గ్రహములు, మధ్యస్థుడైన సూర్యుని చుట్టు, నియమబద్ధములై ప్రదక్షిణము చేయుచు ఖగోళమున సంచారము సలుపును - వీనికి స్వతస్సిద్ధమైన కాంతిలేదు. అద్దములవలె నివి సూర్యకాంతి ప్రతిఫలింప చేయుచుండును. అందుచేతనివి తళుకులతో మిణుకవు. గ్రహములు చాపల్యమెఱుగక నిలుకడ గన్నకాంతితో, నిబ్బరముగా సూర్యకాంతిని ప్రతిబింబింపజేయును. విశేషించి గ్రహములు ఇచ్చవచ్చినట్లు ఉత్తరమునగాని, దక్షిణమునగాని కనబడవు. ఆకాశమధ్యమున, శిరస్సులపై వానికొరకేర్పడిన వృత్తమార్గము ననుసరించి పోవలెను. ఆవృత్తమార్గమునకే, క్రాంతివృత్తమనియు దాక్షాయణీ చక్రమనియు, జ్యోతిశ్చక్రమనియు నామములుగలవు.

ఇక తారలు - ఇవి యిరువదేడు గుంపుల చుక్కలు. దక్షప్రజాపతి కూతులు. అశ్విని, భరణి మొదలగునవి యీ గుంపులకు పేర్లు. క్రాంతివృత్తము వీనిననుసరించి యుండును.

గ్రహములు, ఈ తారలలోబడి, వానివెంట నరుగుచున్నట్లు స్థూలదృష్టికి తోచును. ఇరువదేను, తారలను మినహాయించగా నభోరంగమున, నన్నిదిక్కులను తేజరిల్లు చుక్కలు నక్షత్రము లనబడుచున్నవి. నక్షత్రములకును తారలకును స్వతస్సిద్ధమైన తళుకు బెళుకులు గలవు. ఇందు కొన్ని మన సూర్యుని కంటె పరిమాణవిషయమున వందలు, వేలు, లక్షలు కోట్లురెట్లు పెద్దవైన బ్రహ్మాండ సూర్యులు. ధగధగ మెఱయు నక్షత్రములనుండి వెడలుకాంతి కిరణములు వజ్రపుటీటె లన దగిన తేజస్సుతో మనకనుల బడుచుండును.

ఈభేదములు తెలిసికోని పక్షమున ప్రమాదము లున్నవి — గ్రహములు నక్షత్రములని చాలమంది భ్రమ పడెదరు. తారలకు దాక్షాయణీచక్రమనుపేరు అమరమున నగపడుచున్నది. భాగవతము (IV-20) నందును, కాళిదాసు రఘువంశమునందును ఈభేదములు పాటించియున్నారు. ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయుల వారును (II—32) భిన్నార్థములలో నీ పదముల నుపయోగించిరి.

## భ వి ష్య త్తు

నేడు తెనుగునాట స్వార్థము, ధనార్జనాపరత్వము, అధికారవరణమునను నవి జీవితాశయములైనవి ముతాలుగా నేర్పడి మన నాయకులు దేవాసురులవలెను, కురుపాండవులవలెను తన్ను

కొనుచు నొండగులతో పోట్లాడుకొనుట చూడ నసహ్యాసుగు చున్నది. దేశము త్యాగవిజ్ఞానశూన్యమై సహారా ఎడారివలె అధ్వాన్నమై ఎటుజూచుకొనినను నిరాశగొలుపుచున్నది. మధ్య మధ్య చల్లని నీడలంతో నాశ్రయమిచ్చి, 'ఆహారమిచ్చి ప్రాణి కోట్లను తనుపుమహావృక్షములవలెను, నీరములిచ్చి తృష్ణనడంచు (Oasis) ఒయాసిస్సుల వలెను, అరుదుగా నైనను, త్యాగ మూర్తు లుద్భవించుటోకటే ముదావహము, శిబిచక్రవర్తి వలెను, సక్తుప్రస్థుకుటుంబమువలెను, స్వకీయత్యాగ ప్రభావ ముచే తేజోమూర్తులై, యీ మరుభూమిలో తెనుగునాడ నెడి యధ్వానమధ్యమున నంఖండాకాశమున మేటి నక్షత్రములవలె వారు. మెఱయుచుండుట శోభాప్రదము. తెలుగునాడు గొడ్డువో లేదు. వేదవిద్యనశించదు. మనము త్రికరణశుద్ధిగా పనిచేయు నెడల, మాతో శ్రీ దిగవల్లి సూర్యమాణిక్యాంబ, వేంకట శివరావు గారివంటి త్యాగమూర్తులు, మహాశయులు, వేదోద్ధ రణమునకు తప్పక తోడుపడగలరు. త్యాగమూర్తి తెనుగు వలువ, మా కవిగారు చేయూతయిచ్చి యింతవఱకు నన్ను నడిపించినారు. ఫలాపేక్ష లేక విధిని నెఱవేర్చుట మనవంతు. ఆపైన భగవంతుడున్నాడు. మనకేమి కొదువ? అని యం డగా, ఆంధ్రగీర్వాణ విద్యాపీఠము వారీ గ్రంథముద్రణభారము పైన వైచుకొని, జాయింటు కాపీరైట్ పద్ధతిని ఇపుడు ముద్రిత ప్రతులలో వేయి నాకు ఇచ్చుట కంగీకరించి నక్షత్ర గ్రంథమును ముద్రించి ప్రకటించుచున్నారు.

## వందనములు

లక్షరూపాయలు పైగా కిమ్మత్తు చేయు తమ ఆస్తిని తెనుగునాట గ్రంథప్రకటనకు వినియోగింపుమని మహౌదార్యముతో నిధి నేర్పఱచిన వల్లూరు సూర్యనారాయణ పంతులు గారి త్యాగము మిగులప్రశంసార్హము. వారిఆశయము ప్రకారము తెనుగునాట వెలువడుచున్న పాత్రములలో ఈ నక్షత్రములు గూడ చేర్పించుటకు చాల ఉత్సాహ పడిన విద్యాపీఠ ప్రధానాచార్యులు శ్రీ కేశిరాజు వేంకట లక్ష్మీనృసింహ అప్పారావు, M. A. గారికిని, విద్యాపీఠ కార్యక్రమము నడిపించు మేనేజరు కందుకూరి వీరబసవరాజు ఉభయభాషాప్రవీణులకును, గ్రంథమును నీటుగా నచ్చొత్తించిన సరస్వతీ పవర్ ప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ అడ్డేపల్లి నాగేశ్వరరావుగారికిని కృతజ్ఞతా వందనములు.

విరలాశ్రమము
శేషవిలాసము
ఏలూరు, ప. గో.
7-1-54

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

31



" లలితరుచి నొప్పు నాకాశ లక్ష్మి చెలువు "

# నక్షత్రములు

గొబ్బూరు వేంకటానందరాఘవరావు

# నక్షత్రములు



"చుక్కలసుద్ది యెద్దియొకో? చూడఁగఁ గందుమె?"

శ్రీనాధుఁడు.

"ఇదిగో! చూచితిరా? మన యీ భూలోకమునకు పైన అపారమైన అంతరిక్షము వ్యాపించియున్నది. స్వర్గ సంబంధమైన తేజస్సుతో కూడుకొని అరంగమెంతో మనోహరమై ఒప్పుచున్నది."

"ఇదం స్వరిదమిదాసవాము మయంప్రకాశా ఉర్వాంతరిక్షం"

ఋగ్వేదము X. 124. 6.

నీలపుగుబ్బగొడుగువలె భూమండలము నావరించి అపారముగా వ్యాపించియున్న ఆకాశమండలమునందు సూర్యుఁ డస్తమించినతరువాత నక్షత్రము లొక్కొక్కటి బయల్పడు చుండుట చూడ చిత్రముగా నుండును. పరమేశ్వరుని యంబరమున నలంకారార్థము దాపించినముత్యములవలె కొన్ని చుక్కలు మిణుకుమిణుకుమని మెఱయుచుండును. మఱికొన్ని ప్రవాళములో పద్మరాగములో యనునట్లు ఎఱ్ఱనికాంతితో తేజరిల్లును. మఱికొన్ని నక్షత్రములు మేటివజ్రములవలె దేదీప్యమానముగా మెఱసిపోవుచుండును. నక్షత్రములు చీకటి

రాత్రులలో మఱియు నద్భుతముగా నవరత్నములవలె ధగధగ మెఱసిపోవుచుండును. విశేషించి విశాలాకాశమున వింతగా వ్యాపించియున్న యీకాంతిపుంజములను చూచి, ఏమి? ఈచుక్కలచిత్ర మని యాశ్చర్యపడనివారును సంతోషము పొందనివారును ఉండజాలరు. Carlyle 'కార్లైల్' అను నాంగ్లవిద్వాంసుఁడు "Why does not some one teach me the constellations and make me at home in the starry Heavens, which are always overhead and which I do not half know to this day" అయ్యో! నాశిరస్సుపై నిత్యము మెఱయుచున్న యీనక్షత్రము లేవి యేవో నాకు సరిగా తెలియకున్నవి. ఈనక్షత్రము 'ఫలానా' అని నాకెవరైన నేఁడుఁగఁజెప్పిన పక్షమున నెంత బాగుండును? నక్షత్రములతో నాకిట్టిపరిచయము లభించిన పక్షమున తారామండల మధ్యానముగాక నాస్వగృహామువలె నాకెంతో రమణీయముగా తోఁచునుగదా?" అని వగచుచుండెడివాఁడఁట. శ్రీనాథుఁడు తెలిపినట్లు "లలితరుచి నొప్పు నాకాశలక్ష్మిచెలువు" ఇట్టిది - ఇఁతయాకర్షణీయము,-ఉజ్జ్వలము, ఆనందదాయకము.

ఏనక్షత్ర మేదో సరిగా వివరములు తెలియని కార్లైల్ పండితునివలెనే విచారించుచుండువారు మనదేశములోకూడ అనేకులు గలరు. జ్యోతిశ్శాస్త్రమునందు విశేషముగా కృషి జేసినఁగాని యీవివరములు తెలియరావని చాలమంది నిరు

త్సాహులై యూరకుండుచున్నారు. ముఖ్యమైన చుక్కలను గుర్తించుటకు ప్రతివారును జ్యోతిశ్శాస్త్రపారంగతులు కానక్కరలేదు. పువ్వులంగడికిఁబోయి చూచినపుడు—ఇది గులాబి; ఇది మల్లె; ఇది సంపెంగ; ఇది మరువము; ఇది దమనము; ఇది చేమంతి; ఇది బంతి; అని యీవిధముగా పుష్పజాతులను దెలిసికొనుటకు మనము ఓషధిశాస్త్రమును తుదముట్ట చదివి పండితులము కానక్కఱలేదు. ఆలాగుననే ముఖ్యమైన కొన్ని నక్షత్రములను తెలిసికొనుటకు జ్యోతిశ్శాస్త్రమున పాండిత్య మవసరము లేదు. వారమురోజుల కొకసారి రాత్రివేళ 7—8 గంటలప్పుడును, తెల్లవారుజామున 4—5 గంటల మధ్యను, ఒకొక్క పావుగంట సేపు ఖగోళమును బట్టి పరిశీలించిన పక్షమున మూడు, నాలుగు నెలలలో ముఖ్య నక్షత్రములను సులభముగా పోల్చి తెలిసికోఁగలము. తారలొకొక్కటే గుఱుతు తెలిసినకొలఁది ఆకాశరాజ్యమునందు క్రొత్తమిత్రులు దొరకుచున్నట్లు మన కెంతో సంతోషము కలుగుచుండును. మాసములు, ఋతువులు, గడచుచుండ, చుక్కలు కొన్ని ఆయాకార్తెలలో కనఁబడకయుండి, ఆకార్తె పోయి క్రొత్తకార్తె చొఱబడగానే సూర్యోదయపూర్వము తూర్పున నుదయించి (heliacal rising) మనన్దర్శన మిచ్చుచుండునపుడు చూచితిమేని మనకు వర్ణింపఁదరముగాని ఆనందము కలుగుచుండును. మనభరతభూమిలో సంవత్సరము పొడుగునను ఏమాసమున కేనాఁ జేపంచుగ

యని నిర్ణయింపఁబడెనో ఆ నిర్ణయమునకు జ్యోతిశ్శాస్త్ర రీత్యా ఏనక్షత్రములు ఆనాఁటి సూర్యోదయాత్పూర్వముగాని, సూర్యాస్తమయానంతరముగాని తూర్పున నుదయమగునో గమనించినపక్షమునను, ఏనక్షత్రమున కేదేవత యధిదేవతయో, అట్లగుటకు హేతువేమో యోజించి చూచినపక్షమునను, మనపూర్వఋషు లాయాదేవతాపూజ కాయాదినములను పండగలని యేల యేర్పఱచిరో, శాస్త్రాధారములతో కారణములు తేటతెల్లమగుచుండును.

పండుగలకొఱకే కాదు; నక్షత్రవిజ్ఞానము ఇతరవిధములచేతకూడ ఇహమున నెంతో ప్రయోజనకారి. సముద్రములమీఁద నౌకాయానము చేయువారికిని, అధ్వానపుటడవులను, ఇసుకయెడారులను గడచిపోవువారికిని, దారితప్పి పెడదారులఁబోయి చిక్కులుపడువారికిని, స్థలనిరూపణకును, కాలనిర్ణయమునకును ఈవిజ్ఞానము మిక్కిలి యనుకూలముగా నుండును. ఆఫ్రికా, అరేబియా, దేశములలోని యిసుకయెడారులలో నిరంతరము ప్రయాణములు సాగించు నరబ్బులలోనగుజాతులవారికి రాత్రులు మార్గము చూపుటకే భగవంతుఁడీనక్షత్రములను సృజించె నని ప్రవక్తయగుమహమ్మద్ కొరానులో నుగ్గడించెను. కొన్నినక్షత్రము లప్పుడున్నస్థానమునుబట్టి ఓడలోనివారు తాము ఏప్రదేశమునందున్నారో, అప్పటికి ఎంతవేళ యయినదో, గుణించి సులభముగా నిర్ణయించుకొనఁగలరు.

ఈ యిరువదవశతాబ్దిలో నించుమించుగా ప్రతిదేశము వారును తమనౌకాశాఖవారి సదుపాయమునిమిత్తము ఖగోళమునం దగపడు గ్రహనక్షత్రాదుల గమనవిశేషములను పూర్తిగా తెలిపెడి (Almanac) ఆల్మనాకు లనఁబడుగ్రంథములను ఏఁటేట ప్రకటించుచున్నారు. గడియారము లవసరము లేకయే నక్షత్రస్థానమునుబట్టి రాత్రి ఎంతవేళ అయినదో సరిగా చెప్పవచ్చును. ఇట్టిప్రయోజనము లటుండ, నక్షత్రములను పరికించి చూచుటవలన నిట్టిదని వర్ణింపరాని యానందము నాశ్చర్యమును మనకుఁ గలుగుచున్నవి. పెక్కుయుగముల నుండి యీనక్షత్రము లిట్లే మెఱయుచు మనభూమిని చూచుచున్నవి. ఈప్రపంచమునం దన్ని దేశములవారును బహుకాలమునుండి వీనిని గమనించుచున్నారు.

ఏభాషలోనైనను మహాకవులు రచించిన కావ్యములను చదువు విద్యార్థులకు ఆకవులభావములు స్పష్టముగా తెలిసికొనుటకుకూడ నక్షత్రవిజ్ఞానము అత్యవసరము. ఒకటిరెండుదాహరణముల చర్చింతము. దశరథునకు లేకలేక కలిగిన సంతానము—రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలువురును, 'రుచ్యాప్రోష్ఠపదోపమ' అనఁగా పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర నక్షత్రములు నాల్గింటివలెనే తేజముతో పెరిగి ప్రకాశించుచుండి రని వాల్మీకి రామాయణములో వర్ణించియున్నాఁడు. ఈ భాద్రపదనక్షత్రములేవో, ఎట్టివో, ఖగోళమున నెక్కడ

నేవిధమున ప్రకాశించుచున్నవో పరిశీలించి చక్కగా పోల్చి తెలిసికొనినఁగాని వాల్మీకి యీఘట్టమున నీరమ్యోపమ నేల రచించెనో గ్రహించి యానందింపఁజాలరు. ఇట్లే పునర్వసు 'మహామీన' మని వాల్మీకియు, సుదక్షిణాదిలీపులసమాగమము 'చిత్రాచంద్రమసోరివ' అని కాళిదాసును, 'స్వాతిం జరత్రిరిప వ్యాధానుగమ్యమాన తరళతారకామృగాః' అని బాణుఁడును, ఇంక ననేక కవు లనేక కావ్యములలో చేసిన దివ్యవర్ణనలను, రచించిన రమ్యోపమానములను, సరిగా అర్థము చేసికొని కవిభావము చక్కగా గ్రహించి యానందించుటకు విద్యార్థులకుఁగూడ నక్షత్రవిజ్ఞానము మిక్కిలి యవసరము. ఇట్టి విజ్ఞానము లేకపోవుటచేతనే నన్నయభట్టారక, శ్రీనాథాది మహాకవుల జ్యోతిర్విద్యాప్రభావము తెనుఁగునాఁట నుజ్జ్వలముగా మెఱయుట మాని మబ్బుచాటున మఱుఁగుపడుట మన దురదృష్టము.

విశేషించి ఈకాలములో పగలెల్ల విధివిరామములేక నడుచుబళ్లు, రైళ్ళు, మోటారులు, జీపులు, బస్సులు, లారీలు లోనగువానివలన రేఁగుదుమ్ము ధూళి కోలాహలములతో నెడతెగక జరుగువర్తకవ్యాపారాదు లగు నైహికవ్యాపకగోష్ఠితో కాలక్షేప మయినతరువాత రాత్రి నిశ్శబ్దముగ, ప్రశాంతముగ నాకసమువంక చూచి గ్రహనక్షత్రాదులను తిలకించి సృష్టి వ్యవహారములను గూర్చియు భగవంతుని

గూర్చియు యోజింపఁగడఁగితిమేని, "సీ॥ దివి వెల్గునక్షత్రదీప మాలికలచే నీజయోత్సవమును నిశలు సల్పు" నని సర్వమాన్య శతకకర్త వలెనే మనమును భావింపగలము. అంతేకాదు మహనీయ తేజోవిరాజమానములును, మహాద్భుతపరిమాణ ప్రకాశములును నగు నక్షత్రముల యనంత వికాసమునకును, మన యల్పత్వమునకును హస్తిమశకాంతరము — కాదు — హిమాలయమశకాంతరము కల దని తేటపడఁగలదు. అదియునుగాక కేవల మధోదృష్టితో మన నేత్రములను మనస్సును మట్టు చేయక సద్వినియోగముచేసి యూర్ధ్వదృష్టిగలవారమై చక్షుర్మనములను వికసింపజేయుకొంలఁది ఈశ్వర నిర్మితమైన విశ్వమను నీమహాభవనమునకు నక్షత్రములు గవాక్షములవంటి వనియు, ఈగవాక్షములద్వారా ఖగోళమును మనము పరిశీలించి తెలిచి చూచుకొంలఁది ఆపరాత్పరుని యనిరూపకకాల రూపము, విశ్వవ్యాప్తి, అనంతశక్తి లోనగుమహత్తరవిశేషములు మన కొంకింత గోచరింపఁగలవనియు గ్రహించి అనిర్వాచ్యములగు నానందాశ్చర్యవివశుల మగుదుము.

---

## 2. నక్షత్రశబ్దవ్యుత్పత్తి

చుక్కలకు స్వతస్సిద్ధమైన తేజస్సు ఉన్నను, పగటివేళ నయ్యది మన కతిసమీపముననున్న సూర్యుని విశేషతేజస్సు

చేత హరింపఁబడుటచేత నవి మఱుగుపడియుండును. పగటివేళ వానిక్షాత్రము— తేజస్సు — ప్రకటితము కాదు. కనుక నవి పగలు క్షాత్రహీనములై నక్షత్రము లైన వని శతపథబ్రాహ్మణమునందు తెలుపఁబడినది. రాత్రివేళల నమిత తేజస్సుతో నద్భుతముగా మెఱయుచుండిన నక్షత్రములు సూర్యోఁదుదయమగువేళకు కాంతిహీనములై కనఁబడకుండుట ప్రతిదినము ఉదయమున చూచుచున్నాము. ఈవిషయమును అనాది కాలమునుండి అనేక కవివరులు చమత్కారముగా నుత్ప్రేక్షించుచు రసవంతముగా వర్ణించియున్నారు. "విశ్వమునకు చక్షురింద్రియమువంటి వాఁడగు సూర్యభగవానుని పొడఁగని నంతనే చుక్కలు దొంగలవలె పారిపోయి అదృశ్యమగు" నని ప్రస్కణ్వుఁ డనుఋషి ఋగ్వేదములో వర్ణించెను. దమయంతీ స్వయంవరమునకు వచ్చిన నానాదేశముల రాజకుమారులు, నిషధరాజు నలుఁడు సభారంగమున ప్రవేశించినంతనే "సీ॥ నలినాప్తసన్నిధి నక్షత్రములువోలె" కాంతి తఱిగి కళావిహీనులై రని శ్రీనాథకవిసార్వభౌముఁడు శృంగారనైషధములో చమత్కరించినాఁడు. మఱియు నానైషధమునందే వేఱొకచోట (8-8) సూర్యోదయమును వర్ణించుచు, "సహస్రాంశుఁ డనువేటకాఁడు తనకిరణము లనెడిడేగలను, పిట్టలవేఁట కన్నిదిక్కులకు వదలఁగా, నక్షత్రము లనెడి పావురములీ కిరణపుడేగల రాకకు భయపడి తుఱ్ఱు మని ఎగిరి పారిపోయి

అదృశ్యములైన వని ఎంతో రమ్యముగా సాకవిసింహాుఁడు వర్ణించెను.

వీబర్-అఫ్రే- అను పాశ్చాత్యపండితులు నక్షత్రశబ్దము 'నక్త్ర' శబ్దభవ మనిరి. నక్త్ర మనఁగా రాత్రిని రక్షించునది' అని వార లర్థము చెప్పిరి. మాక్డొనెల్ పండితుఁడు చుక్కలు రాత్రిని పరిపాలించి యేలుచుండును గనుక నవి నక్షత్రములైన వని తెలిపెను. ఇట్లు అనేకపండితులు అనేక విధముల నక్షత్రశబ్దవ్యుత్పత్తిని గూర్చి భిన్నాభిప్రాయములను తెలిపిరి. రాత్రివేళ బహువిధముల రమ్యముగా ప్రకాశించు తారాసముదాయములు పగలు కనఁబడకపోవుటే ఈయుపమానములకు నుత్ప్రేక్షలకు వ్యుత్పత్తివివరణములకును కారణమగుచున్నది.

---

# 3. వేదవాఙ్మయమునందుఁ గల చుక్కల పట్టికలు

ఋగ్వేదములో చుక్కలపట్టికలు వివరింపఁబడలేదు. కాని కృష్ణయజుర్వేద మనఁబడు తైత్తిరీయసంహితయందును, మైత్రావరుణీయ, కాఠకసంహితలయందును, అథర్వవేదము, శతపథబ్రాహ్మణము లోనగు వేదవాఙ్మయమునందును, భార

తాదిగ్రంథములయందును ఈక్రింది నక్షత్రములు ఇరువది యేడును వరుసగా పేర్కొనఁబడినవి. ఇందు కొన్నింటికి నామభేదము లున్నవి. అవి యీాదిగువ సంగ్రహముగా చర్చించెదను.

ఇరువదియేడు నక్షత్రములు: చూ. తై. సం. సం. IV. 27. 29.

1. కృత్తిక, 2. రోహిణి, 3. మృగశీర్ష, 4. ఆరుద్ర, 5. పునర్వసు, 6. తిష్యము (పుష్యమి), 7. ఆశ్రేష, 8. మఘ, 9. పూర్వఫల్గుని, 10. ఉత్తరఫల్గుని, 11. హస్త, 12. చిత్త, 13. స్వాతి, 14. విశాఖ, 15. అనూరాధ, 16. జ్యేష్ఠ (రోహిణి), 17. విచృతీ (మూల). 18. పూర్వాషాఢ, 19. ఉత్తరాషాఢ, 20. శ్రోణ (శ్రవణము), 21. శ్రవిష్ఠ (ధనిష్ఠ), 22. శతభిషక్, 23. పూర్వప్రోష్ఠపద (భాద్రపద), 24. ఉత్తరప్రోష్ఠపద (భాద్రపద), 25. రేవతిఁ 26. అశ్వయుజౌ (అశ్విని), 27. భరణి.

---

## 4. ఇరువదేడు నక్షత్రముల విశేషము

ఆకాశమునందు చుక్కలు అనేకవే లుండఁగా, పై యిరువదేడు నక్షత్రములకు వేదకాలమునుండి నేటివఱకు ప్రాముఖ్యము కలుగుటకు కారణ మేమి? ఆకాశమునందు మన సూర్యచంద్రులమొక్కయు, సూర్యకుటుంబములోని

ఇతరగ్రహాదులయొక్కయు మార్గము—అనఁగా గురు, శుక్ర, శనైశ్చరాదిగ్రహము లేమార్గము ననుసరించి పోవుచున్నట్లు మన కగపడునో ఆమార్గము—ఈయిరువదేడు చుక్కల మీఁదు గానో లేక వీనిసమీపమందో ఉన్నట్లు కనబడును. ఈమార్గ మునకే క్రాంతిచక్రము—క్రాంతివృత్తము నని పేరులు గలవు. ఇంగ్లీషులో దీనికే Ecliptic అందురు. ఈగ్రహాలమార్గ మనఁగా నేమో స్పష్టముగా బోధపడుటకు మన మొక యుదాహరణమును గమనింతము. చెన్నపట్టణమునుండి వాల్తేరునకు ఒకరైలుబండి బయలుదేరిన దనుకొందము. ఈబండిచక్రములు ఒకదాని కొకటి యెదురుగా సుమారు 5½ అంగుళుల దూరమందు సమాంతరముగానున్న ఇనుప కమ్ములమీఁదుగా — దొర్లి పోవుచుండును. ఈ రైలు మార్గమునకు అటునిటు గలపట్టణములు, పల్లెటూళ్లు వీనిని బట్టి ఆయాగ్రామనామములతో స్టేషనులు కట్టబడినవి. చెన్న పురి, వాల్తేరుమధ్య మేలు బండ్లు, పాసెంజరు బండ్లు, గూడ్సు బండ్లు, మిలిటరీ బండ్లు-ఇట్టివి, ఏబండ్లు ఈమార్గమున నడచినను, ఈస్టేషనులమీఁదుగా నీమార్గము ననుసరించియే పోవుచుండును. ఈ మండలమందు వందలకొలఁది పట్టణములు వేల కొలఁది గ్రామములు కలవు. అయినను ఈరైలుప్రక్కల నున్నవి సుమారు వంద స్టేషనులు మాత్రమే. అశ్విని, భరణి, కృత్తిక మొదలగునక్షత్రములు ఆకాశముమీఁద గ్రహాదుల రస్తాప్రక్క స్టేషనులవంటివి. ఖగోళసంచారు లైన కుజ, గురు,

శుక్ర, శనైశ్చరాదిగ్రహముల గమనమార్గమున కటునిటు నున్నట్లు మన కగపడుచున్న చుక్కలును, చుక్కలగుంపులును ఈ యిరువదేడు మాత్రమే. కాఁబట్టి సూర్యకుటుంబములో చేరినగ్రహాదులరస్తావలె కనఁబడు మార్గమున పాతిన మైలురాళ్లవలెను, కట్టినస్టేషనులవలెను తోచు ఖగోళచిహ్నాములగుటచేత నీయిరువదేడు నక్షత్రములకు నిత్యవ్యవహారములో నెక్కువప్రాముఖ్యము కలిగినది.

---

# 5. ద్వాదశరాసులు

క్రాంతిచక్రమునందుఁ గల నక్షత్రము లిరువదేడును పంద్రెండురాసులక్రింద నున్నవి. ఇరువదియేడును పంద్రెండుచేత భాగింపఁగా $2\frac{1}{4}$ వచ్చును. కాఁబట్టి ఒక్కొక్కరాశి రెండునక్షత్రములపాతిక యని స్పష్టముగా తెలియుచున్నది.

అశ్విని + భరణి + కృత్తిక $\frac{1}{4}$. కృత్తికలో 1 పాదము మేషరాశి యగును. కృత్తిక $\frac{3}{4}$. మిగిలిన మూఁడుపాదములు+ రోహిణి + మృగశిర $\frac{1}{2}$— వృషభరాశి; మృగశిర $\frac{1}{2}$. మిగిలిన రెండుపాదములు+ఆర్ద్ర+పునర్వసు $\frac{3}{4}$- మిధునరాశి; పునర్వసు $\frac{1}{4}$. మిగిలినపాదము + పుష్యమి + ఆశ్రేష. ఇవిచేరి కర్కటకరాశి; మఘ+పూర్వఫల్గుని+ఉత్తరఫల్గుని $\frac{1}{4}$. ఒకపాదము చేరి

సింహరాశి. ఉత్తరఫల్గుని $\frac{3}{4}$ మూడుపాదములు+హస్త+చిత్ర$\frac{1}{2}$ రెండుపాదములు కన్యరాశి. చిత్రలో మిగిలిన$\frac{1}{2}$ + స్వాతి +విశాఖ $\frac{3}{4}$ మూడు పాదములుచేరి తులారాశి; విశాఖ$\frac{1}{4}$ + అనూరాధ+జ్యేష్ఠ చేరి వృశ్చికరాశి; మూల+పూర్వాషాఢ+ ఉత్తరాషాఢ $\frac{1}{4}$ చేరి ధనుస్సురాశి; ఉత్తరాషాఢ మిగిలిన మూడు పాదములు$\frac{3}{4}$+శ్రవణము+ధనిష్ఠ $\frac{1}{2}$ మకరరాశి; ధనిష్ఠ$\frac{1}{2}$ +శత భిషము + పూర్వాభాద్ర $\frac{3}{4}$ చేరి కుంభరాశి; పూర్వాభాద్ర మిగిలినపాదము + ఉత్తరాభాద్ర + రేవతి - ఇవిమీనరాశి- ఈ విభజనప్రకారము మృగశిర, చిత్ర, ధనిష్ఠనక్షత్రములు ద్విపాదులు; కృత్తిక, పునర్వసు, ఉత్తరఫల్గుని, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్రలు త్రిపాదులు.

---

## 6. మిథ్యాపవాదము

ఈద్వాదశరాసులను మనవారు గ్రీకులనుండి నేర్చుకొని రనియు అంతకుముందు మనపూర్వులకు రాసులసంగతే తెలియ దనియు మిథ్యాపవాదము గట్టిగా ప్రబలియున్నది. మన పెద్దలు ఈ రాసులను "గ్రీకులనుండి నేర్చుకొనిరిగాని యంతకుపూర్వ మెఱుంగ" రనుట కేవలము అబద్ధమని మనవిచేయుచున్నాను. ఈరాసులప్రశంస వేదములలోను వేదవాఙ్మయములోను

గూడ స్పష్టముగా కలదని సోపపత్తికముగా నాజ్యోతిర్వేదములో నిరూపించియున్నాను.

---

# 7. మాసనామములు

మన చైత్రాదిమాసములకు ఆయానామములు కలుగుటకు ఇందు కొన్ని నక్షత్రముల నామములే కారణములు. ఎట్లనఁగా, ఒకమాసములో చంద్రుఁడు పున్నమనాఁడు ఏనక్షత్రముచెంత నున్నట్లు కనఁబడునో ఆనక్షత్రము పేరుతోనే ఆమాసము వ్యవహరింపఁబడుచున్నది. చిత్ర + పున్నమి → చైత్రమాసము; విశాఖ + పున్నమి → వైశాఖమాసము; జ్యేష్ఠ+పున్నమి → జ్యేష్ఠమాసము; అషాఢ + పున్నమి → ఆషాఢమాసము; శ్రవణము+పున్నమి → శ్రావణమాసము; భాద్రపద + పున్నమి → భాద్రపదమాసము; అశ్వని (ఆశ్వయుజౌ) + పున్నమి → ఆశ్వీజమాసము; కృత్తిక +పున్నమి → కార్తికమాసము; మృగశిర + పున్నమి → మార్గశిరమాసము; పుష్యమి+పున్నమి → పుష్యమాసము; మఘ+ పున్నమి → మాఘమాసము; ఫల్గునీ+పున్నమి → ఫాల్గునమాసము. ఇట్లు ఖగోళహేతువులచే మన మాసనామములేర్పడినవి కాని మానవమాత్రుల నామసంపర్కముతో నేర్పడినవి కావు. (చూ॥ జూలియస్ సీజరుపేర జూలై, అగస్టస్ పేర ఆగస్టు)

## ప్రతిదిన నక్షత్రములు

నిత్యవ్యవహారములో మనపంచాంగపాఠకులు "ఈవేళ ఈనక్షత్రము" అని పైయిరువదేడింటిలో నేదోయొక నక్షత్రముపేరు చెప్పుదురు. 'ఈవేళ రోహిణీనక్షత్ర మం'దురు. అనఁగానేమి? మనకు నేఁటిరాత్రి రోహిణీనక్షత్రముతోఁ గూడి చంద్రుఁడుకనఁబడు నని యర్థము. చంద్రుఁడు ఇరువదేడుదినములు సుమారులో ఒకసారి క్రాంతిచక్రమును చుట్టివచ్చుచున్నట్లు మనకగపడును. కనుక ఒక్కొక్కరాత్రి ఇందొక్కొక్కనక్షత్రముతో కూడియున్నట్లు చంద్రుఁడు మనకు గోచరించును. ఈయంశము జనసామాన్యమునకు సులభముగా బోధపడుటకుగాను చంద్రునికి ఇరువదేడుగురు భార్యలు కలరనియు అందొక్కొక్కభార్యతో నొక్కొక్కరాత్రి గడుపు ననియు చమత్కరించి పురాణాదిగ్రంథములలో వర్ణింపఁబడియున్నది.

---

## 9. ఉత్తరాకాశమున మెఱయు ముఖ్య నక్షత్రములు

సూర్యచంద్రాదిగ్రహముల గమనమార్గమైనట్టి గగనమధ్యభాగమున మనకు కనఁబడు క్రాంతిచక్రపరిధికి మీఁదుగానో ప్రక్కలనో ఉన్నస్థేషములు లేక మెలురాశ్లని చెప్పఁడగిన

నక్షత్రముల నిరువదేడింటిని పైని పేర్కొనియుంటిమి. ఇవి గాక ఉత్తరాకాశమునను దక్షిణాకాశమునను ఉజ్జ్వలముగా మెఱయు చుక్కలనేకములుగా గలవు. ముందుగా ఉత్తరాకాశమున తేజరిల్లుచుండు జంటమెలుగుల చుక్కలు, సప్తఋషులు, ధ్రువుడులోనగు తారాసముదయము లన్నింటిలో మొదట మనముపోల్చి తెలిసికోవలసినది ధ్రువతార.

---

# 10. ధ్రువుఁడు

ప్రాచీనపురాణగాథలలో ఉత్తానపాదుఁ డనుపేరు గల రాజఋషికి ధ్రువుఁడు కుమారుఁడని చెప్పబడినది. కాఁబట్టి మనవారు ధ్రువుని "ఔత్తానపాది" యందురు. తన సవతితల్లి యాడిన పాడుమాటలకు రోషించి, ధ్రువుఁడు బాల్యమునందే గొప్పతపస్సుచేసి భగవంతుని మెప్పించి దివ్యమైనవరములఁ బడసి తుదకు ప్రాముఖ్యమైన నక్షత్రస్థానము నందఁగలిగెను. ధ్రువుని పరివేష్టించి కొలుచుచున్నవో యన్నట్లు చుక్కలు ధ్రువునిచుట్టు తిరిగి వచ్చుచున్నట్లు మన కగపడును. కాఁబట్టి శ్రీనాథమహాకవి ధ్రువుఁడు "తారకావళితులాదండయష్టి" యని కాశీఖండమునందును, "ఆకాశమండలాస్థానరత్నము" అని శృంగారనైషధమునందును ఎంతో రమ్యముగా ధ్రువుని వర్ణించియున్నాఁడు. నలదమయంతుల వివాహసమయమునందు

అవధూవరు లిసువుకును, "సీ. అత్రిత్రిచూచిరి ఆకాశమండలాస్థానరత్నంబు నౌత్తానపాది" అని నైషధములో ధ్రువ ప్రశంస. "త్రైలోక్యమంటప స్తంభ సంభారము", "గగనలక్ష్మీకంఠకనకభూష" ఇత్యాద్యాలంకారభాషాప్రశంసలలో శ్రీనాథ మహాకవి ధ్రువుని ప్రాముఖ్యము తాను గ్రహించి ఆంధ్ర లోకమునకు చక్కగా వ్యక్తము చేసియున్నాఁడు.

ఖగోళమును జాగ్రతగా పరిశీలించి తఱచుగా చూచు వారికి, సూర్యునిచుట్టు పరిభ్రమించు గ్రహకుటుంబములో బుధశుక్రులును, కుజుఁడును వేగముగాను, గురుఁడును శనియు మందముగాను చలించుచున్నట్లును, నక్షత్రములన్ననో గమనించుటకు వీలు గానంతస్వల్పముగా చలించుచున్నట్లును కనఁబడును. కాని ధ్రువుఁడు మాత్రము చలింపక ఉత్తరదిశను కొట్టిన వజ్రపుమేకులాగున పాఁతుకొని పోయి, కదలక మెదలక సుస్థిరముగా నున్నట్లు మనకగపడును. యంత్రసాహాయ్యముతో జాగ్రతగా పరిశీలించిన పక్షమున ధ్రువునికి కూడ చలనము కలదని గ్రహింపఁగలము. "ధ్రువస్యస్థానాదపసరణమ్" అను నుపనిషద్వాక్యము ప్రకృతిలో గొప్ప వైజ్ఞానికసత్యము.

ఒకానొకయిరుసుచుట్టును భూగోళము తనలో తాను తిరుగుచుండుటచేత రాత్రి పగలు అనుభేదము కలుగుచున్నది. సంవత్సరకాలములో నొకసారి సూర్యునిచుట్టును భూమి అండవృత్తమార్గమున తిరిగివచ్చుచుండుటచేత వసంతహేమంతాది

ఋతుభేదములతో అయనభేదము కలుగుచున్నది. భ్రమ పరిభ్రమ లనఁదగు నీరెండుగమనములేగాక భూమికి మఱొకచమత్కార గమనముగూడ కలదు. భూమి కేవలము గుండ్రని గోళముకాదు. ఏమనగా ఈగోళము భూమధ్యరేఖాప్రాంతములందు ఉబ్బెత్తుగాను ధ్రువప్రాతములందు కొంత చదునుగాను, ఉండుటచేత కొన్ని విచిత్రఫలితములు కలుగుచున్నవి. ఉబ్బెత్తుగానున్న భూమధ్యరేఖాప్రాంతములపై సూర్యాకర్షణప్రాబల్యముచేతను, చంద్రాకర్షణశక్తిచేతను, ఏయిరుసుచుట్టు భూమితనలో తాను తిరుగుచున్నదో, ఆయిరుసు-యామ్యోత్తరవ్యాపియైన (axis) భూగోళపుటక్షము,—ఉత్తరాకాశమున నెల్లకాలము నొకేబిందువును సూచింపక స్వల్పముగా వ్యత్యస్తము నొందుచుండును. ఈ యిరుసు సుమారు ఇరువదియారువేల సంవత్సరములకు ఉత్తరాకాశమున నొకవలయమును పూర్తిగా రచింపఁగలదు. విషువద్బిందువు—Equinoctial Point-స్థిరముగా నుండకపోవుటకును, అయనచలమునకును—Precession-of the Equinox- కారణము భూమియిరుసు ఉత్తరాకాశముపై నీవలయము సంపూర్తిచేయుచు పరిభ్రమించుటే యని తెలిసికొందము. ఈవలయపుపరిధిపై నుండిన యేనక్షత్రమును, భూమియొక్క యిరుసు చూపుచుండునో ఆనక్షత్రమే ఆకాలమునఁ ధ్రువస్థానమునుండి చలనములేక స్థిరముగా నుండి ధ్రువుఁడైనట్లును తక్కిన గ్రహనక్షత్రతారాగణము లాధ్రువునిపరిక్క చుట్టును తిరిగి వచ్చుచున్నట్లును

మానవుల కగపడుచుండును. మహత్తరమగు నీఖగోళసత్యమే ధ్రువచరిత్రవ్యాజమున భాగవత చతుర్థస్కంధములో చమత్కారముగాఁ దెలుపఁబడినది.

చూ. సంస్కృతభాగ. IV. 9. సం. అ. శ్లో. 19, 20, 21, 22,

విష్ణుభగవానుఁడు ధ్రువునితో నిట్లనుచున్నాఁడు :—



1. నారాయణమూర్తి

"వేదాహంతే వ్యవసితం హృది రాజన్య బాలకః
యత్రగ్రహర్క్షతారాణాం జ్యోతిషాం చక్రమాహితం
మేఢ్యాం గోచక్ర వత్స్థాస్ను పరస్తాత్కల్పవాసినః
ధర్మోఽగ్ని కశ్యపః శక్రో మునయో యేవనౌకసః
చరంతి దక్షిణీకృత్య భ్రమయంతస్సతారకాః
షట్త్రింశద్వర్ష సాహస్రం రక్షితా వ్యాహ తేంద్రియః"

ఆంధ్రభాగవతము. IV. 289, 290 రచనలలో బమ్మెర పోతరాజకవి పై శ్లోకముల నిట్లు తెనిగించెను.

"క. ధీరవ్రత రాజన్యకు
మారక నీహృదయమందు మసలిన కార్యం
బారూఢిగ నెఱుంగుదు
నారయ నది పొందరానిదైనను నిత్తున్."

"వ. అది యెట్టిదనిన నెందేని మేధియందు పరిభ్రామ్యమాణగోచక్రంబునుంబోలె గ్రహనక్షత్రతారాగణజ్యోతిశ్చక్రంబు నక్షత్రరూపంబులైన ధర్మాగ్నికశ్యపశక్రులును, సప్తఋషులును దారకాసమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు రట్టి ధ్రువక్షితి యనుపథంబు ముందట నిరువదియారు వేలేండ్లు సనం బ్రాపింతువు."

ధ్రువక్షితివలయనిర్మాణము సుమారు ఇరువదియారు వేల సంవత్సరములకు పూర్తియగు ననువైజ్ఞానిక సత్యము

(Scientific truth )పాశ్చాత్యగ్రంథకారులు రచించినPioneers- of Science, Constellations and how to find them, Stars in their courses మొదలగు నింగ్లీషు గ్రంథములలో నేను మొదట చదివి తెలిసికొనిన తరువాత భాగవతము చదివినపుడు ఈయంశమే ఇందులో నింతస్పష్టముగా వివరింపఁ బడియున్నందుకు నేనెంతో అశ్చర్యము నొందితిని.

మన తెనుఁగువారికి సంస్కృతాంధ్ర గ్రంథములయందు ఆదరము చాల తక్కువ. భగవద్భక్తులైన కొలఁదిమంది గజేంద్రమోక్షము, ప్రహ్లాదచరిత్ర లోనగునవి చదువుకొందురు. శృంగార ప్రియులైన యువజను లెంతలేసి కన్నులతోనైన "ప్రాంచద్భూషణ" పద్యములను చదివి "ఆనందో బ్రహ్మ" యని బ్రహ్మానందము నొందుదురు. ఇతరులకు ఏపద్యము లును అవసరము లేదు. వచనరచనలు చప్పిడివగుటచేత వాని నెంత కేపాఠకులును పోనేపోరు. అందును "ఇరువదియారు వేలు" మొదలగు "బోడిలెక్కలు" ఎవరికి గావలెను? ఇవ న్నియు "Wretched calculations-sheer nonsense" అని యాంగ్లభాషాకోవిదు లగు మనయువజను లొక్కస్టాంపు వేయుదురు. ఈదురవస్థమిక్కిలి దుఃఖకరమయినది. ఈస్థితి మారిపోయి ఇకనైనను మనయువతీ యువకులకు మనపూర్వ గ్రంథములయం దాదరము కలుగవలెను. ప్రాచీనకావ్యము లను మనము జాగ్రతగాచదివి సరిగాఅర్థము చేసికోవలెను.

అట్లు చేసినపక్షమున నందలియంశములు మనపూర్వఋషులు విశేషపరిశీలనచేసి కనిపెట్టిన గొప్పసత్యము లనియును, పురాణ కథాస్వర్ణవస్తువులలో వార లీజాతిరత్నముల నేర్చి నిరుపమాన కౌశలముతో కూర్చి నారనియు తప్పక తెలిసికొనఁగల మనియు నామనవి.

---

# 11. ఋక్షద్వయము - సప్తఋషులు

ధ్రువునిచుట్టును తిరుగు నట్లగపడు నక్షత్రములలో ఋక్షద్వయ మనఁబడుచుక్కలగుంపులు ధ్రువుని కతిసమీప మున నుండి చాలముఖ్యమయినస్థానము నలంకరించుచున్నవి. ఋక్ష మనఁగా 'ప్రకాశించునది' అని యొకఅర్థము; భల్లూ కము, ఎలుగుగొడ్డని రెండవఅర్థము. ఇందలినక్షత్రములు సూచించు ఆకారములనుబట్టి వీనికి పెద్దయెలుగు, చిన్నయెలుగు నని యర్థమిచ్చు బృహదృక్షము, లఘుఋక్షమునని పేరులు పెట్టిరి. పడమటిదేశస్థు లీచుక్కలగుంపులకు అర్సా మేజరు Ursa Major ఆర్సా మైనరు Ursa Minor అనునామము లుంచి వ్యవహరించుచున్నారు. పాశ్చాత్యుల Ursa ఆర్సా శబ్దము 'ఋక్ష' శబ్దవికృతిగా కనఁబడుచున్నది. బృహదృక్షపు చుక్కలలోనున్న "గగనముని రాజులే" సప్తఋషులన నొప్పుచున్నారు.

ఈసప్తఋషు లెవరెవరో వారినేలాగు గుర్తించి తెలిసి కోవలెనో యీాదిగువ సప్రమాణముగా నిరూపించుచున్నాను.

(౧) వరాహ మిహిరాచార్యులవారు బృహత్సంహిత లోని సప్తఋషిచార మనునధ్యాయములోని ౫. ౬. శ్లోక ములలోనిట్లు వివరించినారు:—

"శ్లో. పూర్వేభాగే భగవాన్ మరీచి రపరే స్థితో వసిష్ఠో తస్మాత్ తస్యాంగిర స్తతోఽత్రి స్తస్యా సన్నః పుల స్త్యశ్చ పులహక్రతు రితి" "భగవానాసన్నాఅనుక్రమేణ పూర్వాద్యాత్ తత్ర వసిష్ఠమునివర ముపాశ్రితారుంధతీసాధ్వీ"

౨. భాగవత ద్వాదశస్కంధము ద్వితీయాధ్యాయము 27 శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచు శ్రీధరా చార్యులవా రిట్లు వివరించినారు.

"ప్రాగగ్రశకటాకారం తారాసప్తకం సప్తఋషిమండలం; తత్ర కించిదున్నతే తేషామగ్రస్థానీయోమరీచిః; తతః పశ్చాదానమ్రయుగ కంధరాకారో వసిష్ఠస్సభార్యాః; తతః పశ్చాదీషదుత్తరస్థానీయోఽంగిరాః; తతః పశ్చాచ్చతురస్ర తారాచతుష్కోణ ఐశాన్యే అత్రిః; తతో దక్షిణతః పులస్త్యః; పులస్త్యాత్పశ్చిమతః పులహః; తతః ఉత్తరతః క్రతుం"— తూర్పున కాడిమొన గలబండివంటి ఆకారముగల నక్షత్రము లేడును సప్తఋషిమండలము. అందు తూర్పుకొనను కొంచెము

ఎత్తుగానున్న నక్షత్రము మరీచి. మరీచికి పశ్చిమమున దిగువ వంగిన కాడివలె వసిష్ఠుడును, భార్య అరుంధతియును ఉన్నారు. వసిష్ఠునకు పడమట, కొంచెమెత్తుగా అంగీరసుడు ఉన్నాడు. అంగీరసునకు పడమట బండిగూడువలె నాలుగుచుక్కలున్నవి.



2. పులహక్రతురేఖ ధ్రువసూచకము

ఈ చతుష్కోణములో ఈశాన్యభాగమున నత్రియును. అత్రికి దక్షిణముగా పులస్త్యుడును, పులస్త్యునకు పశ్చిమముగా పులహుడును, పులహున కుత్తరముగా క్రతుఋషియు నున్నారు. వీరలేడుగురును సప్తఋషులు. ఇక్కడి పటములో

1 క్రతువు, 2 పులహుఁడు, 3 పులస్త్యుఁడు, 4 అత్రి, 5 అంగీరసుఁడు, 6 వసిష్ఠుఁడు, వసిష్ఠునిప్రక్క ఆవగింజవలె మిణుకు చిన్నచుక్క అరుంధతి, 7 మరీచి. వసిష్ఠునిప్రక్క అరుంధతీ దేవిని శ్రీనాథమహాకవి "పరమపతివ్రతాపరిషచ్ఛిరోమణి" యనియు, "త్రైలోక్యపతి దేవతాఫాలతిలకము" అనియును దివ్యముగా ప్రశంసించియున్నాఁడు. మఱియు నాకవి సార్వభౌముఁడు, కనులకు కట్టినట్లు వర్ణించిన విధముగా, నలదమయంతులేకాక, వివాహకాలమందు నేఁటికిని వధూవరులెల్లరును

గీ. కేలుదోయొత్తి యాదలఁ గీలుకొలిపి

గగన మునిరాజులైనచుక్కలకు." మ్రొక్కుచుందురు. అప్పుడే అరుంధతీసాధ్వి దర్శనము చేసికొందురు.

---

## 12. ధ్రువనక్షత్రమును పోల్చుకొనుట

పైని వ్రాసిన 7 చుక్కలలో రెండవది పులహుఁడు. ఒకటి క్రతుఋషి. పులహక్రతులమీఁదుగా – అనఁగా 2–1 సంఖ్యలు గల చుక్కలమీఁదుగా ఒకఋజురేఖ గీసినపుడు ఆరేఖ యించుమించుగా ధ్రువతారమీఁదుగా పోవును. పులహక్రతుల మధ్య నగపడుదూరముకంటె క్రతు-ధ్రువుల మధ్య దూరము సుమారైదురెట్లుండును. ధ్రువుఁడు చిన్నవెలుఁగు



3. సప్తఋషులు ధ్రువనక్షత్రముచుట్టు తిరుగుచుండుట

తోక చివర నుండును. చిన్నయెలుగుతోకూడ ధ్రువునితో కలిపి ఏడుచుక్కలున్నవి.

---

## 13. లఘుఋక్షము నందున్న కళ్యాపాదులను గుర్తించుట

లఘుఋక్షమునందు ధ్రువుఁడుకాక తక్కిన ఆరు చుక్కలపేరులుకూడ మనము తెలిసికొనవలెను. చిన్నయెలుగు

తోఁకచివరను ధ్రువుఁ డున్నాఁడుకదా! తోఁకలో ధ్రువుని కతిసమీపమున నున్నచుక్క కశ్యపుఁడు; కశ్యపునిప్రక్కనే మహేంద్రుఁడు. మహేంద్రుని కావల నీయెలుగుతోఁకమూల మున్నది. 'అగ్ని' చుక్క. ఆచుక్క కెదుట మిత్రుఁడు. మిత్రుని కెదుట నున్నరెండుచుక్కలు ధాత, విధాతలు. వీరిరువురును ధ్రువరక్షకులు. Guards of the Pole Star అనియును, పులహక్రతుఋషులు Pointers of the Pole tar ధ్రువ సూచకు లనియు పాశ్చాత్యజ్యోతిశ్శాస్త్రజ్ఞులు తెలుపుదురు. లఘుఋక్షములో చుక్కలనామము లని పైని తెలిపిన నామములకు ప్రమాణము లిచ్చుట యావశ్యకము.

యజురారణ్యకమునందు శింశుమారవర్ణన మిట్లున్నది:- "అగ్నిఃపుచ్ఛస్య ప్రథమంకాణ్డం తత ఇంద్ర స్తతః ప్రజాపతి రభయగ్ం (ధ్రువమ్) చతుర్థగ్ం" ఇందు ప్రజాపతి యనఁగా కశ్యప్రజాపతియేగాని మఱొకప్రజాపతి కాఁజాలఁడనుటకు మత్స్యపురాణములోని 125 అధ్యాయము 95 వ శ్లోకము ప్రమాణము: "పుచ్ఛేగ్నిశ్చమహేంద్రశ్చమారీచం కశ్యపో ధ్రువః ఏషతారామయ స్తంభోనా స్తమేతి నచోదయమ్" కశ్యపుఁడు మరీచి పుత్రుడగుటచేత "మా రీ చం క శ్య పో" అని పైశ్లోకమున వివరింపఁబడినది. మనదేశప్రాంతములలో లఘుఋక్షపుచుక్కలకు ఉదయము అస్తమయము ననునవి

లేనేలేవు. మేఘము లావరింపనిచో ప్రతిరాత్రియు నచలు డైతోఁచు ధ్రువునిచుట్టును ప్రదక్షిణము చేయుచున్నట్లు కనఁబడునిందలి తక్కిన చుక్కలను—ధాత, విధాత, మిత్రుడు, అగ్ని, మహేంద్రుడు, కశ్యపుఁడు వీరిని మనము స్పష్టముగా చూఁడగలము. ఉత్తరధ్రువప్రాంతములకు సమీపమందున్న ఇంగ్లండు మొదలగు దేశములవారు సప్తఋషులను అనఁగా పెద్దయెలుగులోని చుక్కలను ప్రతిరాత్రి చూడఁగలరు. అక్కడ ఆచుక్కలకు కూడ ఉదయాస్తమానములు లేనందున, ఆదేశస్థులు బృహదృక్షపుచుక్కలను కూడ Circum Polar Stars అని చెప్పుకొందురు. కాని మనప్రాంతములలో సప్తఋషులు ఇంచుమించుగా మఘనక్షత్రముతో నుదయించి మఘతోనే అస్తమింప నారంభింతురు. వారికి ఉదయాస్తమానము లున్నవి. లఘుఋక్షపుచుక్కలకు మాత్రమే మనదేశములో ఉదయాస్తమానములులేక సదా ధ్రువప్రదక్షిణము చేయుచు కనఁబడుచుండును. కావున లఘుఋక్షపుచుక్కలే మనకు Circum Polar stars అని చెప్పదగినవి. ఈచిన్నయెలుగుతోక మూలను ధాత విధాత లున్నారనుటకు భాగవతము V13. 4 "పుచ్ఛమూలే ధాతావిధాతా చ"అను వాక్యము ప్రమాణము. 'మిత్రో అపానే సమాశ్రితః' అని వాయు పురాణము 52-94 లో కలదు.



4. లఘుఋక్షము – అందున్న నక్షత్రములు

పై ప్రమాణముల నన్నిటిని పరిశీలింపఁగా కశ్యపుఁడను నక్షత్రము లఘుఋక్షపు పుచ్ఛమున ధ్రువుని ప్రక్కనున్నట్లు స్పష్టమగుచున్నది. మనవారు కొందఱు బృహదృక్షమునందలి చుక్కలేడింటిని చూపి అవి "కశ్యపోత్రిభరద్వాజ విశ్వామిత్రోఽథగౌతమః! వశిష్ఠోజామదగ్న్యశ్చ సప్తైతే ఋషయస్తథా" అని నిరూపించుట సిద్ధాంతశాస్త్రసిద్ధముకాదని విన్నవించుచున్నాను.

భాసమహాకవి ఒక సందర్భములో ఎగిరిపోవుచున్న కొంగలగుంపును సప్తఋషినక్షత్రములతో నుపమించినాఁడు.

"ఋజ్వాయతాంచ విరళాంచ నతోన్నతాంచ సప్తర్షివంశకుటిలాంచ నివర్తనేషు :"

సప్తఋషులు ఋగ్వేదములో పలుతావులందు ప్రశంసింపఁబడియున్నారు. అందుముఖ్యమయినది విశ్వప్రభుఁడీ ఋషిగణమునకు పరుఁడై యున్నాఁడని విశదముచేసినమంత్రరాజము. ఋగ్వేదము X. 82. 2 లో కలదు.

"యత్రాసప్తఋషీన్ పరఏకమాహుః"

ఈసందర్భములో మనము గమనించతగిన విశేషమేమనగా, క్రైస్తవవేదమైన బైబిలు (Bible) లో, Amos ప్రకరణమునందు 5-8 రచనలలోకూడ ఇదే విధమున సృష్టికర్త ప్రశంసింపబడుట :-

"Seek Him that maketh the Seven Stars"

---

# 14. సప్తఋషులకు, కృత్తిక చుక్కలకు గల సంబంధము

మన మింతవఱకు ఋక్షద్వయమునందున్న నక్షత్రములతోను, వాని నామములతోను పరిచయము కలిగించుకొంటిమి. మన సప్తఋషులలో వసిష్ఠ-అరుంధతీ నక్షత్రము

లను మినహాయించగా, శేషించిన ఆఱుచుక్కల రూపములు కలిగి, కృత్తికలనబడు చుక్కలు నభోరంగమున మిణుకుచుండును. కృష్ణయజుర్వేదపు నక్షత్రఇష్టిచుక్కల పట్టికలో మొట్టమొదట కృత్తికలే పేర్కొనబడినవి. అరుంధతీ వసిష్ఠులుగాక మిగిలిన బృహద్రృక్షపుచుక్కల రూపము కృత్తికలకు కలుగుటకు కారణములను తెలుపు గాథలున్నవి.

అగ్నిదేవుఁడు. సప్తఋషుల భార్యలను కామించి, వారికొఱకు మనోవ్యథ పాలుకాఁగా, అగ్ని భార్యయగు స్వాహాదేవి, ఒకొక్కరోజున కొకొక్క ఋషిపత్ని రూపము చొప్పున ఆరురోజులు ఆరుగురు ఋషిపత్నుల రూపము ధరించుచు వచ్చి తనభర్తను సంప్రీతుని చేయగలిగెనట! కాని, "పరమపతివ్రతాపరిషచ్ఛిరోమణి" యగు నరుంధతీదేవి రూపము మాత్రము ధరించుట స్వాహాదేవికి ఏమాత్రమును సాధ్యము కాకపోయెను. చూ. సంస్కృతమహాభారతము, అరణ్యపర్వము 224 వ అధ్యాయము; 14-15-16 శ్లోకములు:-

14. "సప్తానామపి సాదేవీ సప్తఋషీణామ్ మహాత్మనామ్
పత్నీరూపతాం కృత్వాకామయామాస పావకమ్.

15. దివ్యరూపమరుంధత్యాః కర్తుం నశకితం తయా
తస్యాస్తపః ప్రభావేణ భర్తృశుశ్రూషణేనచ.

16. షట్కృత్వస్తత్తు నిక్షిప్తమగ్నే రేతః కురూత్తమ
తస్మిఁకుండే ప్రతిపది, కామిన్యాస్వాహయాతదా".

ఇట్లు అగ్నిభార్యయగు స్వాహాదేవి, తపశ్శక్తినంపన్నురాలును భర్తృశుశ్రూషా పరాయణయునగు నరుంధతి వేషము తప్ప ఆఱుగురుఋషుల భార్యల వేషములనుధరించి తనభర్తయగు అగ్నిదేవునితృప్తిపఱచి అతని తేజస్సునుగ్రహించి, శ్వేత పర్వతశర స్తంబమునందు నదీతీరకాంచన కుండమున దినదినము నిక్షేపించుచురాగా, రాగా, అజవనాటికి ఆఱు శిరములు, పండ్రెండుచెవులు, పండ్రెండుభుజములు, పండ్రెండునేత్రములు, ఏకగ్రీవము, ఏకజఠరముగల మహాద్భుత శరీరముతో కుమారస్వామిప్రభవించెను. చూ. మహాభారతము. ఆరణ్య 224-18:-

శ్లో॥ షట్ శిరాద్విగుణ శ్రోత్రో ద్వాదశాక్షి భుజక్రమః
ఏకగ్రీవైకజఠరః కుమారః సమపద్యత ॥

ఇక నిపుడుమనము కృత్తికలు మొదలుగా ఇరువదేడు నక్షత్రములను, వానివాని విశేషములను తెలిసి కొనయత్నింతము.

---

# 15. కృత్తిక

మన తెనుగువారు కృత్తిక చుక్కలను 'పిల్లలకోడి' యందురు. ఇంగ్లీషువారీగుంపును Pleiades 'ప్లియేడ్సు' అందురు. వేదవాఙ్మయమునం దంతటను ఈనక్షత్ర సమూ

హము 'కృత్తికా' నామముతోనే వ్యవహరింపబడినది. 'క్షురా షట్' అనియు, "క్షురనిభషట్ తారాకామయమనియు" నిఘంటువర్ణితము. మంగలకత్తివంటి ఆకారముగల నక్షత్రములారు ఇందుగలవు. "అగ్నిశిఖాకృతిషట్ తారకామయమ్' అని కాళిదాసు కృత్తికలనువర్ణించెను. ఈవర్ణనమెంతయు సముచితము. కృత్తికచుక్కలపై దృష్టిని నిల్పి పరిశీలించిన పక్షమున నవి యావగింజలంత చిన్నవై కనపడును. అంతలి నక్షత్రములంత కాంతి వంతములుగాతోపవు. కాని క్రీగంట చూచినపుడవి అగ్నిశిఖవలె ఎక్కువ తేజస్సుతో కూడుకొని యున్నట్లగపడును.

శ్రీనాధకవి కాశీఖండములో మేరుపర్వతముపై స్పర్ధ చేత వింధ్యపర్వతము పెచ్చుపెరిగి తారకామండలము నంటి, విశ్వవ్యవహారములను స్తంభింపజేసినపుడు, కృత్తికలెట్లు చిక్కుపడెనో ఇట్లువివరించినాడు :—

"సీ॥ పూచినకొంటి పూపొదరింటిచందాన కత్తెర యొకచోట
కదలకుండె"

కొంటి పూవులు పూచెడుతీగెకు సంస్కృతములో నంగారవల్లియనిపేరు. ఇది నిప్పువన్నెపూవుల బూయునొకజాతి కానుగ. యంత్రసహాయ్యములేని మానవనేత్రములకు సామాన్యముగా నిందారుచుక్కలు కనపడును; మంచి నేత్రదృష్టిగల వారికి ఒకప్పుడు ఏడు చుక్కలుగూడ కనపడవచ్చును. మంచి

శక్తివంతమైన ( Telescope ) దూరదర్శిని యంత్రములో చూచినపుడు ఇందులో దాదాపు రెండువేల యేనువందల చుక్కలవఱకు లెక్కపెట్టవచ్చును. ఇవన్నియు నొక్కటే చుక్కలజట్టు. జట్టుకట్టుకొని ఒకే వేగముతో నొకదిక్కునకే పోవు పక్షులవలె ఈకృత్తికచుక్కలు ఖగోళములందు సంచారముచేయుచున్నవి. సప్తఋషిమండలమునందు చుక్కల జట్టున్నది. మరికొన్ని చుక్కలజట్టులనుగూర్చి ముందుముందు చదువగలము.

ఈరిక్కల ఉదయాది విశేషములను మిక్కిలి శ్రద్ధతో గమనించిన ( Tennyson ) టెన్నిసన్ మహాకవి వీనినెంతో రమ్యముగా నిట్లు వర్ణించినాడు :—

"Many a night I saw the Pleiades rising, Glittering like a swaram of fire-flies tangled in a silver plaid."

',సన్నని వెండిదారములతో నేసిన తెల్లని రుమాలులో చిక్కుకొని మిణుకుమిణుకుమని మెఱయుచుండు మెఱుగుడు పురుగులగుంపువలె కృత్తికచుక్కలు తూర్పున నుదయించి మెఱయుట నేననేకరాత్రులు గమనించినాను."

ఇదేభావమును శ్రీనాధమహాకవి "వలిపె తెరలోన నున్నభావంబు దోప" అని యతిసూక్ష్మముగా తెలిపినాడు.

# 16. కృత్తిక అగ్ని దైవత్యము

ప్రతిసంవత్సరమును మేనెల సుమారు పదియవ తేదీనుండి ఇరువది నాలుగవ తేదీవఱకు కృత్తికలు సూర్యునితోనే ఉదయించి, సూర్యునితో అస్తమించి పోవుచుండును. ఆ కారణము చేత నాదినములలోనవి రాత్రి యేవేళను మనకు కనపడవు. "They are in conjunction with the sun" అని పాశ్చాత్యులీ సన్నివేశమును వర్ణించిచెప్పుదురు. మనవారాదినములు "కార్తె" లనియు 'నగ్నికర్తెరదినము' లనియు తెలుపుచుందురు. గురుశుక్రాది గ్రహములు సూర్యునితో కూడియుండు దినములాయా గ్రహముల 'మూఢము' లోనివందురు. సూర్యగ్రహసంగమము మూఢము సూర్యనక్షత్ర సంగమము ఆనక్షత్రపుకార్తె యనివ్యవహారము.

మనకు నిత్యమును వెలుగు, వేడి, ఇచ్చుచు సాధారణముగా మన 'మిత్రుడు' అనిపించుకొను సూర్యుడీ కృత్తికలతో కూడియున్న దినములలో ఉగ్రరూపమును ధరించి, భరింపజాలని వేడిమిని ప్రసరింపజేయును. పిన్నలు, పెద్దలు, అందఱును దారుణమైన వేండ్రముచే బాధపడుచుందురు. నిప్పులు చెఱుగుచున్నట్లుగా వడగాల్పులు వీచుచుండ పక్షులు గూడ చచ్చి నేలగూలును. వడగొట్టి మనుష్యులుకూడ చనిపోవుటగలదు. ఈతీక్ష్ణతకును కారణమేమి? సహవాస

దోషము? కృత్తికలతో జట్టుకూడి సూర్యుడీ దారుణోష్ణమును వెలువరించుచున్నాడని భావము. సూర్యుడు కృత్తికలతో చేరినంత మాత్రముచేత నింత దుస్సహ తేజుడైనచో, అసలు కృత్తిక లెట్టివిగావలెను? కేవలము అగ్నిస్వరూపమే అయి యుండవలెను. కృత్తికలు అగ్నిరూపములు; అగ్ని దైవత్య ములు. ఈయంశమే తైత్తిరీయసంహిత విశదము చేయు చున్నది. "కృత్తికానక్షత్ర మగ్నిర్దేవతా" అని శ్రుతి. ఆకార్తె దినములు "అగ్నికత్తెరలు" అని లోకవ్యవహారము. మన పంచాంగ కర్తలు ఆదినములలో "మృద్దారు శిలాగృహ కర్మాణి వర్జ్యాని" అని శాసింతురు. ఆ కత్తెరరోజులలో గోడలు పెట్టరు; ఇండ్లు కట్టరు; మట్టిపనులు, రాతిపనులు, ఏమియు చేయరు; పాకలు, పందిళ్లు వేయరు; ఇండ్లు నేయుటకు తాటికమ్మకూడ నరుకరు; వడ్రంగులు కలప పనులుచేయరు.

వేదవాఙ్మయములో నక్షత్రముల పట్టికలు కృత్తి కలతో నారంభమగుచున్నవి. కృత్తిక అగ్నిదైవత్యము. కాబట్టి నక్షత్రము లగ్నిముఖములని చెప్పుదురు. ఈనాడు మనము పోస్టుద్వారా కట్టిన మనిఆర్డరులు, పంపిన బంగీలు ఆయా చిరునామాదారుల కందినట్లే, అగ్నిముఖమున వేల్చిన హవ్యకవ్యాదులను ఆయాదేవతలకు అగ్నిదేవుడు అందిచ్చు నని భారతీయుల దృఢవిశ్వాసము. కాబట్టి వేదచోదితము లైన సమస్తశుభాశుభకర్మలలో అగ్నిదేవుని ముందాహ్వా

నించి పూజించుట పురాతనకాలమునుండి మనదేశాచార మయి యున్నది. కృత్తిక అగ్నిదైవత్యముగనుక అగ్ని కృత్తికలో నున్నాడు. కృత్తిక వృషభరాశిలో చేరిన నక్షత్ర మనవలయును. ఏమనగా, అశ్విని+భరణి+కృత్తికలో నొక పాదము మాత్రమే మేషరాశిలోనివిగాని, మిగిలిన మూడు పాదములతో కృత్తిక మొత్తముమీద వృషభములోనిదే.



**2. వృషభరాశి**

కృత్తిక మూడు పాదములు+రోహిణి+మృగశిర 1.2 పాద ములు ఇవన్నియుచేరి వృషభమగును. ఇట్లు కృత్తిలో ముప్పా తిక పాలు—వృషభరాశిలో చేరుటచేత, అగ్ని వృషభరాశి స్థితుడని నిర్ధారింపనైనది. కాబట్టి కర్మకాండలో అగ్ని నాహ్వానించునపు డాయగ్ని కాశ్రయమైన వృషభరాశి ప్రశంస మిక్కిలి అవసరమైనది. ఈహేతువునుబట్టి ఋగ్వేద ములో ఈవృషభరాశి ఇట్లు ప్రశంసింపబడినది:

"చత్వారిశృంగా, త్రయో (అ)స్యదావా ద్వేశీర్షేస ప్తహ స్తాసో అస్యత్రిధాబద్ధోవృషభో రోరవీతి మహా దేవోమార్త్యాఽ ఆవివేశ."

"ఈ ద్వితీయరాశి వృషభమునకు కొమ్ములు నాలుగు; పాదములు మూడు; శిరస్సులు రెండు; ఇట్టి వృషభరూపమున అంకెలువేయు అగ్నికి హస్తములు ఏడు; ఈ అగ్ని దేవత మూడు విధములుగా బంధింపబడి, మర్త్యుల నావేశించి యున్నాడు" అని పై శ్రుతివాక్యము విశదము చేయుచున్నది. నక్షత్రాత్మకమైన వృషభరాశి రూపమును ఖగోళమున నేడు కూడ గమనించిన పక్షమున, నాలుగు కొమ్ములు, మూడే కాళ్లు, రెండు శిరస్సులతో మనకు స్పష్టముగా కనబడు చున్నది. ఆరూపమిచ్చటి చిత్రములో చూడనగును. విశేషించి ఆకాశమువిూది వృషభరాశి రూపమును గమనించి, బహుకాలమునుండి అనేక దేశముల జనులు చిత్రించి గ్రంథస్థముచేసిన రూపములన్నియు పై శ్రుతి వాక్యమును ధ్రువపర్చు చున్నవి. ఆచిత్రములలో రెండవరాశి—ఎద్దునకు నాలుగు కొమ్ములు, మూడు కాళ్లు, రెండు తలలును కనబడుచుండుట విశేషము. ఆమధ్య భూతత్త్వవేత్తలు Geologists పరిశోధనార్థము హిమాలయప్రాంతములను త్రవ్వుచుండగా విచిత్రమైన వృషభశల్యములు Fossils దొరికినవి. వానింబట్టి చూడగా ఆశల్యములు శరీరమున గల్గియుండిన వృషభమునకు రెండు తలలు, నాలుగు కొమ్ములు, మూడు కాళ్లు నుండవలె

వని నిశ్చయింపనైనది. పరిశోధకులా వృషభమును Siva's Bull శివవృషభ మనిరి. రెండు తలలు, నాల్గు కొమ్ములుగల వృషభ జాతి ఇవు డంతరించినది.

---

## 17. అగ్నిజ్వాల లేడు విధములు

"కాళీ, కరాళీచ, మనోజవాచ, సులోహితాయాచ, సుధూమ్రవర్ణా, స్ఫులింగిని, విశ్వరూపీచ దేవీ, వేలాయమానా ఇతి సప్తజిహ్వా." అని మండకోపనిషత్ I. 2. 4. లో వర్ణింప బడినది. ఈ సప్తవిధజ్వాలలను అగ్నిదేవునియొక్క ఏడు జిహ్వాలుగాను, ఏడు హస్తములుగాను వేదఋషులు వర్ణించిరి. ఇంగ్లీషుభాషలోకూడ అగ్నిజ్వాలలు Tongue's of Fire అగ్నియొక్క జిహ్వాలనియే వ్యవహారమున్నది.

---

## 18. 'త్రిధాబద్ధో'

ఈవృషభముమూడు విధములుగా బంధింపబడినది. ఎట్లనగా (౧) అశ్వనీదేవతలు తమరథమునకు శింశుమారమను జలజంతువుతో వృషభమును పూన్చుకొని వెళ్లిరని ఋగ్వే దము తెలుపుచున్నది. ఈయంశము చిత్రములతోసహా ఈ

దిగువ అశ్వనీనక్షత్రచర్యలో చూడగలము. (౨) ఈవృష భమే ముద్గలుని రథమునకు పూన్చబడినదని, ఆరథమునకు రెండవప్రక్క ద్రుఘణము (అనగా గదవంటి యొక్క దుడ్డు) ను కట్టిరని, ఈరథమును అతనిభార్య, (పరివృక్త యనబడువంధ్య) తోలి దొంగలను వెంటనంటెననికూడ ఆవేదము తెలుపుచున్నది. ప్రాశ్చాత్యఖగోళశాస్త్రములో నీదుడ్డు ఒరయన్ Orion యోధుని చేతిలో దుడ్డనియు, పరివృక్త Bellatrix అను స్త్రీయొక్క నక్షత్రరూపమనియు తెలుపబడినది. (3) ఈవృష భమే దాని తరువాతి రాశియగు మిథునమునకు, ధ్వజమును వాహనమునై యున్నది. మిథునమనగా పార్వతీపరమేశ్వర మిథునము. ఆయర్థములో వృషభము ఆదంపతుల వాహన మైన నంది స్వరూపము. వృషభము ధ్రువసూచకమనికూడ వేదములోగలదు. ఆయంశము ముందు ముందు చర్చించి తెలిసికొగలము. జ్యోతిశ్శాస్త్రార్థములో నీవృషభమిట్లు త్రిధా బద్ధము.

పైని వివరించిన 'చత్వారిశృంగా' మంత్రములో వృషభ మునకును అగ్నికిని అభేదమాపాదింపబడినట్లు స్పష్టము. వేద బోధితమైన యజ్ఞకర్మార్థములోగూడ నీయగ్నిమూడు విధ ముల బధింపబడినదని చెప్పవచ్చును. ముఖ్యమైన అగ్నివేది కలు— మూడు 1. అహవనీయము 2. గార్హపత్యము 3. దక్షి ణాగ్ని. ఈగుండములలో మూడు విధములుగా ప్రతిష్ఠింపబడి

మూడువిధములుగా వైదికకర్మ విషయమున బంధితుడైన సప్తజిహ్వుడు అగ్ని 'త్రిధాబద్ధు' డనుట యుక్తము. మను చరిత్రలో (II-75) ప్రవరాఖ్యుడగ్నినిస్తుతించిన పద్యము ఇట జ్ఞప్తికి తెచ్చుకొందము:-

మ॥ దివిషద్వర్గము నీముఖంబునన తృప్తింగాంచు నిన్నీశుగ్రా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామి యున్నీ
వయా
హావనీయంబును దక్షిణాగ్నియును నీయందుద్భవించున్
గ్రతూ
త్సవసంధాయకనన్ను గావదగవే స్వాహావధూవల్లభా!

---

## 19. ఆక్షేపణలు - సమాధానములు

దేవతలలో అగ్ని మేషారూఢుడు; గొఱ్ఱె వాహనముగా గలవాడు. "అగ్గిదేవుడు గొఱ్ఱెమీదఎక్కి కూచుంటే గొఱ్ఱె, బొచ్చూకూడా కాలిపోవా? అనియొక ఆక్షేపణ. గ్రీకులు చెప్పబట్టి మనవాళ్ళకి మేషం-వృషభం-ఈరాసులజ్ఞానం కలిగింది గాని స్వతంత్రంగా వాళ్ళకి ఈరాసుల సంగతి ఏమి తెలుసును?" అని రెండవ యాక్షేపణ. మొదటియాక్షేపణకు సమాధానము:- భూమిమీద మనలు గొఱ్ఱెల బొచ్చుమీద నిప్పుపెట్టి అగ్ని నెక్కించినపుడు ఆబొచ్చు అంటుకొని గొఱ్ఱెలు కమరి

చచ్చుటకు అభ్యంతరములేదుకాని, ఇక్కడ వర్ణింపబడిన గొఱ్ఱె నరలోకమున నడయాడు జంతువుగాదు; అది నక్షత్ర రూపమున మెఱయు దివ్య మేషము. పైని కృత్తికాగ్ని ఉండుట చేత, ఆశాస్త్రదృష్టిలో సంజ్ఞికముగా ఆమేషముపైని అగ్ని మేషారూఢుడనియు, మేషము అగ్నికి వాహనమనియు తెలుపఁ బడినది. తక్కిన దేవతలకు కూడ వాహనధ్వజాది చిహ్నములు కలవని వేదవాఙ్మయము వర్ణించుచున్నది. ఆచిహ్నములన్నియు జ్యోతిశ్శాస్త్ర రీత్యా ఇట్టి సంజ్ఞా రూపకములైన వర్ణనలేనని తెలిసికొనలేక, విశాలదృష్టిగాని, భావనాశక్తిగాని లేని వివర్శకులు కొఱమాలిన శంకలుచేయుట అను చితము. పడమటి వాసనలంబడి నూతన విద్యార్థులే యీ శంకలు చేయుట మనదేశదౌర్భాగ్యము. ఋగ్వేదకాలము నుండి మంత్రద్రష్టలైన భారతీయ ఋషీశ్వరులీ మేషాదిరాసుల నెఱుగుదురు. వారు "భావాంబరవీధివిశ్రుతవిహారులై శాస్త్రపరిభాషతో వేదమంత్రములలో నీయంశములు స్పష్టముగా వర్ణించియున్నారు. ఆ వేదమంత్రములను సరిగా చదువకను, చదివి యర్థముచేసికొనలేకను, విజ్ఞానవిషయములన్నియు మాంచెస్టరు మల్లుతానులవలెనే పడమటి దిగుమతులేయనుకొనుట శోచనీయమైన అజ్ఞానము. "తనది; తానోరు బిచ్చమెత్తంగవలనె!" ఇంతకంటె మనకు దుర్గతి యేమున్నది?

---

# 20. రోహిణి

ఈనక్షత్రసమూహము వేదవాఙ్మయము నందంతటను "రోహిణి" యనియేపేర్కొనబడినది. 'శకటంపంచ' రథము వంటి యాకారముగల నక్షత్రములైదుచేరి రోహిణియగునని వరరుచి తెలిపెను. దీనినే 'శకటాకృతి పంచతారకాత్మకమ్' అనికాళిదాసు వర్ణించెను. మేరుపర్వతము మీఁదిస్పర్థచేత వింధ్యపర్వతము పెరిగి, మిన్నుముట్టి గ్రహనక్షత్ర గమనములను స్తంభింపజేసినపుడు రోహిణిచుక్కలెట్లుండెనో శ్రీనాథుడు వర్ణించినాడు :—

"సీ॥ ఒకచో తగుల్పడి యుపకారి కొరటికి తరమైన రోహిణీ తారకంబు" అనగా కొయ్యలకును, మేకులకును త్రాళ్ళతోబిగించి గట్టిగాకట్టిన డేరావలెనే, 'రోహిణి' ఖగోళమున నిలిచిపోయెనని శ్రీనాథునియభిప్రాయము. ఇచ్చటి రోహిణీనక్షత్రమును గమనించి, ఆకాశముమీఁద చుక్కలను పోల్చి పరిశీలించినపుడు ఆకవిసార్వభౌముడీ చుక్కలగుంపు నెంత స్వభావసిద్ధముగా వర్ణించినాడోయని మెచ్చుకోగలము. పాశ్చాత్యులు లీగుంపును ( Hyades ) హాయేడ్సు అందురు. ఈగుంపులో మనకుడివైపున నడుగుననున్న పెద్దచుక్క అసలు యోగతార, రోహిణి. దీనిని (Bull 's Eye) వృషభరాశి యొక్క నేత్రము - ఎద్దుకన్ను - అందురు. ఎఱ్ఱగా కాలిన ఉక్కుగుండ్లవలె రాత్రివేళ ఎద్దుకన్నులు మెఱయుచుండుట

స్వభావసిద్ధము. ఎట్టిని పుండ్లు "ఎద్దుకన్నులవలె" నున్న వని తెలుపుట లోకప్రసిద్ధము. ఆకాశమున "ఎదుకన్ను" అని చెప్పతగిన రోహిణీ నక్షత్రముపలెనే భూమిమీద ఎద్దు కన్నుగూడ రాత్రివేళ నెట్టిగా తేజరిల్లుట గమనింపవలసిన విషయము. రోహిణి చుక్కను పాశ్చాత్యులు 'ఆల్డిబారన్' Aldebaran అందురు. రోహిణితో నున్న చుక్కలోక జట్టు (Hyades).

రోహిణినిగూర్చి ఐతరేయ బ్రాహ్మణమునందు చిత్రకథ వ్రాయబడినది. సృష్టికర్తయగు ప్రజాపతి తనకూతురైనరోహిణిని మృగరూపమునొందజేసి బలాత్కరింపబోగా, దేవతలాక్రోశించి, స్వభావవిరుద్ధమైన యీదుష్కార్యము జరగకుండ చేయుమని మృగవ్యాధరుద్రుని ప్రార్థించిరి. ఆమృగవ్యాధుడు మృగరూపుడైన ప్రజాపతిని బాణప్రయోగముచేసి పడగూల్చెను. మృగవ్యాధుడను నక్షత్రమును పాశ్చాత్యులుSirius 'సిరియస్' అందురు. తేజోవంతములైన నక్షత్రములన్నిటిలో నిది అగ్రగణ్యము. ఈవేదగాథ ఆకాశరంగమున నక్షత్రరూపమున చిత్రింపబడి నేటికినిఖగోళమున కానవచ్చుచున్నది.

రోహిణీనక్షత్రము మనసూర్య గోళమునకంటె బహు తేజోధికమైనది ; పరిమాణవిషయమున సూర్యునికంటెడెబ్బది నాలుగురెట్లు పెద్దది. ఏబదియేడు వెలుగువత్సరములు Light years దూరమున నున్నది.

---

# 21. వెలుగు వత్సరము (Light year) అనగా నేమి ?

ఖగోళవిజ్ఞానము పరిస్ఫుటము కావలెనన్నచో 'వెలుగు వత్సర' మనగానేమో మనముస్పష్టముగా తెలిసికోవలెను. మనము ప్రకాశమనియు, వెలుగనియు, వెలుతురనియు దేని ననుచున్నామో ఆకాంతిపుంజము కిరణముద్వారా అన్నిదిక్కులకు వ్యాపించుచున్నది. "వెలుగుకిరణములు బహువేగముతో పోవును. అంతటి యురువడి సృష్టిలో మఱిదేనికిని లేదు" అని ప్రస్కణ్వాఋషి ఋగ్వేదములో తెలిపెను

చంద్రకిరణములు సూర్యకిరణములు, నక్షత్రముల కిరణములు ఇవన్నియు నేవేగముతో, ఎంతటియురువడితో వెడలి విశ్వమున వ్యాపించుచున్నవో మన ప్రాచీనులు నిర్వచించి యున్నారు.

శ్లో॥ యోజనానాంసహస్రేద్వే ద్వేశతే ద్వేచయోజనే
ఏకేననిమిషార్థేన క్రమమాణ నమోస్తుతే॥

అను ప్రమాణమునుబట్టి భాస్కర రామాయణమున కిష్కింధాకాండ తెనిగించిన మల్లికార్జునభట్టు, ఆకాండలోని 578 రచన - (వచనమున) నిట్లు గలదు. "ద్విసహస్ర యోజన పర్యాంతంబు నిమిషార్థంబున గమించు" నని వెలుగువేగము

నిర్ణయింపబడినది. ఋగ్వేదము I. - 50 - 4 సూక్తమునకు వ్యాఖ్యానము వ్రాయుచు విద్యారణ్యులీసంఖ్య నిచ్చినారు. ఇంతకుముందే నన్నయభట్టారకుడు ఆదిపర్వమునందలి తపతి సంవరణోపాఖ్యానమున నీసంఖ్య నిచ్చియున్నాడు. ఈసంఖ్య సంస్కృతమూల భారతములో లేదు. శ్రీనాథ మహాకవి కాశీ ఖండము (III - 176) లో వెలుగు "నిమేషార్ధమాత్రమున రెండువేల రెండువందల రెండు యోజనములు" గడచిపోవునని విశదముచేసియున్నాడు. ఈసంఖ్య సంస్కృత మూలములో లేదు. నిమేషమనగా ఇంగ్లీషు Minute 'మినిట్' కాలమని తెనుగు నాట చాలతప్పు అభిప్రాయము ప్రబలియున్నది. ఇంగ్లీషువారి 'మినిట్' కాలమన 'నిమేషము' కాదు. మన నిమేషము ఇంగ్లీషుమినిట్ కాలముకాదు. ఈయంశము బాగుగా గమనించి దృఢముగామనస్సున నాటించుకోవలసిన విషయము. ఏమనగా మనపూర్వులు కాలగతులు గమనించుటకు ఈక్రింది విధమున కాలమానము నిర్ణయించి యున్నారు:- పదు నైదు నిమేషములు ఒకకాష్ఠ; ముప్పదికాష్ఠలు ఒకకళ; ముప్పది కళలొక ముహూర్తము; ముప్పది ముహూర్తము లొక దివారాత్రము ఉదయాదుదయ కాలము ఇంగ్లీషులెక్క ప్రకారము ఒకరాత్రియు నొకపగలును చేరి ఇరువదినాలుగు గంటలకాలము; గంటకు 60 మినిట్లు; మినిటుకు 60 సెకెండ్లు గణితరీత్యా, $15 \times 30 \times 30 \times 30$ నిమేషములు= $24 \times 60 \times 60$ సెకెండ్లుఅగును. ఇందువలన తేలునదేమనగా 75 నిమేషముల

కాలము 16 సెకెండ్లకు సరిపోవును. ఒకనిమేషము $\frac{16}{75}$ సెకెండ్ల కాలముమాత్రము కాగలదు. నిమేషార్ధము ఇందులోసగము — $\frac{8}{75}$ సెకండ్ల కాలము. ఈకాలములో సూర్యకిరణములు 2202 యోజనములు గడిచిపోవుచున్నవి. ఒక సెకండు కాలములో $\frac{2202 \times 75}{8}$ యోజనములు పోగలవు. యోజనమనగా నాలుగు క్రోసులు ; క్రోసు రెండువేల బారలు ; బారఅనగా ఇంగ్లీషు 6 అడుగులు ; 2 గజములు. ఈమానమునుబట్టి గుణించగా మనపూర్వుల యోజనము ఇప్పటి ఇంగ్లీషుమైళ్ళు తొమ్మిది కాగా నూటఅరువదిగజముల దూరమని స్పష్టము. కాబట్టి గణితరీత్యా ఇప్పటిసెకండు కాలములో సూర్యకిరణములు 187670 ఇంగ్లీషుమైళ్ళు గడిచిపోగలవని మనపూర్వుల రచన వలన తేటపడుచున్నది. ఇప్పటిఇంగ్లీషు వైజ్ఞానికుల నిర్ణయ ప్రకారము వెలుగుకిరణములు ఒకసెకండుకాలములో ఒకలక్ష ఎనుబదియారువేల మున్నూట ఇరువదియైదుమైళ్ళు పోవునని నిశ్చయింపబడినది.

సూర్యమండలము వెలువడిన వెలుతురు కిరణములు, ఇంతటి ప్రచండవేగముతో ఎక్కడను ఆగక, ఏకాయెకినివచ్చి భూమినిచేరి మననేత్రములం దాకుటకు సుమారు ఎనిమిది మినిట్లు ఇరువది సెకెండ్ల కాలము పట్టును. కాబట్టి సూర్యుడు మనకు తొమ్మిదికోట్ల ముప్పదిలక్షలమైళ్ల దూరమున నున్నాడని తెలియగలదు. కాని నక్షత్రములింత సమీపముగాలేవు.

మన కత్యంతసమీపముననున్న చుక్క వెలుగు మనకు చేరు సరికి నాలుగు సంవత్సరములు పైకాలము పట్టుచున్నది. ఒక సంవత్సరము కాలములో వెలుగు ఎంతదూరము ఏకాయెకిని పోగలదో ఆదూరమును వెలుగు-వత్సర మైళ్ల సంఖ్యచే తెలుపుదురు. ఆదూరము ఈక్రింద లెక్కించి నిర్ణయింతము.

| | | |
|---|---|---|
| ఒక సెకండుకు వెలుగు కిరణము | | 1,86,325 మైళ్ల దూరము పోగలదు |
| 60 సెకండ్లు గల మినిటుకు కిరణము | ,, | 60 × 186325 ,, |
| 60 మినిట్లు గల 1 గంటకు కిరణము | ,, | 60 × 60 × 186325 ,, |
| 24 గంటలు గల 1 దినమునకు కి॥ | ,, | 24 × 60 × 60 × 186325 ,, |
| $365\frac{1}{4}$ దినములుగల 1 సం॥రమునకు కి॥ | ,, | $365\frac{1}{4}$ × 24 × 60 × 60 × 186325 మైళ్లదూరము పోగలదు. |

ఇదే వెలుగు వత్సరదూరము ఓపికతో గుణించి చూడగా ఈసంఖ్య సుమారు ఆరులక్షలకోట్లు, ఆరు తరువాత పంద్రెండు సున్నలుగల మైళ్లని తేలుచున్నది. ఇంత సంఖ్య మనమూహించుటకూడ కష్టసాధ్యము; అయినను చుక్కల దూరములు కొలుచుటకు ఈసంఖ్యయే 'గజముబద్ద' ఏల యనగా కొన్నిచుక్కలు పదులు, కొన్ని వందలు, మరికొన్ని వేలు, ఇంకనుకొన్ని లక్షలు, దూరస్థములైన చుక్కలు కోట్ల కొలది వెలుగు వత్సరముల దూరమందున్నవి. రోహిణీనక్షత్ర విషయములో ఆచుక్క 57 వెలుగు వత్సరముల దూరమున నున్నదని పాశ్చాత్యజ్యోతిశాస్త్రవేత్తలు నిర్ణయించిరి; అనగా

వెలుగు వత్సరమైళ్ల సంఖ్యను 57 చే గుణించగా వచ్చిన లబ్ధము ఆచుక్క మనకెంత దూరమున నున్నదో స్పష్టము చేయగలదు. కృత్తికలవలెనే రోహిణి చుక్కలు (Hyades) ఒకజట్టు కట్టుకొని ఒకే వేగముతో నొకవంకకు పోవుచున్నవి.

---

## 22. మృగశిర

లేడిబుఱ్ఱవంటి ఆకారముగల మూడు నక్షత్రములు మృగశిర యని కొందరును, అయిదు నక్షత్రములు మృగశిర యనికొందరును చెప్పుచున్నారు. ఈచుక్కలకు ఇల్వల నామము కూడ కలదు. వేదకాలనుండి ప్రమాణమును ఒకొక్కటిగా పరిశీలింతము.

తైత్తిరీయసంహితలో ఈచుక్కలు 'మృగశీర్ష' అని పేర్కొనబడెను. తై. బ్రాహ్మణము, కాఠకసంహిత, అథర్వ వేదములలో నీచుక్కలకు 'ఇన్వకా' అను పేరు కనబడుచున్నది. మైత్రావరుణీయ సంహితలో 'ఇన్వగా' అనిపేరున్నది. శాంతి కల్పమునందు వీనికి 'అంధక' నక్షత్రములని పేరు చూపట్టు చున్నది. మృగశిరోదేశమునందు చుక్కలు 'ఇల్వలా' నక్షత్రములని అమరము తెలుపుచున్నది. "ఇల్వలా తచ్ఛిరోదేశే

తారకానివసంతి". దీనికిస్వామి వ్యాఖ్యలో "ఇల్వలా పంచ తారకా' అని వ్రాయబడినది.

మృగశిర సోమదైవత్యము "మృగశీరానక్షత్రమ్‌సోమో దేవతా" తై. సంహిత. కృత్తిక మొదలు ఆర్ద్రవఱకుగల నాలుగు నక్షత్రములకు అధిదేవతలు ఈక్రింది శ్లోకములో చక్కగా తెలుపబడిరి. "కృత్తికాశ్చాగ్నిదైవత్యమ్ రోహిణ్యో బ్రహ్మణస్మృతః ఇల్వలోసోమదైవత్యాః రౌద్రంచార్ద్రము దాహృతః" (గరుడ పురాణము-58-2) శ్లో "మూషకాశన పదాకృతౌవిధా వ్యోమమధ్యమిల్వితేత్రితారకే" అను ప్రమాణమువలన పిల్లి అడుగులవంటి మూడుచుక్కలు మృగశిర అగు నని తేలుచున్నది.

---

## 23. మృగశిర-చంద్రుడు

చంద్రుడు 'శశాంకు' డనియు 'మృగాంకుడు' అనియు మనగ్రంథములలో నున్నది. చంద్రునిలో నొక జంతువును బోలిన మచ్చయొకటి చూపరులకు గోచరించును. ఆమచ్చ 'చెవులపిల్లి' యని కొందరు వర్ణింతురు; 'లేడి' యని కొందరు భావింతురు. చంద్రునిలో నగపడుమచ్చ మృగమని భావించు

నపుడు మృగశిర నక్షత్రమున కధిపతి చంద్రుడే గావలెను. వేదములో పెక్కుచోట్ల వృత్రాసురుడు మాయామృగముని వర్ణింపబడి యున్నాడు. లోకమాన్యతిలక్ మహాశయులీ యాశమును గమనించి మృగశిరవృత్రశిరమని గుర్తించినారు. వృత్రుని సంహరించి లోకమునకు వర్షప్రదానము ననుగ్రహించు దేవత ఇంద్రుడు. జ్యేష్ఠనక్షత్రము ఇంద్రదైవత్యము. ఇంద్ర వృత్రులు ప్రతిస్పర్ధులు. జ్యేష్ఠ, మృగశిర నక్షత్రములుకూడ ప్రతి స్పర్ధులే. తూర్పున జ్యేష్ఠఉదయముకాగానే పడమట మృగశిర అస్తమించును. జ్యేష్ఠమాసమున పున్నమినాడు సూర్యాస్త మానముకాగానే తూర్పున జ్యేష్ఠనక్షత్రము ఉదయుంచగా, మృగశిర అస్తమించును. సూర్యుడు మృగశిరతో కూడి యుండును. అదేమృగశిర 'కార్తె' ప్రవేశము. మృగశిరా ప్రవే శముతో వర్షములారంభమగును. అంతవఱకు గ్రీష్మతాపమున కోర్వక వేగిపోవు లోకమున కీ తొలివర్షములు తాపోపశమన హేతువులై, వెన్నెలవలె మిక్కిలి ఆహ్లాదకరముగా నుండును. వ్యవసాయదారులు పునాసనూజేలు జల్లి తిలలు వ్యవసపెట్టు కాల మిదియే.

చంద్రమండలము పితృస్థానము. పితృకార్యములలో జనులు 'స్వధానమః' అని విడుచు తిలోదకములు మంత్రబల మున చంద్రమండలమున కెక్కి పితృలకందునని భారతీయుల విశ్వాసము. శ్రీనాధకవిసార్వభౌముడు లీయంశముల నీక్రింది పద్య

ములో చక్కగా విశదీకరించినాడు. "గీ॥ చంద్రమండలమిది పితృస్థానమగుట జనసమార్జితమగు స్వధాసలిలతిలలు మంత్ర బలమునఁనెక్కె"
శృంగారనైషధము VII 190

---

## 24. ఈశ్వరుడు 'చంద్రశేఖరుడు' 'కర్పూరకుందధవళేందు జటాధరుడు'

మఱియునొక విశేషము. కొన్నిపూవులు కొన్ని ఋతువులలో మాత్రముపూసి మానవులకేకాక దేవతలకుకూడ శిరోధార్యములగును. ఈశ్వరుడు జటాజూటముపై చంద్రుని ధరించుటచేత చంద్రుడీశ్వరునికి 'తలపూవు' అగుచున్నాడు. ఈయంశమే మన ఆంధ్ర కవితాపితామహుడీ క్రింది పద్యములో నేర్పుతో హృద్యముగా వర్ణించినాడు. "సీ॥ అనలాక్షు ఘన జటావనవాటి కెవ్వాడు వన్నెవెట్టు 'ననార్తవంపుపూవు'". చంద్రకళ ఒకఋతువులోమాత్రముండి మరొక ఋతువులో మాయమగు సాధారణపుష్పజాతికి చేరినపూవుకాదు. 'అనార్తవంపుపువ్వు' ఎల్లకాలము, అన్ని ఋతువులలో చక్కగా ఈశ్వరుని శిరోభూషణమై యొప్పు పుష్పరాజము, చంద్రకళ; ఈశ్వరుడు చంద్రకళావతంసుడు.

జ్యోతిశ్శాస్త్రరీత్యా ఆర్ద్రానక్షత్రము రుద్రదేవత్యము. ఈశ్వరుడే ఆర్ద్ర. ఆమీదనున్న చుక్క మృగశిర-చంద్రుడు. కాబట్టి ఈదృష్టితో చూచినపుడు చంద్రుడు 'జాబిల్లి' ఈశ్వరుని 'తలపూవన' దగియుండును. పెద్దన్న 'అనలాక్షు' డని వర్ణించుటలో విశేషమున్నది. ఆయంశ మీాక్రింద 'ఆర్ద్ర' ప్రశంసలో తేటపడగలదు. వృత్రాసురుడు చచ్చునపుడు తన శరీరములో నొకభాగము చంద్రుని కిచ్చినట్లు శతపథ బ్రాహ్మణములో కథ గలదు.

— —

## 25. రోహిణీ ప్రియుడు, చంద్రుడు

చంద్రునికి తక్కిన భార్యలందరిపై గలప్రేమ కంటె రోహిణిపై ప్రేమ అత్యధికమని పురాణగాథలున్నవి. ఖగోళమున రోహిణిచంద్రసమాగమమెంతో మనోజ్ఞమై దర్శనీయమై యొప్పుచుండును. అదియునుగాక, మృగశిర ప్రక్కనే రోహిణి యుండుటచేతను, మృగశిర చంద్ర దైవత్యమై భేదము లేక చంద్రుడను భావనతోనే వ్యవహరింపబడుచుండుట చేతను కూడ పురాణకర్తలు తక్కిన భార్యలమీాదకంటె చంద్రునికి రోహిణియందు ప్రేమయధికమని వర్ణించియుందురు. రోహిణికి మృగశీర్ష చంద్రుడు నిత్య సన్నిహితుడే కదా ? ఈ రోహిణి

పక్షపాతమే కారణముగా శప్తుడై చంద్రుడు క్షయరోగపీడి తుడై ఇప్పటికిని, పక్షపక్షమునకు వృద్ధి క్షయములు గను చున్నాడట! విరాట్పురుషుని మనస్సునుండి చంద్రుడు పుట్టి నందున మానవుల మనస్సులు చంద్రుని యధీనమట! 'చంద్రమామనసోజాతః' అని పురుషసూక్తము తెలుపు చున్నదికదా?

---

## 26. ఆర్ద్ర Betelgeaux

తైత్తిరీయసంహిత, అధర్వవేదములందీనక్షత్రము అర్ద్ర అనియే పేర్కొన బడినది. కాని తై. బ్రాహ్మణము మైత్రా వరుణీయసంహిత, కారకసంహితలలోనిది 'బాహు' అని తెలుప బడినది. పాశ్చాత్యజ్యోతిర్విదులు 'Orion, the Hunter' వేటకాడు, ఒరయన్ యోధుడని చెప్పబడు చుక్కలగుంపున కిది 'బాహు' వని చెప్పతగియున్నది. ఈగుంపులోని మృగశిర చుక్కలకు దక్షిణముగా మంచపుకోళ్లవలె నాలుగుచుక్కలు గలవు. అందు ఆర్ద్ర అనునది యొక బాహువు. ఆనాలుగు చుక్కలమధ్యను జాయగా మూడుచుక్కలు మెఱయుచుండును. అవి యాకేటగాని పటకాచుక్కలు Belt of Orion, the Hunter అనియు, ఆపటకాచుక్కలనుండి వ్రేలు మరిమూడు

చుక్కలు ఆయోధుని ఖడ్గము Sword అనియు పడమటి గాధలుకలవు. వారు 'పటకా' అని చూపెడి చుక్కలనే మన రైతులు 'గొల్లకావిడి చుక్కలు' అని చెప్పుదురు.

"ఆర్ద్రా ప్రవాళమేకమ్" అని వరరుచి వర్ణన. "పద్మాకృత్యుజ్జ్వలైక తారకామయమ్" అని కాళిదాసు ఆర్ద్రను వర్ణించియున్నాడు. పగడమువలె ఎఱ్ఱని కాంతితో మెఱయు నేకైకతార ఆర్ద్ర అని యొకరును, నవరత్నములలో పద్మరాగమనియెడి రత్నమువలె నరుణరుచులతో తేజరిల్లునది యని మరియొకరును వర్ణించినారు. పాశ్చాత్యులీ నక్షత్రరాజమును బీటల్జ్యూ Betelgeaux అనెదరు. ఊహింపరానంత విశేషమైన దూరమునందుండుటచేత నీనక్షత్రము చిన్నదిగా కనబడుచున్నది. కాని నిజము పరిశీలించినచో ఆర్ద్ర మన సూర్యునికంటె పంద్రెండువందలరెట్లు అధిక తేజస్సుతో ప్రకాశించుచున్న మహాగోళము. దీనివెలుగు మనకుచేరుసరికి రెండు వందల సంవత్సరములు పట్టుచున్నది. అనగా 1757 సంవత్సరములో ప్లాసీ యుద్ధము బొబ్బిలి ముట్టడి జరుగకముందు ఆర్ద్ర గోళమునుండి బయలుదేరిన వెలుగుకిరణములు ప్రతిసెకెండుకు ఒకలక్ష ఎనుబదియారువేల మూడువందల ఇరువదియారుమైళ్ళ చొప్పున నిరంతర ప్రయాణము సాగించుచు ఎకాయెకినివచ్చి యీనాటికి మనభూమిని చేరుకోజాలకున్నవి. ఈకిరణములు దారిలో నుండగానే యీభూగోళముమీద బ్రిటిష్ సామ్రా

జ్యము పుట్టిపెరిగి విచ్ఛిన్నమైపోయినది! ఎంతటి అర్ధాయుష్య సామ్రాజ్యమో!

ఇక పరిమాణ విషయము యోజించినను అర్ద్రి నక్షత్రము అద్భుతావహమగుచున్నది. ఎట్లనగా, పంచఖండ పంచమహాసముద్రముద్రితమైన మనభూగోళపు చుట్టుకొలత ఇరువది యైదువేల మైళ్ళకు తక్కువ. సూర్యగోళపు చుట్టుకొలత ఇరువదియైదు లక్షలమైళ్లు. మనభూగోళమువంటి గోళములు పదమూడు లక్షలు అయినచో ఒకసూర్యగోళ పరిమాణమునకు సరిపోవును. అట్టి సూర్యగోళములు రెండుకోట్ల ఏబదిలక్షలు అయినచో అర్ద్రిగోళమునకు సరిపోవును. మహాగ్నిమయమైన ఈభయంకర గోళమున కధిదేవత రుద్రుడు. "అర్ద్రానక్షత్రమ్ రుద్రోదేవతా" అని శ్రుతి.

---

# 27. రుద్రుడు

'అనంగదేహదహనజ్వాలావళీలోచనుడు' అనంగుడనగా మన్మథుడు. మన్మథుని దేహము దహింపబడుటకు కారణమైన అగ్నిజ్వాలల కాకరకమైన నేత్రముగలవాడు

కావున ననలాక్షుడు, నిటలాక్షుడు మొదలగు నామములు రుద్రునకు కలవు. ఈమన్మథ దహనవిషయము జ్యోతిశ్శాస్త్రరీత్యా అర్థము చేసికొందము.

(చూ. 8 వ పటము)

ఆర్ద్రరుద్రుడు తూర్పున నుదయించినంతనే పడమట ధనుస్సురాశి అస్తమించును. ధనుస్సులో మూల+పూర్వాషాఢ+ఉత్తరాషాఢ పాదము చేరియున్నవి. ధనుర్ధారియనగా మన్మథుడు; చెఱుకువింటి పుష్పబాణుడు. ధనుస్సురాశిపైనున్నది మకరరాశి; అందుచేతనే మన్మథుడు మకరధ్వజుడందురు. ఆర్ద్ర రుద్రుడును, ధనుర్ధారి మన్మథుడును ప్రతిస్పర్థులు; ఎదురు చుక్కలు Diametrically opposite. మహాగ్నిమయమగు నార్ద్రనక్షత్ర ముదయించినంతనే ధనుర్ధారి మన్మథు డస్తమించును. ఇట్లు మన్మథనక్షత్రము లస్తమించి యదృశ్యుడగుట నుత్ప్రేక్షించి, మనపూర్వులు మన్మథుడు రుద్రుని కంటి మంటలోబడి దగ్ధుడయి మడసెనని వర్ణించిరి. ఈశ్వరుడు "సంవర్తాగ్నితటిత్ప్రదీప్తకనకప్రస్పర్థితేజోమయుడు" అట్టి "ధూర్జటి కంటికడింది మంటలో నడపొడగానరాక తెగటారి మనసుకుడాలి, మోడయిపోయెగా" డని కవులవర్ణన. ఇట్లు 'అనంగ దేహదహన జ్వాలావళీలోచను'డగు రుద్రుని చిత్ర మిచ్చుట చూడనగును.

---

# ౨౮. వృషభధ్వజులు, వృషభవాహనులు

మేషరాశి చుక్కలు ఉదయమైన తరువాత తూర్పున ముందు వృషభరాశి నక్షత్రములును, పిమ్మట మిథునరాశి చుక్కలును ఉదయమగుచుండును. మిథునమనగా పార్వతీ పరమేశ్వర మిథునము. కాబట్టి తూర్పున నుదయించుటలో ముందు వృషభమును, తరువాత మిథునమును—ఈక్రమమున నిందలి చుక్కలు పొడుచుచుండును. మిథునము పూర్తిగా ఉదయమగుటకు ముందే వృషభము ఉదయించి, మిథున శిరోభాగమున తేజరిల్లు చుండును. ఈయంశ మిక్కడి చిత్రము స్పష్టము చేయుచున్నది. ఈ స్థితిలో పార్వతీపరమేశ్వరులకు వృషభము ధ్వజమని చెప్పతగి యుండును. పిమ్మట పడమట నీనక్షత్రము లస్తమించునపుడు ఈస్థానములు తారుమారగును; వృషభము అడుగునను, ఆపైని మిథునమును కానవచ్చును. ఈస్థితిలో నీ పురాణదంపతులకు వృషభము వాహనమని చెప్ప తగి యుండును. కాబట్టియే, ఈశ్వరుడు, "వృషస్కంధసమా రూఢమ్, ఉమాదేహార్ధధారిణమ్" అనియు, "వాహనం వృష భోయస్య" అనియు మంత్రపాఠపురాణాదులలో వర్ణింప బడెను. మనశివాలయములలో నందులన్నియు నీవృషభరాశి సంజ్ఞికములే. ప్రదోషకాలమున నీశ్వరదర్శనము చేయువారు నంది శిరస్సుపైని కొమ్ములవలె వ్రేళ్లుపెట్టి వ్రేళ్ల మధ్యనుండి

చూచుచు పరమేశ్వరదర్శనము చేయుదురు. దేవతలకు ఏది వాహనమో అదే ధ్వజము. 'యస్య యో వాహనః ప్రోక్తో ధ్వజ స్తస్య స ఏవతు.'

(చూ. 9, 10, 11 వ పటములు)

---

## 29. అర్ధనారీశ్వరులు, గౌరీపూజ ఉత్సవములు

కాళిదాస మహాకవి "వాగర్థావివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ" అని రఘువంశ ప్రారంభమున నీపార్వతీపరమేశ్వరులను భక్తితో స్తుతించియున్నాడు. వియోగములేని దాంపత్యముగలవారు పార్వతీపరమేశ్వరులు. ఈశ్వరుడు తనశరీరములో సగభాగము అమ్మవారికిచ్చివేసెను. శబ్దము శబ్దార్థమువలెను, పుష్పగంధమువలెను, ఈ పురాణదంపతులు అవినాభావసంబంధముతో నొప్పుచున్నారు. అర్ధనారీశ్వర మిథునములో స్త్రీశక్తి గౌరి. ప్రతిస్త్రీయొక్క ఐదువతనమునకు అధికారము గౌరీదేవివి. కాబట్టి వివాహసంస్కారమును, ప్రాణేశ్వరుని నిత్యసాహచర్యమును, ఐదువతనమును కాంక్షించు ప్రతికన్యయు గంపలో కూర్చుండి గౌరీపరమేశ్వరిని వివాహమునకు ముందు భక్తితో

దీక్షగా పూజించుచుండును. శ్రీకృష్ణభగవానుని వివాహము కాగోరిన రుక్మిణీదేవిసహితము "నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్ । మిమ్ముఁబురాణదంపతుల మేలు భజింతుగదమ్మ" అని వినయముతో ప్రార్థించినట్లు రుక్మిణీ కల్యాణకథలో నున్నది. దమయంతి నలుని వరించినతరువాత, సమస్త దేవతా సమక్షమునందు సరస్వతి ఆమె నేమని యాశీర్వదించినదో నైషధము తెలుపుచున్నది:— "ఉ. ఆదిమశక్తియైన తుహినాచల రాజతనూజవోలె ము, త్తైదువవై సిద్ధేశ్వరుని యర్థశరీరము పాలుగొమ్ము" అని దీవించినది. దమయంతి నేగాక, సమస్త స్త్రీలోకమునకును ముత్తైదువతనమును వరమిచ్చి రక్షింపగలశక్తివంతురాలు, పార్వతీదేవి. ఆర్యామహాదేవిని, పరమశివుని, మనదేశములో ప్రజలెంతో భక్త్యుత్సాహములతో పూజించి గొప్పయుత్సవములు చేయించుచుందురు. ఈయుత్సవములు ముఖ్యముగా కార్తీకమార్గశిర మాసములలో జరుగుచుండును. ఆదినములలో సూర్యాస్తమానము కాగానే తూర్పున మంచి వృషభరాశి నక్షత్రములును పిమ్మట మిథునరాశి నక్షత్రములును ఉదయమగును. పరమేశ్వర ప్రీతికరములైన కార్తీక సోమవారములు, రుద్రదైవత్యమైన ఆర్ద్రా నక్షత్రదర్శనము కాలభైరవాష్టమి, జ్వాలాతోరణములు, పున్నమనోములు లోనగు శైవోత్సవముల నప్పుడే మనప్రజలు జరుపుచుందురు. కార్తీకశుద్ధప్రతిపద్దినమున విశ్వేశ్వరుడు, కాశీక్షేత్రమునందు ప్రవేశించెను. (చూ.

కాశీఖండము. శ్రీనాథప్రణీతము VII-270) మార్గశిర శుద్ధ చతుర్దశినాడు, రోహిణీనక్షత్రమున భీమేశ్వరస్వామి దక్షపురి ప్రవేశించి అచ్చట నభిషిక్తుడయ్యెను. అప్పుడే దేవేంద్రుడు దాక్షారామ భీమేశ్వరునకు భీమమండలము ధారవోసి సమర్పించెను. (చూ. శ్రీనాథకృత భీమేశ్వరపురాణము V. 42,84). "గవిరెమ్మ సంబరము" లనబడు గౌరీపరమేశ్వరుల యుత్సవము లీ[illegible]సములలోనే జరుపుదురు

---

## 30. ఈశ్వరజటాజూటమున నాకాశగంగ

"శ్రుతిశత ప్రభయాప్రభాయుతం
హరిపదాబ్జ భవాశిరసాధృతం
శివశివేతి శివేతివై
భవభవేతి భవేతిభవేతివై"

అని శ్రీవ్యాసతీర్థులవారు శివుని స్తుతించి యున్నారు. అడిదము రామకవి, సీ॥ బ్రహ్మాండభాండ సంపత్తికి[illegible]క్షి[illegible]గల్గు పద్మనాభుని పదాబ్జమునబట్టి ...... అఖిలలోకాధ్యక్షుడై మించి విహరించు శివు జటాజూటాగ్రసీము నిలిచి" అని యమరవాక్యముల[illegible] నమరవాహినిని సంబోధించెను.

(చూ. 12 వ పటము)

ఖగోళములో బహుదూరము ధవళధవళమై తోచు సన్ననిపట్టీవంటి రమ్యదృశ్యమును మనసు తెలుచుగా చూచు చుందుము. అదృశ్యము కొన్నిచోట్లమిక్కిలి దట్టముగాను, మరికొన్నిచోట్ల బహుపలచగాను వ్యాపించి నభోరంగమును పాములె చుట్టుకొనియున్నది. అందు సాంద్రధవళసీమను పాలసముద్రమనియు, నందుపవ్వళించియున్నట్లు కనబడు విష్ణు భగవానుని పాదమునుండివెలువడునట్లు తోచుచు చాలపలు చగావ్యాపించిన తెలుపును ఆకాశగంగయనియు మనవారు వర్ణించియున్నారు. ఈయమరతరంగిణి విష్ణుపాదము నుండి బహుదూరము ప్రవహించి తుదకు ఆరుద్రనక్షత్రమునుచేరుకొను చున్నది. ప్రతిసంవత్సరమును వైశాఖశుద్ధ సప్తమినాడు మన పంచాగకర్తలు గంగావతరణమనియు, గంగోత్పత్తి యనియు తెలుపుచున్నారు. ఆనాటిరాత్రి తొలిజామున నగపడు ఖగోళదృశ్యమును ఇక్కడిచిత్రము పరిస్ఫుటము చేయుచున్నది. విష్ణుపాదాంగుష్ఠ నిష్ఠ్యూతయగు దివిజగంగ పరమేశ్వరుని జటాజూటము చేరుకొనియుండుటకు గలహేతువును ఖగోళపరి శీలనము విశదముచేయుచున్నది.* (చూ. 13 వ పటము)

---

* " As above, so below ".

" The drama of the Earth runs parallel to the drama of the Sky ".

"పై నెలాగో దిగువకూడా అలాగే జరుగుచుండును "

"ఆకాశనాటకము ననుసరించియే భూమిమీద నాటకములుకూడ జరుగు చుండును" అని పడమటకవులుకూడ చెప్పుచున్నారు. (Cont.)

గంగ ఈశ్వరుని కొకభార్య; పార్వతి మరొకభార్య. తెల్లని ముసలియెద్దు ఆయనకు వాహనము. హిమవంతుడు మామగారు; మెడలో ఉత్తరీయ మొక నాగుబాము. ఈ సందర్భములను రమ్యముగా ప్రశంసించుచు కవి, గాయక, భక్తకోట్లుగావించు స్తోత్రములు మంచి రసవంతముగా నుండును, మచ్చుకొకటి రెండు:—

సీ॥ "చలిమలసుత మీకువలచిన పెన్ రాణి, ముసలియెద్దేమీకు
మిసిమి ఘోణి"

మ॥ "మెడనాగయ్యకు నొక్కటేబుసబుసల్, మేనన్నగంబైనయా
బిడతో నీకిక నెప్పుడున్ గుసగుసల్, వీక్షించి మీచంద మె
క్కడలేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకు, న్నీ చెవిం
బడు టెలాగునొ మా మొరల్ తెలియదప్పా మాకు మృత్యుం
జయా"

(చూ. 14 వ పటము)

---

ఖగోళమున నాకాశగంగ రుద్రుని జటాజూటము నలంకరించుచున్నది, కావున భూమిమీద శివాలయములలో లింగముమీద ధారాపాత్రనుండి జలము స్రవించి ఈశ్వరునకు అభిషేకము చేయుచుండును. (అభిషేకప్రియో) జలధారప్రియోశివః అనుట కిదే కారణము. అంతేకాదు; ధారాపాత్ర ఒక గడియారము వంటిది. (water clock). పాశ్చాత్యులు దీనిని Clepsidra అందురు. పాత్రనిండ నీళ్లు పోసిన తరువాత అందలి జలము పూర్తిగా స్రవించుటకు కొంతకాలము పట్టును. ఆవిధముగా కాలగతి ప్రాచీనులు నిర్ణయించి తెలిసికొనుచుండిరి.

# 31. శివునిగూర్చి యాక్షేపణలు

"అడ్డమైనగడ్డిగఱచు పశువుపై శివుడెక్కి విహరించుట బాగున్నదా!" అని పరిహాసకులు ఈశ్వరుని యాక్షేపించుచున్నారు. సాంబశివుని వాహనమని చెప్పెడి వృషభము నక్షత్రరూపమైన దివ్యవృషభముకాని అడ్డమైనగడ్డిగఱచు చెడుపశువుగాదు. ముందుకాళ్ళకు బందము వైచినట్లు ఇట్టి యాక్షేపకులకు మొదట నే సమాధానమిచ్చుట మంచిదని కాబోలు, మంత్రద్రష్టలైన వేదఋషులు ఈవృషభము "నస్మై తృణంనోదకం" గడ్డితినదు నీరుత్రాగదు అని తెగవేసి ఖండించి వ్రాసినారు. (చూ. ఋ. x. 102.-10) కావున నీవృషభము దివ్యుల నెక్కించుకొని తారామండలమున మెఱయు దివ్యవృషభము కాని యడ్డమైనగడ్డితిను మొద్దుపశువుకాదని గ్రహింతము.

---

# 32. పునర్వసు

వజ్రపు పోడులవలె తళతళ మెఱయు చుక్కల గుంపులలో పునర్వసు మిక్కిలి రమణీయమైనది. ఈగుంపు బహు ప్రాచీనకాలమునుండి నక్షత్రపరిశోధకుల దృష్టి నాకర్షించియున్నది. యంత్రసాహాయ్యములేని కనులకు మామూలుగా

చూచినపుడు ఇందలి నక్షత్రములు ఇక్కడి చిత్రములో చూపినట్లు కనబడును. తేజోవిషయమున నగ్రగణ్యములని నిర్ణయింపబడిన First Magnitude Stars ఇరువదింటిలో నిందుమూడు చూడనగును. నాలుగవదికూడ ఇందులో చేరినదే అని కొందఱును, కాదని కొందఱును తలంచుచున్నారు. మనవారు మృగవ్యాధరుద్రుడనియు, పాశ్చాత్యులు (Sirius) సిరియస్ అనియు తెలిపెడి మేటిచుక్కకూడ పునర్వసులోనిదే యని ఓఝసిద్ధాంతు లనుచున్నారు. క్రాంతివృత్తము Ecliptic నకు కడుదూరమున నుండుటచేత మృగవ్యాధుడు పునర్వసులో చేరడని నాయభిప్రాయము.

పునర్వసు 'ధనురాకారం పంచ' అని వరరుచి తెలిపెను. కాళిదాసు "మధ్యవర్త్మని శరాసనాకృతావంబరస్య సురమాతృమేగతాః" అనెను. పునర్వసు "నౌకాకారం పంచ" అని మరొకరి వర్ణన. ఇక్కడి చిత్రములో 1, 3, ఒకటి మూడు సంఖ్యలచే తెలుపబడిన చుక్కల మధ్య చిన్న తెల్లగీతలచే వ్యక్తము చేయబడిన యాకారమునందు ధనుస్సు రూపము గోచరించుచున్నది. రెండు ప్రక్కలను వక్రత భావించుకొనినచో, దోనెయొక్క ఉపరిభాగపు రూపముగూడ ఇందు స్ఫురించుచున్నది. వాల్మీకి 'పునర్వసు మహామీనమ్' అని యీచుక్కలను పెద్దచేపతో పోల్చినాడు.

శ్రీకృష్ణదేవరాయలవారు ఆముక్తమాల్యద IV-177 లో పునర్వసునక్షత్రమును తళుకుగల చేపతో పోల్చినారు.

గీ. వృష్టితతినిడ్డ జెనద్రావ క్రిందనుండి
తేటనదినీట దనవెంట దేలుమీల
తళుకుతో నాచులత దోచె వెలికి జమిలి
వెండి మీలెక్క వెంద్రుక విల్లువోలె.

వర్షాకాలమందు చేపలు గ్రుడ్లు పెట్టును. ఏటి నీటిలో నాచుగల ప్రదేశము గ్రుడ్లు పెట్టుటకు సదుపాయముగా నుండును. ఆగ్రుడ్లను తినుటకు ఇతరచేపలు నాచుతీగెమీదుగా పైకెగపడును. అది యెట్లుండుననగా దాసరివాండ్రు, గుఱ్ఱపు వెండ్రుక కట్టి తయారుచేసినవిల్లు తంబురా తీగెమీద యాడించినపుడు అలంకారార్థము ఆకామాచి వింటికికట్టిన వెండిచేప రూపములు వింటిమీదకి ఎగబడిన దృశ్యమును స్ఫురింపజేయును కాబట్టి పునర్వసు ధనురాకారమును బేడి సమీను తళుకునుగూడ ఈపద్యమున నుటంకింప బడినట్లు తోచెడిని. ఈనాటికాలేజీలలో Science విజ్ఞాన శాస్త్రము పఠించు యువకులు కొందరు ఈచుక్కలు elongated double-convexlens'—మధ్యనుబ్బెత్తుగాను పొడుగుగాను ఉన్న గాజుతెన్సువలె నున్నవనిరి. పైవర్ణనలన్నియు పునర్వసు చుక్కలరూపమునకు ఒకమోస్తరుగా సరిపుచ్చుకోవచ్చును; కాని అవి dull prosaic - చప్పిడివర్ణన లనకతప్పదు. చుక్క

లకు స్వతసిద్ధముగాఁగల తళుకు లావణ్యము నందు స్ఫురించుట లేదు. చుక్కలమెఱుపు గోచరింపచేయక పైయుపమానము లన్నియు నిస్తేజములై యున్నవి.

శ్రీనాథకవి సార్వభౌముని వర్ణనలో పునర్వసు నక్షత్రముల సహజలావణ్యము చక్కగా స్ఫురించుచున్నది. "ఒకచో పునర్వసు ఊఁగఁ:ృక్షము కొమ్మసుడివడ్డి ముత్యాలసాబగువోలె" కాశీ I - 138. మేరుపర్వతముపై ఈర్ష్యచే వింధ్యము పెరిగి పోయి నక్షత్రమండలమునంటి విశ్వవ్యాపారములను స్తంభింపచేసినపుడు, పునర్వసుచుక్కల తళుకు మిణుకులు ఎట్లున్నవనగా – చెట్టుకొమ్మకు తగుల్కొనిఊఁగుచున్న ముత్యాలహారములో మిలమిలలాడు ముత్యములవలె లావణ్యముతో మెఱయుచున్నవని చక్కని యుపమానము. ఈముత్యాలహారమునకు 3 అంకె వేసి చిత్రములోచూపినచుక్క నాయకమణియై మెఱయుచున్నది. శ్రీనాథుడు చేసిన ఈ పునర్వసు వర్ణనము సజీవము, రసవంతము. సముజ్జ్వలము నై యొప్పుచున్నది.

పునర్వసున కధిదేవత 'అ ది తి' దేవి. అదితి (విశ్వభర్త్రి; దేవతలకందరకు కన్నతల్లి. అవతార పురుషుడైన శ్రీరామచంద్రుని జన్మనక్షత్రము పునర్వసు. పునర్వసులో చంద్రుడున్నపుడీ చుక్కలశోభ ఇంకను దివ్యముగా ప్రదర్శితమై యొప్పుచుండును. (చూ. 15 వ పటము)

---

# 33. పునర్వసులోని యుత్తర పుచుక్కలజత

ఇక్కడిచిత్రములో 1-2 సంఖ్యలచే చూపబడిన ఉత్తరపు చుక్కలజతను పాశ్చాత్యజ్యోతిష్కులు Castor and Pollux నామములతో వ్యవహరింతురు. ఒకప్పుడానామములుగల సోదరులిద్దరు ఉండిరట! వారు నక్షత్రమండలము చేరుకొనిచుక్కలై యిట్లు ప్రకాశించుచున్నారని పడమటి గాథలున్నవి.

వేదవాఙ్మయమునుబట్టి చూడగా నీచుక్కలొకప్పుడు అశ్వనీదేవతలుగా భావింపబడుచున్నట్లు తోచుచున్నది. వేదములలో అశ్వినులు 'త్రిషధస్థు' లని వర్ణింపబడినది. వారికి మూడు స్థానములు గలవు. మొదటిది అశ్వినీ స్థానము. రెండవది, పునర్వసుస్థానము; మూడవది అశ్వతర Centaurus స్థానమని నిరూపింపగలము. ఈజంట చుక్కలు భార్యాభర్తలగుదురని, పార్వతీపరమేశ్వర మిథున మీచుక్కలేనని భావింపబడుచున్నది. పునర్వసు మూడు పాదములు మిథునమేకదా?

కాళిదాసు రఘువంశము XI. 36 లో రామలక్ష్మణుల నీచుక్కల జతతో పోల్చినాడు. "తౌవిదేహ నగరీ నివాసినాం గాంగతావివదివఃపునర్వసూ మన్యతాస్మిపిబతాంవిలోచనైః పక్ష్మపాతమపివంచనాంమనః". జనకమహారాజు ఇంటనున్న శివధనుర్భంగమునకు ముందు రామలక్ష్మణులు మిథిలానగరమున ప్రవేశించు ఘట్టము వర్ణించుచు కాళిదాసు పైశ్లోకమును

రచించెను. "గాంగతే" అనగా "భువంగతే" భూమిమీ దిగివచ్చిన పునర్వసు చుక్కల జతవలె ప్రకాశించుచు వచ్చు రామలక్ష్మణులను చూచి రెప్పవేయక పౌరులు వారి సౌంద ర్యమును గ్రోలుచుండిరట!"

---

# 34. శ్వానము, పూర్వశ్వానము

వేదములో ఖగోళస్థములై నక్షత్రరూపములైన శునక రూపములు రెండు వర్ణింపబడినవి. (1) శ్వానము (2) పూర్వ శ్వానము. శ్వానమును పడమటి జ్యోతిష్కులు (Canis Major) కేనిస్ మేజర్ అనియు, పూర్వశ్వానమును (Canis Minor-Procyon) కేనిస్‌మైనరు, ప్రోశ్యాన్ అనియు తెలుపు చున్నారు. ఇందు ప్రోశ్వాన్ పదము పూర్వశ్వానశబ్ద వికృతి యగుట స్పష్టము. శ్రీనాథుడు వర్ణించిన పునర్వసు ముత్యాల హారమునకు పూర్వశ్వాన నక్షత్రము నాయకమణి యగున నొప్పును. పునర్వసు చిత్రములో 3 అంకె వేసి చూపిన చుక్క పూర్వశ్వానము. ఈనక్షత్రము పదిన్నర వెలుగు వత్సరముల దూరమందున్నది; సూర్యునికంటె అయిదున్నరరెట్లు తేజోధిక మైన గోళము.

---

# 35. మృగవ్యాధరుద్రుడు

(చూ. 16 వ పటము)

శ్వానపుగుంపులో పెద్దచుక్కను పడమటి జ్యోతిష్కులు సిరియస్ Sirius అందురు. వేదవాఙ్మయములో నిది మృగవ్యాధరుద్రుడని వర్ణింపబడెను. ప్రజాపతి తన కుమార్తెయగు రోహిణిని దుశ్శీలుడై బలాత్కరింపబోగా మాయామృగరూపుడగు నాప్రజాపతిని రుద్రుడు బాణప్రయోగముచే పడగూల్చి, దేవతల హాహాకారములు మాన్పి, వారిచే పశుపతిత్వము వరముగా బడసెను. మన రైతులు గొల్లకావిడి చుక్కలనెడి మూడు చుక్కలును మృగవ్యాధుడేసిన బాణమనియు, దానికి నలుప్రక్కలను మంచముకోళ్లవలెనున్న నాలుగు చుక్కలును మాయామృగదేహమనియు లోకమాన్య తిలకుగారి. యన్వయము రోహిణి, గొల్లకావిడి చుక్కలు, మృగవ్యాధుడు, ఈ చుక్కలన్నియు నొక్క పంక్తిలో నించుమించుగా నుండుట మనము ముఖ్యముగా గమనింపవలెను. ఇట్లే వేదగాథలన్నియు నక్షత్రరూపమున ఖగోళమున చిత్రింపబడి నేటికిని కానవచ్చుచున్నవని పాశ్చాత్య విమర్శకులుకూడ అంగీకరించిన విషయమే.

మరియు నీమృగవ్యాధుని బాణుడు, కాదంబరిలో నిట్లు సొగసుగా వర్ణించియున్నాడు: "క్వచిదంబర శ్రీరివ వ్యాధానుగమ్యమానతరళతారకామృగాః". విశేషించి, శ్రీనాథుడు "హాలాహలంబను నల్లనేరెడిపండు మిసిమింతుడును గాక మ్రింగి

నాడు" అని చక్కగా వర్ణించిన భీమరుద్రరూపముకూడ ఈ మృగవ్యాధరుద్రనక్షత్రమేనని జ్యోతిర్వేదమునందు నిరూపింపబడినది. తేజోవిషయమున నగ్రగణ్యములని పేర్కొనబడిన నిరువది First Magnitude Stars లో మొట్టమొదటిదీ మృగవ్యాధరుద్రనక్షత్రమే. ఇదియే పడమటివారి Sirius సిరియస్ చుక్క. ఇయ్యది సూర్యునికంటె 26⅓ రెట్లు తేజోధికమైనది; ఎనిమిది సంవత్సరములన్నర వెలుగు వత్సరముల దూరమున నున్నది.

---

## 36. పుష్యమి

(చూ. 17 వ పటము)

పుష్యమికి వేదగ్రంథములలో తిష్యమి యనియు సిద్ధ్య యనియు రెండు పేర్లు కనబడుచున్నవి. తిష్యమి పుష్యమిగా నెపుడు మారెనో తెలియుటలేదు. బాణమువంటి రూపము గల మూడు చుక్కల శరున తిష్యమి యందురు. "సరటాత్రీణి" — ఊసరవెల్లివంటి మూడు చుక్కలు పుష్యమి యని వరరుచి తెలిపెను. పొట్లపూవువంటి చుక్కలు మూడు పుష్యమి యగునని కొందరు వర్ణించిరి. ఇటీవలి వారు పుష్యమిని వెలిమబ్బు (White Nebula) గాను, తెల్లని మచ్చగాను గుర్తించుచున్నారు.

పుష్యమి కర్కాటకరాశిలోనిది. పునర్వసు $\frac{1}{4}$ + పుష్యమి + ఆశ్లేషాంతము కర్కాటకము. ఈకర్కాటకరాశిని పడమటి వారు Concri అందురు. ఆరాశిలో, గామా, డెల్టా, తీటా లనబడు గ్రీకుఅక్షరసంజ్ఞలచే గుర్తింపబడు చుక్కలు మూడును పుష్యమియని నిరూపింపబడినది. పుష్యమిలో వెలిమబ్బువలె తోచు తెల్లనిమచ్చ ఒకవెండికంచమనియు, దాని కిటునటుగల చుక్కలురెండును రెండుగాడిదెలు Aselli అనియు పడమటి వారు చెప్పుచున్నారు. ఈభావమే ఋగ్వేదములోగూడ గలదు. ఎట్లనగా అశ్వినీదేవతలకు వాహనము రాసభ మనియు, గార్ధభమనియు నీక్రిందిమంత్రములు తెలుపుచున్నవి :— "కథా యోగోవాజి నోరాసభస్య" ఋ. . 34-9. "సగర్ధభరథే నాశ్వినా ..." పునర్వసులోనున్న ఉత్తరపు జంటచుక్కలు అశ్వినులని భావించినపుడే రాసభములు వారివాహనము లన దగియున్నవి. పునర్వసుదిగువ పుష్యమి చుక్కలేకదా ? ఇక్కడ కర్కాటరాశి యొక చిత్రముగాను, వెండికంచమును గాడిదలును రెండవ చిత్రముగాను చూడనగును. నవీనులు కొందరీ కర్కాటక రాశిచిన్నపిలకలుగల కందదుంపవలె నున్నదనుచున్నారు.

(చూ. 18 వ పటము)

పుష్యమికిఅధిదేవత బృహస్పతి. తైత్తిరీయ బ్రాహ్మణ ములోనున్న "బృహస్పతిః ప్రథమంజాయ మానాతిష్యమిా..." అనువచనమునుబట్టి యాబ్రాహ్మణము క్రీ.పూ. నాలుగువేల

సంవత్సరముల క్రిందట— ననగా ఇప్పటికి సుమారు ఆరువేల సంవత్సరములక్రిందట రచింపబడెనని కేత్కార్ ketkar పండితులు కాలనిర్ణయముచేసిరి. పునర్వసుధనువుతో పార్వతీ పరమేశ్వరులనిక్కడ చూడనగును.

(చూ. 19 వ పటము)

---

# 37. ఆశ్రేష

వేదవాఙ్మయమునం దంతటను ఈ నక్షత్రసమూహము 'ఆశ్రేష' అనియే పేర్కొనబడెను. "సర్పబుతు" సర్పాకారముగల నక్షత్రములాఱుచేరి యాశ్రేషయగునని వరరుచి వర్ణించెను. చక్రాకృతి షట్ నక్షత్రాత్మకమని దీపికా కారుడు తెలిపెను. ఆశ్రేషకుఅధి దేవత సర్పము. 'ఆశ్రేషానక్షత్రమ్ సర్పో దేవతా' అనిశ్రుతి. "తేనసర్పాసోహవ మాగమిష్టా, యేరోచనే సూర్యస్యాపిసర్పాః" అని మంత్రపాఠములలో గలదు.

సూర్యునిరథమునకు కట్టబడిన గుఱ్ఱములేడు. కాబట్టి సూర్యుడుసప్తాశ్వుడు. సూర్యునిరథమున కీగుఱ్ఱములు సర్పములచే కట్టబడినవి. నవీనవిజ్ఞాన శాస్త్రప్రకారము సూర్యకాంతిలో నేడురంగులున్నవి. నేరేడుపండురంగు (Violet) నీలిరంగు (Indigo), ఇంద్రనీలపురంగు (Blue), ఆకుపచ్చరంగు

(Green), పసుపుపచ్చ రంగు (Yellow), నారింజపండు రంగు (Orange) ఎఱుపురంగు (Red) అను యేడురంగుల సంపుటి యేసూర్యకాంతి. ఇవే సూర్యునిరథమునకు కట్టబడిన యేడు గుఱ్ఱములుగా మనపూర్వులు వర్ణించిరి. ఈరంగుగుఱ్ఱములు సూర్యునిరథమునకు పాములచే బంధింపబడినవి. "భుజగన మితా సప్తతురగాః" ఇట్లనుటలో గొప్ప విశేషమున్నది. ఆవిశేషము సులభగ్రాహ్యముకాదు; సూక్ష్మము, గుప్తము నై యొకంతట పట్టుబడదు. పాములు ఋజురేఖామార్గమున సూటిగాపోవు. మెలికలుతిరుగుచు వక్రగతుల ననుసరించి పోవును. ఈమెలికలును, వక్రగతులును సముద్రతరంగ గమనమును పోలియుండును. సూర్యుని గుఱ్ఱములని చెప్పబడిన రంగుకిరణములు సూటిగా సరళముగాపోజాలవు; సర్పబద్ధములై సర్పములవలెనే మెలికలుతిరుగుచు తరంగగమనములతో ముందునకుపోవును. ఇట్టిగమనమును పడమటివైజ్ఞానికులు (wave motion) తరంగ గమనమని చెప్పచున్నారు. నిన్నమొన్నటిదాక సూర్యకిరణములకీ తరంగగమనము కలదని పడమటి వైజ్ఞానికులెఱుగరు. వెలుతురు కిరణములు ఋజురేఖాగమనము ననుసరించి పోవునని (Light travels in straigt lines) మాకుపాఠములు చెప్పిరి. ఇటివలసూక్ష్మతిర యంత్రములతో బహుపరిశీలనచేయగా చేయగా, సూర్యకిరణముల గమనము తరంగగమనమని తేలినది. ఈనాడు వీరికి తెలిసిన యీప్రకృతి సత్యము మనపూర్వులకేనాడో తెలిసి.

యున్నది. ఆయంశము నిగూఢముగా నుండుటచేత సులభ గ్రాహ్యముకాకపోయెను. ఈనాటివైజ్ఞానిక దృష్టితోపరిశీలించి నపుడే ఆనాటిఋషివర్యుల మహత్తరవిజ్ఞానమర్మము లొక్కొ క్కటే బయల్పడుచున్నవి. సర్పసహజమైన వక్రగతులతోపోవు వివిధవర్ణకిరణ సమామ్నాయముచేత సూర్యుడుప్రకాశించు చున్నాడనుటకు మరొకటిరెండు ప్రమాణములను గమ నింతము :— "యేదోరోచనేదివో, యేవాసూర్యస్య రశ్మిషు యేషామప్సుషదః కృతంతేభ్యస్సర్పే భ్యోనమః" మంత్ర పాఠములందు సర్పసూక్తము; "సప్తాశ్వోఅరోక్, అరుణ రుచివపుః సప్తరజ్జు..." సౌరసూక్తము. కాబట్టి యీనాటి వైజ్ఞానికులు తెలిసికొనిన సూర్యకిరణ రచనా విధానము వానితరంగగమన యుదంతము, వానియురువడి — ఒకసెకెండు కాలములోనవి యెంతదూరము పోగలవో ఆవేగనిర్ణయము కూడ మనపూర్వులకు బహు కాలముక్రిందటనే తెలిసియు, సులభగ్రాహ్యముగాక మనకింత వఱకు తెలియక గుప్తముగా నుండెనని స్పష్టమగుచున్నది.

---

## 38. గరుడ సర్ప విరోధము

సర్పదేవతాకమైన ఆశ్లేషచుక్కలకు ప్రతిస్పర్ధియై ఎదురుగా Diametrically opposite గా శ్రవణ నక్షత్ర

ములున్నవి. శ్రవణము గరుత్మంతుడు. తూర్పున శ్రవణరూపుడగు గరుత్మంతుడు ఉదయించునపుడు పడమట ఆశ్లేష సర్పము అస్తమించును. ఈశ్వరముస్మఘులకు వలెనే గరుడసర్పములకు ఖగోళభూగోళములయందు వైరము సుప్రసిద్ధము.

---

# 39. విఘ్నేశ్వరుడు సర్పయజ్ఞోపవీతుడు

చూ. 20, 21 వ పటములు)

భాద్రపదశుక్ల చవుతి విఘ్నేశ్వరచవుతి. మరునాటి పంచమి ఋషిపంచమి. చవుతినాటి ఉదయము సూర్యోదయాత్పూర్యము విఘ్నేశ్వర నక్షత్రములు తూర్పున నుదయమగును, "ప్రాతర్యావాణా ప్రథమాయధ్వజమ్" (ఋ V. 77-1) అను శ్రుతి ప్రమాణము ననుసరించి, ఏనాడు సూర్యోదయాత్పూర్వము ఏచుక్కలుదయమగునో, ఆచుక్కల యధిదేవతల నానాడు ముఖ్యముగా మొదట పూజింపవలెను. కనుక నీచవుతి నాడు విఘ్నేశ్వరుని పూజించి పండుగ చేసికొందుము. మరు నాడు ఋషిపంచమి. బృహదృక్షములోని సప్తఋషులు నీనాడు సూర్యోదయమునకు ముందుదయింతురు. కావున పంచమినాడు వృద్ధవనితలు ఋషుల పూజించి యుపవాసముందురు. సప్త ఋషులు మఘతో జట్టుగా నుదయమగుదురు. సప్తఋషుల పడమట భాగముననున్న విఘ్నేశ్వరనక్షత్రములు ఆశ్లేషతో

జట్టుగా నుదయమగును. ఖగోళమునకూడ నీ యవినాభావసంబంధము ప్రదర్శితమగుచున్నది. శ్రోత్రియబ్రాహ్మణులకు వారి యజ్ఞోపవీతముతోవలెనే, వినాయకునకు సర్పాకారమై, సర్పదైవత్యమైన ఆశ్లేషతో నవినాభావసంబంధముండుటచేత ఆశ్లేషసర్పము వినాయకుని జన్నిదమని మనపెద్దలు చెప్పుదురు. ఆశ్లేషచుక్కల ననుసరించి ఆదిగువ స్వాతీనక్షత్రము వఱకు వ్యాపించిన ఘోరసర్పరూపము ఖగోళమున కానవచ్చుచున్నది. నక్షత్రాత్మకమైన యీసర్పమును మనవారు ఆ జ గ ర మందురు. ఇంగ్లీషువారు హైడ్రా Hydra అందురు. సప్తఋషులచే పల్లకి మోయించుకొని, ఇంద్రాణికొఱకు త్వరగా పోవుచున్నను, తృప్తిలేక, ఇంకను త్వరగా పొమ్మని ఆతపశ్శాలులను త్వరపెట్టి, యవమానించి, తత్ఫలితముగా శప్తుడై ఆజగరమైన నహుషుని చరిత్రము స్వాతీ, ప్రోష్ఠపదానక్షత్రముల చర్చలో చూడగలము. నహుషునికథ కొన్ని కల్పనలతో 'బ్రహ్మరథ' మను చలనచిత్రములో Cinema ప్రదర్శితము.

---

## 40. మ ఘ

(చూ. 22 వ పటము)

ఈనక్షత్రము ఋగ్వేదములో 'అఘా' అని పేర్కొనబడినది. తదితర గ్రంథములలో నిది 'మఘ' యనియే చెప్పబడినది.

"ఆందోళికాంపంచ" పల్లకి యాకారముగల చుక్కలైదిందు కలవని వరరుచి తెలిపెను. కాళిదాసు "లాంగులాకృతిని పంచ తారకే" అనగా నాగలి ఆకారముగల చుక్కలైదు ఇందు కలవని వర్ణించెను. ఇవి సింహరాశి "Leo, the Lion" లో అల్ఫా, ఈటా, గామా, జీటా, మ్యూ అక్షరగుర్తులు గల చుక్కలగునని పాశ్చాత్య నిర్ణయము. వీటిలో నెల్ల మిక్కిలి కాంతివంతమైన ఆ ల్ఫా చుక్కయే యోగతార మఘ. దీనికా దేశములలో Regulus రెగ్యులస్ అని ప్రత్యేకనామము గలదు. ఈనక్షత్రము ఏబదియారు వెలుగువత్సరముల దూరములో నున్నది. సూర్యునికంటె డెబ్బదిరెట్లు తేజోధికమైన మహాగోళమిది. ఒకప్పుడు దక్షిణాయనము మఘ కార్తెతో ప్రారంభమగుటచేతనో మరియే హేతువుచేతనో కాని మఘకు పితృదేవత లధిదేవతలని తైత్తిరీయ సంహిత తెలుపుచున్నది. సప్తఋషులలో ధ్రువసూచకులగు పులహాక్రతులతో కూడ ఇంచుమించుగా మఘ ఉదయమగును; కనుక మఘచుక్కలను సులభముగా పోల్చుకోవచ్చును. మఘపల్లకినెక్కి నహుషుడు బ్రహ్మరథము పట్టించుకొని అజగరమై పడుట పైని గమనించి యున్నాము.

---

# 41. ఫల్గునీ నక్షత్రములు

ఇందు పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని అని రెండున్నవి. ఇందొకొక్కటి రెండేసి చుక్కలజత. ఋగ్వేదములో వీనికి అర్జునీ నక్షత్రములనియే పేరు కలదు. కృష్ణయజుర్వేదము నాటికి వీనికి ఫల్గునీ నక్షత్రములను నామ మేర్పడెను. అందొకొక్క దానిలో ముందు వెనుక మంచపుకోళ్లవలె— "ద్వేద్వేఖట్వం" రెండేసి చుక్కలున్నవని వరరుచి వర్ణన; "ఖట్వాకృతి తారకాద్వయాత్మకమ్" అని ముహూర్త చింతామణిలో గలదు. 'దక్షిణోత్తరమిళిత తారకాద్వయాత్మక' మని కాళిదాసు వివరణ. పూర్వఫల్గుని మొదట పూ. ఫ. అయి యిప్పటి వాడుకలో 'పుబ్బ' గా మారినది. సింహరాశి Leo లోని ఈటా, తీటాలను నక్షరసంజ్ఞలుగల రెండు చుక్కలు పూర్వఫల్గుని; ఆరాశిలోని బీటా – 93 సంజ్ఞలుగల రెండుచుక్కలును ఉత్తరఫల్గుని. దీనిని వాడుకలో ఉత్తరయందురు. ఇందలి 'బీటా' చుక్కకు Denebola 'డెనిబోలా' అని పడమటి ఖండములలో ప్రత్యేకనామ మున్నది. పూర్వఫల్గునికి ఆర్యముడును, ఉత్తరఫల్గునికి భాగ్యప్రదుడగు 'భగు' డును అధిదేవతలు. ఉత్తరఫల్గునీ నక్షత్రము అర్జునుడు.

---

# 42. ఉత్తరఫల్గుని - అర్జునులు

(చూ. 23 వ పటము)

అర్జునుడు సింహవిక్రముడు; ధనుంజయుడు ధనుర్ధరులలో శ్రేష్ఠుడు. ఆనాడు మరి యేయితర యోధుడును భేదింపజాలని మత్స్యయంత్రమును భేదించి కన్యను—ద్రౌపదిని స్వయంవరమున బడసిన అసదృశవిక్రముడు. మత్స్యమనగా మీనము. ఆకాశమున తిరుగుచుండు మీనరాశిని అర్జునుడు భేదించి కన్యను బడసెను. మీనరాశి అర్జునునకు ప్రతిస్పర్ధి. అర్జునుని కందలి చుక్కలు ఎట్టఎదుటి చుక్కలు—diametrically opposite అయి యున్నవి. ఉత్తరనక్షత్రము తూర్పున నుదయము కాగానే, ఆనక్షత్రమున కెట్టయెదుటనున్న మీనరాశి— ¼ పూర్వభాద్ర+ఉత్తరాభాద్ర+రేవతి అస్తమించును. ఈ మీనరాశిలో ఒకటికాదు; రెండు చేపలున్నవి "మత్స్యద్వయంచేతి" అని ప్రమాణము. ఇందొక చేప తూర్పు - పడమరలకు, రెండవది ఉత్తర - దక్షిణములకు వ్యాపించి యున్నవి. మొదటి చేప తోకకును, రెండవ చేప తోకకును మధ్య లంకెగలదు. ఈలంకె ఖగోళమున మెలికలు తిరిగిన పాశము—చక్కని పట్టీవలె కనబడుచుండును. ఈపాశమునకు మొత్తముమీద నేడువంకలును, చుట్టును ఉన్నవి. ఈపట్టీనే వేదము వరుణపాశమని వర్ణించినది. "సప్తసప్తత్రేధా తిష్టంతే." ఈ మెలికలలో మూడు చిన్నవి. నాలుగు పెద్దవి. మెలికలేదైనను, వాటిమధ్య joints కణుపులు అయిదు

మాత్రమే. ఈగట్టిపట్లు—అయిదింటిని భేదించి పాశము విడగొట్టి చేపలను పడగొట్టుటకు అయిదు అలుగులు కావలసియున్నవి. అర్జును డైదుబాణములతోనే మత్స్యయంత్రము భేదించినట్లు భారతమునందు కలదు. బకాసురుని వధానంతరము కొన్నిదినములు గడిచిపోయిన తరువాత డెబ్బదియైదవ దివసమున, పౌషమాసమున బంచమీ రోహిణీ నక్షత్రమున ద్రౌపదీ స్వయంవరమహోత్సవము జరిగినట్లు నన్నయభట్టారకుడు భారతమున వర్ణించి యున్నాడు. అంతవఱకు బ్రాహ్మణ వేషమున నజ్ఞాతుఁడై యుండిన అర్జునుడు ఆసమయమునకు సరిగా స్వయంవరరంగమున నావిర్భవించి, నిర్ణయప్రకారము అయిదు బాణములతో చేపలమధ్య పాశపుపట్లు అయిదింటిని విడగొట్టి, చేపలను పడవైచి మత్స్యయంత్రమును భేదించి, ఆరంగమున పూలమాలతో సిద్ధముగానున్న ద్రౌపదిచే వరింపబడెను. కారణాంతరములచే సోదరులు నలుగురును, తానును ఆమెను వివాహమాడిరి.

(చూ. 24 వ పటము)

---

## 43. ఖగోళమున, ఉత్తరగోగ్రహణ వృత్తాంతము

ద్రౌపదీ వివాహానంతర మిచట గమనింపవలసిన ఖగోళ విషయము ఉత్తరగోగ్రహణము. ఉత్తరఫల్గుని సింహరాశి

లోనిది. ఆవఱకును అరణ్యావాసమును, అజ్ఞాతవాసమును, చేసి చేసి గుహాంతరసింహమువలె అర్జునుడు కానరాకయుండెను. కాని యా గోగ్రహణావసరమున బయల్పడెను. ఈగోగ్రహణ ఘట్టమున తిక్కన సోమయాజి అర్జునుని బహురమ్యముగా వర్ణించి యున్నాడు :—

"మ॥ సింగంబాకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాం తా రనివాసఖిన్నమతిన న్మత్సేనపై వీడెవ
చ్చెం గుంతీసుత మధ్యముండుసమరస్త్రీమాభిరామాకృతిన్"

విరాట 4-95

తూర్పున సింహరాశి ఉదయమగుచుండగా కనులార చూచుచు ఈపద్యము నన్వయించుకోవలెను. అప్పుడే యీ పద్యరాజముయొక్క ఖగోళసామరస్యము దృష్టిగోచరమై అద్భుతావహమగు చుండును. మఘ + పుబ్బ + ఉత్తర $\frac{1}{4}$ సింహ రాశి. మఘ కెదురుగా ధనిష్ఠ అస్తమింపబోవును. ధనిష్ఠనక్షత్ర మునకు అధిదేవతలు వసువులు. ధనిష్ఠతో గోలోకమున్నది. మరియొలెక్క:- మత్స్యపురాణములో పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతులు గోవీథియని గలదు. ఏలెక్కను చూచినను ఈప్రాంతము గోవులమంద యనదగియున్నది. కౌరవసైన్య మీ గోవులమందను పొదివిపట్టినది. అందు ధనిష్ఠ భీష్ముడు. ద్రోణుడు కుంభసంభవుడు. ధనిష్ఠ $\frac{1}{2}$ + శతభిషము + పూర్వా

భాద్ర - కుంభరాశి. ద్రోణుడు వేదికాధ్వజుడు. పూర్వా భాద్ర+ఉత్తరాభాద్రలు గార్హపత్యాగ్ని వేదిక. రేవతి పూషా రుడు కర్ణుడు. కర్ణునిది హస్తికక్ష్య. సింహరాశి కొనుకుగా ఏనుగులున్నవి. హస్తినాపురికా పేరు ఏ ఏనుగువలన వచ్చెనో ఆయేనుగపైనెక్కి కర్ణుడు ఈగోగ్రహణ యుద్ధము నకువచ్చి యున్నాడు. దుర్యోధనుని సోదరశతము ఘోర చరిత్రులు. అందరిని దిగమ్రింగు శింశుమారములనదగినవారు. పడమటి దేశస్థులు Cetus అనిచెప్పు ఘోరజలచర రూపమూ ప్రక్కనేయున్నది. కౌరవతిమింగలము గోలోకపు గోవులను పొదివి పట్టుకొని పోపజూచుచుండగా అర్జునసింహమడ్డుపడి విడిపించినకథ వివరములతో నక్షత్రరూపమున నాకాశరంగ మున మనకు ప్రదర్శితము. మహాభారతకథ యంతయు నాకాశరంగమున నక్షత్రరూపమున నెట్లు చిత్రింపబడెనో క్రమముగా చూడగలము.

(చూ. 25 వ పటము)

---

## 44. హస్త

వేదవాఙ్మయమునందతటను ఈ నక్షత్రసమూహము 'హస్త' అనియే చెప్పబడినది. "పాణినాంపంచ" చేతివ్రేళ్లవలె ఐదుచుక్కలు హస్త యుని వరరుచి. హస్తచుక్కల నిచ్చట చిత్రములో స్పష్టముగా చూపియున్నాము. హస్తకు దక్షిణ

భాగమున కొంత దూరములో నాలుగు చుక్కలున్నవి. ఆచుక్కలు వార్త్తికమనబడు పక్షిరూపము. ఆపక్షిని పొట్టలో పెట్టుకొనుటకు భయంకరరూపముతో నొకవృకము రాగా, దానిని అశ్వినులు పొడిచి సంహరించి ఆపక్షిని విడిపించి రక్షించి నట్లు ఋగ్వేదములో పెక్కుచోట్ల వర్ణింపబడెను. ఆ పక్షిని పాశ్చాత్యులు Corvus the Crow కార్వసునామము గల ఒకానొక కాకియని చెప్పుచున్నారు. ఈకాకి చుక్కలే హస్త నక్షత్రమని వేదపండితుడు Macdonell మేక్డొనెల్‌దొర తెలి పెను. మనదేశములోకూడ పలువురు పండితులు ఆకాకినే హస్తయని చూపుచున్నారు. క్రాంతి వృత్తము ననుసరించి చిత్రకు మీదుగానున్న హస్తచుక్కలను మానుకొని, ఆవృత్త మునకు చాల దూరమందున్న కాకి చుక్కలను హస్తయనుట పొరపాటని విన్నవించుచున్నాను. హస్తకు అధిదేవత సవితృడు. 'హస్తనక్షత్రమ్ సవితా దేవతా' అని కృష్ణయజుర్వేదము.

---

## 45. చిత్ర

వేదకాలమునుండియు నీనక్షత్రమునకు చిత్రయనియే పేరు "మౌక్తికమేకమ్" అనిపరగుచియు, "ఏకమౌక్తిక సము జ్జ్వలప్రభే" అనికాళిదాసును, దీనిని వర్ణించిరి. ఇదికన్యా రాశిలోని ముఖ్యనక్షత్రము. ఉత్తరఫల్గుని మూడుపాదము

లును, హస్తయు, చిత్రలో రెండు పాదములునుచేరి కన్యారాశి యగును. ఇంగ్లీషులో కన్యను 'వర్జిన్' virgin అందురు. లాటిన్ భాషలో నీరాశిని Virgo 'వర్గో' అందురు. కన్యా రాశిలో ప్రధాననక్షత్ర మనుటచేత పడమటి జ్యోతిష్కులీ చిత్రను 'ఆల్ఫావర్గో' అనుచుందురు. చిత్రకు 'స్పైకా' Spica అని ప్రత్యేకముగా ఆ దేశములలో పేరున్నది.

చిత్రానక్షత్రము బ్రహ్మాండ మయిన మహాగోళము. మనసూర్యునికంటె 1500 రెట్లు తేజోధికమైనది; నాలుగువేల రెట్లు పెద్దది; మనకు రెండువందల ముప్పది వెలుగు వత్సర ముల దూరములోనున్నది.

చిత్రకుఅధిదేవత ఇంద్రుడని కృష్ణయజుర్వేదములో చెప్పబడినది; 'త్వష' అధిదేవతయని మరికొన్ని ప్రమా ణము లున్నవి. "త్వష్టానక్షత్ర మభ్యేతిచిత్రామ్" అని మంత్ర పాఠములు తెలుపుచున్నవి. త్వష్టయనునతడు దేవతలదారు శిల్పి; వడ్రపుపనిచేయువడ్రంగి (Carpenter of the Gods)

కన్యారాశిలో ముఖ్యనక్షత్ర మగుటచేత చిత్ర చాల ప్రసిద్ధమైనది. ప్రపంచవాఙ్మయములలో నీకన్యారాశికి గల ప్రాముఖ్యము మరొకరాశికిలేదు. ఋగ్వేదమునందీ కన్య మరుత్తుల కేడుగురకునుసామాన్యభార్య. చూ. ఋ .167.4:- "పరా, శుభ్రా (అ) యాసో యవ్యాసాధారణ్యేవ మరుతో

మిమిక్షుః". పంచమవేదమైన భారతకథలో నీకన్యారాశియే ద్రౌపది యగుచున్నది. ఇట్లు వ్రాయుటలో నీక్రిందియంశ ములు బహుజాగ్రతగా గమనింపవలసి యున్నది.

(1) ద్రౌపది అగ్నికుండసముద్భవ; అయోనిజ. కన్యా రాశికి దిగువ విశాఖ చుక్కలున్నవి. విశాఖ ఇంద్రాగ్ని దైవత్యమైన నక్షత్రము. తులారాశిలో దక్షిణపు సిబ్బి యీ విశాఖచుక్కలే యగుచున్నవి. 'విశాఖా కులాలచక్రంపంచ' యని వరరుచి వర్ణన. కాబట్టి విశాఖ కుమ్మరి సారివలెగుండ్ర ముగానుండును. ఈవర్తులాకారమును శ్రీనాథుడు చమత్కార ముగా వర్ణించినాడు. "చిఱుతవోయిన మూకుటిచెలువు దాల్చి హత్తెనొకచో విశాఖ వింధ్యాద్రియందు" అని వింధ్యపర్వతపుటలజడిలో. ఆపర్వతము పైచిక్కి, చిన్నబో యిన, మూకుటివలె విశాఖ నక్షత్రములు చిక్కుకొనెనని శ్రీనాథుని యుపమానము. విశాఖ కధిదేవతలు ఇంద్రా గ్నులు. మూకుటివలెను, తరాసు సిబ్బివలెను గుండ్రని యాకారము గలిగి, అగ్నిమయమగుటచేత విశాఖ గుండ్రని యగ్నివేదిక యనుట ఎంతోఒప్పియున్నది. ఇట్టి యగ్నికుండ మడుగునను, దానిపైని కన్యారాశిచుక్కలును కానవచ్చు టచేత కన్య "అగ్నికుండ సముద్భవ" యనియు 'నయోనిజ' యనియు చేసిన వర్ణన దివ్యముగా నున్నదని యంగీకరింప తప్పదు.

(2) స్వయంవరోత్సవములో మత్స్యయంత్రమును భేదించిన వీరు నామె వివాహమాడునని నిర్ణయమైనది. ఉత్తరఫల్గునీయర్జును డుదయించి మీనరాశిని పడమట పడగొట్టుటతో మత్స్యయంత్రభేదన మైనది. అందలి చేపలు రెండును అస్తమించి యదృశ్యమైన పిమ్మటనే ద్రౌపది, కన్య, ఆరంగమునందావిర్భవించి అర్జునుని పుష్పమాలాలంకృతుని జేసి వరించినది. కాని పాండవ సోదరులైదుగురకును ఆమె భార్య కావలసివచ్చినది.

(3) ద్రౌపది పంచపాండవులకు ధర్మపత్ని యగుటకు జ్యోతిశ్శాస్త్రరీత్యా కారణమేమి యనుప్రశ్నకు సదుత్తరము బడయుటకు కన్యరాశి చుట్టుగల నక్షత్రము లేవేవో జాగ్రత్తగా పరిశీలింపవలయును. ఇందు ముఖ్యమైనవి ౧ మఘ ౨ ఉత్తరఫల్గుని 3 స్వాతి ౪-౫ అశ్వతరమండలమునందలి జంటచుక్కలు. మఘకు అధిదేవతలు పితృలు; పితృలకు రాజు యముడు; యమునంశమున జన్మించినవాడు ధర్మరాజు. ఉత్తరఫల్గునికి వేదములో అర్జుని యనియే పేరు. కాబట్టి యానక్షత్రమర్జునుడు. స్వాతి వాయు దైవత్యము. కుంతి సంతానములో వాయుదేవుని యంశమున బుట్టినవాడు భీముడు. ఇక అశ్వతరమండలము అశ్వినీదేవతలతృతీయాస్థానమగుట మనమీవఱకే తెలిసికొంటిమి. ఈజంట దేవతల యంశమున జనించిన కవలవారు నకులసహదేవులు. ఈ పంచపాండవపరివృతమైన కన్య

ద్రౌపది - వారికైదుగురకును ధర్మపత్నియైనది. "పంచ పర్వతముల నడుమ నదియుంబోలె" ద్రౌపది వారల కనురక్తకాగా "పంచేంద్రియములు విషయరతింబరి గ్రహించినట్లు" వారామెను పరిగ్రహించిరి.

(4) ఆకాశమునందు కొంగ ఆకారముగల చుక్కల గుంపు ఉన్నవి. ఈబకము స్వాతి కెదురు. స్వాతి ఉదయమగు నప్పటికి బక మస్తమించును. బకాసురవధ వృత్తాంతమిట్లు నభోరంగమున చిత్రింపబడినది. విశాఖ కార్తె చేరబడినపుడు స్వాతి సూర్యోదయమునకు ముందు ఉదయమగును; బకు డప్పుడే అస్తమించి యదృశ్యుడగును. ఈబకవధ జరిగిన "కతిపయ దినములకు" బ్రాహ్మణుడొకడు పాంచాలదేశము నుండి ఏకచక్రపురమునకు వచ్చి ఆనాటికి డెబ్బదియైదవ దిన మున ద్రౌపదీస్వయంవరమని పాండవులకు తెలియజేసెను. పాండవులు వెంటనే బయలుదేరి పాంచాలమున కరిగిరి. ఫాల్గునశుద్ధ పంచమీ రోహిణినాడు ద్రౌపదీస్వయంవరమును, మత్స్యయంత్రభేదనమునుజరిగినవి. పాండవులు ద్రుపదగృహము చేరి బయల్పడిరి. ద్రౌపది ఒక్క యర్జుననినే వివాహమాడ వలెనా, ఐదుగురును ఆమెను పెండ్లాడవలెనా? యను ధర్మ సందేహము కలిగినది. కృష్ణద్వైపాయనుడువచ్చి పంచేంద్రో పాఖ్యానముచెప్పి ద్రుపదు నొప్పించి నైదుగురకు వివాహము చేయవలెనని నిశ్చయించెను. ఇదంతయును మూడురోజులు

పట్టినది. పుష్యమీ నక్షత్రమున ద్రౌపది వివాహము జరిగినది. తెనుగు భారతములలో స్వయంవరమును వివాహమునుగూడ రోహిణీ నక్షత్రమున జరిగెనని కలదు. గాని అది సరిగాదు. సంస్కృతభారతములో 'పు ష్య ము పై తి చం ద్ర మాః' అనుటయే సరియైనది. ఆప్రకారము తెనుగు భారతము నవరించవలసి యున్నది. ప్రతి సంవత్సరమును మీనమాసమున శుద్ధఅష్టమి మొదలు ద్వాదశివఱకు ద్రౌపదీ వివాహకథనము రాత్రి తొలిజామున నాకాశమున ప్రదర్శితము.

దుశ్శాసను డీమె జుట్టుపట్టుకొని యీడ్చుటయును, వేణీసంహార కథనమును వివరములతో ఖగోళమున చక్కగా చూడనగును. ఆ వివరములు మరొక సందర్భములో సావకాశముగా తెలిసికోగలము.

ద్రౌపది రుద్రపత్ని; మహాశక్తి స్వరూపము. బాల, దుర్గ, భవాని, కాళికాదేవి, త్రిపురసుందరి మొదలగు బహు నామములచే ప్రశంసించి పూజింపబడు దేవత యీకన్యయే. భవానికి తు ల జ యని నామమున్నది. తులజయనగా తులారాశినుండి జనించినది. అడుగున తులారాశియు, ఆపైన కన్యారాశియు నుండుటచేత కన్యరాశి 'తు ల జ' యనియే చెప్పతగి యున్నది. మహారాష్ట్రదేశమున తులజాపురమను గ్రామములో భవానిదేవి వెలసి యున్నది. ఈ దేవియే శివాజీ మహారాజు మ్రోల సాక్షాత్కరించి తనపేర 'భ వా ని' యను

ఖడ్గరత్న మాతని కనుగ్రహించినట్లు చరిత్ర తెలుపుచున్నది. శివఛత్రపతి హస్తము నలంకరించిన భవానీనామక భయంకర ఖడ్గమాతనికి తులజాదేవి యొసంగినదే.

బంగాళాదేశములో దుర్గపూజ యతివైభవముతో జరిపెదరు. దుర్గాదేవికి వాహనము సింహము. సింహరాశిపై కన్యారాశి యుండుటచేత, దుర్గకు వాహనము సింహమే యనుట ఒప్పియున్నది. వాహనమేకాదు ; ధ్వజముకూడ సింహమే యగును. గరుడుడు విష్ణుభగవానునకు వాహనము, ధ్వజముకూడ నైనట్లు, వృషభ మీశ్వరునికి వాహనము, ధ్వజమునై యున్నట్లు, సింహము దుర్గకు వాహనము, ధ్వజమునై యొప్పుచున్నది. ఈ యంశమును శ్రీనాథుడు శివరాత్రి మహాత్మ్యములో చక్కగా వర్ణించినాడు. చూ. III: 98.

"గీ. ప్రతిభ సతతంబు గొల్తురా భద్రకాళి
జగతి నేబదియారు దేశములవారు
దశదిశంబులు సింహకేతనము నిల్పి
పాణభూమికి దైవ మీయుత్పలాక్షి."

సూర్యుడు తులారాశిలో ప్రవేశించునప్పటికి సూర్యోదయాత్పూర్వము కన్యారాశి తూర్పున నుదయించును "ప్రాతర్యావాణా ప్రథమా యజధ్వం" అను వేదవాక్యము ననుసరించి మనవారు ఆదినములలో దుర్గను భక్తితో పూజిం

తురు. సాధారణముగా నాదినములు ఆశ్వీయుజ శుద్ధపాడ్యమి మొదలు దశమివరకును ఉండునుగాన నప్పుడే దేవీనవరాత్రి ఉత్సవములు జరుగును. దుర్గపూజ బంగాళాదేశములో నత్యు త్సాహముతో జరిపెదరు. ఇతర రాష్ట్రములలోకూడ దసరా పండుగలెంతో ముచ్చటగా చేసికొందురు. దక్షిణభారత దేశమున మైసూరు దసరా ఉత్సవము సుప్రసిద్ధము. అమృత మథనకాలమున దేవతలకును, రాక్షసులకును అమృతము పంచెదనని తయారుపడిన జగన్మోహిని; ఈశ్వరుని ముప్పు తిప్పలబెట్టి మూడు చెరువుల నీళ్లు త్రాగించిన మోహినీ స్వరూపము ఈ కన్యారూపమే. ఇట్లనుటకు గలకారణములు నేను రచించిన జ్యోతిర్వేదమునందు చూడనగును.

---

## 46. "హూణభూమికి దైవమీయుత్పలాక్షి"

దుర్గ రూపధారిణి యగు కన్యారాశి భరతఖండస్థుల మగు మనకే గాక, క్రైస్తవమతావలంబకులగు హూణులకు గూడ దైవమని ఏనువందల యేండ్లక్రిందటనే శ్రీనాథ మహా కవి తెలిపియున్నాడు. ఇటీవల పరిశోధనలవలన నీవాక్యము గొప్పసత్యమని ధ్రువపడినది. క్రైస్తవమతస్థాపకుడగు యేసు క్రీస్తు ఈ 'కన్య' కు కుమారుడు. అతడు స్థాపించిన క్రైస్తవ మతమిపుడు ప్రపంచమంతటను వ్యాపించియున్నది. అతనితల్లి

Virgin Mary మేరీకన్యను మనదేశములో పామరులు కన్ని మారెమ్మ అనుచుందురు. ఆమెభర్త యొకవడ్రంగి. క్రీస్తు ఆమెకు ఈవడ్రంగిభర్త వలన జన్మించిన వాడుకాడు. అతడు భగవదంశసంభూతుడు. ఏమహోజ్జ్వల గోళమును మనము సూర్యభగవానుడనుచున్నామో ఆసూర్యగభవానుని తేజోంశ సంభూతుడే ఏసుక్రీస్తని ఎడ్వరుడు కార్పెంటరు Edward Carpenter అను విద్వాంసుడు సిద్ధాంతము చేసినాడు. అందుకు కారణము లీదిగువ వ్రాయుచున్నాము.

(1) ఏసుక్రీస్తు జన్మము ఇప్పటికి రెండువేలపండ్ల క్రిందట డిసెంబరునెల 25 వ తేదీని జరిగినది. డిసెంబరునెల హేమంత ఋతువులోనిది. లోకమంతయు చలిచే 'ఉహూ హూ' యని వణుకుచుండు కాలమది. అందును ఉత్తరధ్రువప్రాంత దేశములకు పోవుకొలది అహఃప్రమాణము తగ్గుచు చలిమిక్కుటమగుచుండును. ఆ దినములలో సూర్యుడు స్వశక్తి గోల్పోయి తేజోహీనుడై చచ్చినట్లేయుండును. అట్లుపడి యుండి డిసెంబరు 25 వ తేదీని పునర్జన్మము బడసినాడన దగియుండును. ఆనాటికు దక్షిణాయనగతుడైన ఆదిత్యుడు ఆనాటి నుండి ఉత్తరాయనగతుడగును. అంతవఱకు తేజోనష్టదూరుడై దక్షిణముగా పోవుచు ఎన్నడో చచ్చినట్లున్న సూర్యుడు యమదిగ్యానము చాలించి, దిశమార్చి ఉత్తరాదిగ్గమన మారంభించి తేజోవృద్ధివృద్ధి బడయుచుండును. హస్తసవిత్ర

దేవతాకము. అప్పటి కన్యారాశి స్థానమును బట్టి సూర్యుడీ కన్య కుమారుడనిరి. ఆనాటి సూర్యోదయమునకు ముందు కన్యారాశి పూర్తిగా తూర్పున నుదయించి కొంత తడవు మెఱసిన పిమ్మట సూర్యుడు ఉదయించుటచేత నీయర్కుడు కన్యారాశి కుమారుడనిరి. చిత్రార్థమువఱకు — చిత్ర రెండుపాదములు గడుచువఱకు - కన్యారాశియేకదా! చిత్ర కధిదేవత త్వష్టయను దేవశిల్పి. మేరీకన్యభర్త వడ్లవాడని బైబిలు నుడువుచున్నది. ఈవడ్లవాడే దేవతల త్వష్ట యని విమర్శకులకు స్ఫురింపకపోదు.

(2) క్రీస్తు జన్మించిన డిసెంబరు 25 వ తేదీనాటికి తొలిదినమున సాయంసంధ్యవేళ తూర్పుననొక పెద్దచుక్కయు, దానికి ముందుగా ముగ్గురు రాజులని చెప్పతగిన మూడు చుక్కలును అగపడెనని బైబిల్ తెలుపుచున్నది. పైనివ్రాసిన పెద్దచుక్క Sirius మృగవ్యాధుడు; చిన్నచుక్కలు మూడును మనరైతులు గొల్లకావిడి చుక్కలని చూపు చుక్కలే.

(3) క్రీస్తు పుట్టిన దినములు క్రిస్మస్ పండుగలు. మరి ఆరువారములకు Candlemas కేండిల్‌మస్ క్రొవ్వొవత్తి దీపములు వెలిగించి పండుగలు చేయుదురు. ఈపండుగలు సూర్యుని తేజోవృద్ధిసూచకములు. మనదేశములోకూడ ఆరోజులలో నెన్నో దీపములు, జ్యోతులు వెలిగింతురు. మ్మ

కొందరు అఖండదీపములు, అఖండజ్యోతులు వెలిగించి కొన్ని రోజులు వరుసగా అవి వెలుగుటకు చమురుపోసి ఆరిపోకుండ శ్రద్ధవహింతురు.

(4) క్రీస్తునుపట్టి సిలువను వేయుట Crucifixion of Christ ఈస్టరు పండుగలు:—కొవ్వువత్తుల దీపముల పండుగ అయిన తరువాత దినదినమును తేజోష్ణములయందు వృద్ధిగనుచు సూర్యుడు విషువద్వృత్తమును చేరుకొనును. ఈవిషువద్వృత్తము, క్రాంతివృత్తమును నాడు మేషరాశిలో (Cross) సంధించుచుండెను. ఈసంధినే క్రైస్తవులు సిలువయందురు. మేషరాశిలో సూర్యుడీ విషువద్వృత్తమును సంధించుట Crucification and Death of Lamb-God అని చెప్పబడుచున్నది.

(5) ఏసుక్రీస్తునకు పండ్రెండుగురు శిష్యులు. ఈద్వాదశ సంఖ్య పండ్రెండు రాసులు కావచ్చును; లేదా పండ్రెండు మాసములైనను గావచ్చును. శ్రీకృష్ణునకు అర్జునునివలె, క్రీస్తునకు జాన్ ముఖ్యశిష్యుడు. ఈ John జాన్ శబ్దము 'అ ర్జు న శ బ్ద వి కృ తి' యని కూడ కార్పెంటరుదొర వ్రాయ సాహసించెను.

(6) పడమట సూర్యుడస్తమించిన పిదప విశాఖపై కన్యరాశి తూర్పుటాకాశమున ఉదయించిన దినమును క్రైస్తవులు ఎసెన్షన్ Ascension దినములుగా భావింతురు.

ఎసెన్షన్ దినము ఈస్టరు తరువాత నలుబది దినములకు మేనెలలో గురువారమున సంభవించును. పిమ్మట సూర్యోదయాత్పూర్వము కన్య తూర్పున ముంగగపడిన దినము కన్యా జన్మదినము. Nativity of the Virgin. ఇవి సెప్టెంబరు నెలలో వచ్చు పండుగలు. ఖగోళమున కన్యారాశి యొక్కయు సూర్యగోళము యొక్కయు స్థితిగతులనుబట్టి ఈ పండుగ లాయా తారీకులను నిర్ణయింపబడినవే గాని యన్యముగాదని కార్పెంటరుదొరగారు Pagan and Christian Religions; their origin and meaning అను గ్రంథములో సిద్ధాంతము చేసియున్నారు. ఆగ్రంథరాజములో, ఆవిమర్శకుడు క్రైస్తవమతప్రచారకులు తత్పూర్వపు మిత్రదేవ పూజాక్రమమును (Mithraic Worship) ప్రాచీన క్రైస్తవేతర మతగ్రంథములనుండి సంగ్రహించి క్రొత్త క్రైస్తవ మతాంశములుగా పరిణమింపజేసికొనిరని సోపపత్తికముగా ఋజువు చేసియున్నాడు.

ఖగోళమున రోహిణీచంద్ర సమాగమువలెనే చిత్ర చంద్రసమాగమము మిక్కిలి మనోజ్ఞమై దర్శనీయమై యొప్పుచుండును. దిలీపమహారాజు 'చిత్రాచంద్రమసోరివ' చిత్రతో కూడిన "చంద్రునివలె" భార్యాసహితుడై యొప్పుచుండెనని కాళిదాసు రఘువంశములో రమ్యముగా వర్ణించినాడు.

---

# 47. స్వాతి

కృష్ణయజుర్వేదమునందు ఈనక్షత్రము 'స్వాతి' యనియే పేర్కొనఁబడినది. "ప్రవాళమేకమ్" పగడమువలె ఎఱ్ఱని నక్షత్రమొక్కటే స్వాతియని వరరుచియు, "కుంకుమారుణతరపకతారకాః" అని కాళిదాసును ఈనక్షత్రరాజమును వర్ణించిరి. త్రివిక్రమపండితాచార్యులవారు వాయుస్తుతిలో "రుచిరరుచిమణిజ్యోతిషాం సన్నిషణ్ణః" అని స్వాతిని చక్కగా ప్రశంసించిరి. వింధ్యపర్వతపుటార్భటసందర్భములో "స్వాతి చిత్రలు తోరణస్తంభయుగము ననుకరించుచునొక్కచోనత్త మిల్లె" నని కాశీఖండములో శ్రీనాథకవిసార్వభౌముడు వర్ణించెను. సప్తఋషులున్న పెద్ద యెలుగుబంటితోక ననుసరించి పోయినచో నంతకు రెండింతలకు తక్కువదూరములోనే స్వాతి పగడమువలె ఎఱ్ఱగ తేజరిల్లుచు మనదృష్టికి తగులగలదు. తెప్పపాటులో మూడువందల డెబ్బదియైదుమైళ్లు చొప్పున నఖండత్వరతో స్వాతి ఖగోళమున నుత్తరముఖముగా పరుగులెత్తుచున్నది. పూర్వకాలపు పరిశోధకులు గమనించి గ్రంథస్థము చేసిన స్థానముదాటిపోయి స్వాతి నక్షత్రము ఇటీవల చంద్రమండల వ్యాసమంత మేర ఉత్తరమునకు జరిగిపోయినట్లు పరిశీలనలవలన స్పష్టమగుచున్నది. ఉమ్మివైచినట్లిది యూరక వెడలిపోవుచుండుటచేత కాబోలు దీనికి 'నిష్ట్యా' యని పేరు వచ్చినది. సూర్యునికంటె నీరిక్క నూరురెట్లు తేజోధికమైనది;

నలువదియొక్క వెలుగుసంవత్సరముల దూరమందున్నది. పరిమాణ విషయమునకూడ నీచుక్క సూర్యునికంటె బహురెట్లు గొప్పది. దీనినుండి వెలువడు వేడి బహుదారుణమైనది. ఆవేడి యొకింత తగిలినచో మన భూమిమీది ధర్మామీటర్లు Thermometers చలించి ఉష్ణోగ్రతను సూచించుచున్నవి.

## 48. స్వాతి వాయుదైవత్యము

స్వాతి నక్షత్రమున కధిదేవత వాయుదేవుడు. వాయువునకు మహాబలుడని నామమున్నది. మన దేశములో భయంకరములైన గాలివానలు, తుపానులు, ఉప్పెనలు, లోనగు మహోపద్రవములు సాధారణముగా స్వాతికార్తె దినములలో సంభవించుచుండును. ఈకార్తె ప్రతి సంవత్సరము నించుమించుగా నక్టోబరు ఇరువదవ తేదీనుండి నవంబరు ఐదవ తేదీ లోపుగ వ్యాపించియుండును. చరిత్రాత్మకమై బహుఘోరమైన బందరు ఉప్పెన 1864 సంవత్సరము నవంబరునెల మొదటి తేదీని సంభవించినది. ఒకముహూర్తములో ముప్పదివేల జనము దుర్మరణము నొందిరి. అక్టోబరు నవంబరు నెలల లోనే మహాబలుని బీభత్సరూపము ప్రదర్శింపబడుచుండుట

మన అనుభవములోని విషయమే. స్వాతి శుక్రగ్రహసమాగము కూడ వర్షపాతమునకు కారణము. గత 1949 సెప్టెంబరులో జలప్రళయము మరువజాలము.

---

## 49. స్వాతి వానరరూపము గల నక్షత్రముల మధ్య నున్నది

స్వాతి నక్షత్రము చుట్టును వానరరూపముగల చుక్కలున్నవి. ఈయంశ మీమధ్య చాల్డియా, బాబిలోనియా, ఈజిప్టు మొదలగు దేశములలో లభించిన సాక్ష్యమువలన రూఢియైనది. అంతదూరము పోనక్కరలేదు. ఈయంశము ఋజువుచేయుటకు మనము వాల్మీకి రామాయణము సరిగా చదివి సూటిగా అర్థము చేసికొనిన చాలును. కిష్కింధా కాండాంతమున సీతను వెదకుటకై లంకకు పోవ నుత్సహించు హనుమంతునిచే వాల్మీకి ఇట్లు సాభిప్రాయముగా పలికించినాడు.

చూ. కిష్కింధకాండ. 67 సర్గలోని 20, 21 శ్లోకములు:

అను యాస్యన్తిమా మద్య ప్లవమానం విహాయసా
భవిష్యతిహి మే పంథాస్స్వాతేః పంథా ఇవామ్బరే. 20

చరన్తం ఘోరమాకాశము త్పతిష్యన్త మేవవా
ద్రక్షన్తి నిపతిష్యన్తం సర్వభూతాని వానరాః. 21

స్వాతికి తూర్పుగా విష్ణుమండల మున్నది. కావుననే 'అగ్రే ప్రాంజలి రాంజనేయమనిశం' అని విష్ణుస్తుతిలో కలదు.

---

# 50. అర్జునుడు కపిధ్వజుడు

అర్జునుడు హనుమద్ధ్వజుడగుట కూడ ఖగోళమున చక్కగా నిరూపింపబడుచున్నది. ఉత్తరఫల్గునీనక్షత్రస్వరూపు డగు అర్జునునికి హస్త, చిత్రానక్షత్రములు దక్షిణముగా ప్రక్కకు ఉండిపోవునుగాని, స్వాతి మాత్రము సరిగా మీద నున్నట్లు కనబడుచుండును. కావున నర్జునుడు కపిధ్వజుడు, హనుమద్ధ్వజుడునని వర్ణింపబడుచున్నాడు.

---

# 51. లంకాదహనము

హనుమంతునిగూర్చి చక్కని లోకోక్తి కలదు. ఏమని యనగా—"చూచి రమ్మనిన నాంజనేయుడు కాల్చి వచ్చినా డం' దురు. సీతను చూచిరమ్మని శ్రీరాముడు హనుమంతునికి తన ఉంగర మానవాలిచ్చి పంపెను. సముద్రము లంఘించి పోయి అశోకవనమధ్యమున సీతను చూచి మాటలాడి, అంతటితో తృప్తినొందక హనుమంతుడు తన తోకకు రాక్షసు

లంటించిన చిచ్చులోనే లంకాపట్టణము దగ్ధముచేసి వచ్చి నాడు. స్వాతీనక్షత్రము హనుమంతుడని తెలిసికొంటిమి. హనుమంతుడు లంకకు చిచ్చుబెట్టినప్పు డాతని తోక చివర భాగము గుండ్రముగా చుట్టుకొనియుండి తీవ్రమైన తేజస్సుతో ప్రకాశించెనని ఈక్రింది శ్లోకములో వాల్మీకి సొగసుగా వర్ణించియున్నాడు:—"లాంగూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రో (ఆ) నిలాత్మజః । వ్యరోచిత మహాప్రాజ్ఞః పరివేషీవభాస్కరః" హనుమంతుని వాలము సూర్యపరివేషమువలె చక్రాకారము కలదై ప్రకాశించెనని యీశ్లోక భావము.

విశాఖానక్షత్రము ఇంద్రాగ్ని దైవత్యమై, చక్రాకారము కలిగి గుండ్రనైయుండుటచేత విశాఖరూపమైన వాలాగ్నితో హనుమానుడు లంకాదహనముగావించుట నభోరంగమున చిత్రింపబడియున్నదని మనము గమనింపవలసిన విశేషము.

---

# 52. సవరణకావలసిన యొక తప్పు

వరాహమిహిరాచార్యులవారు బృహజ్జాతకములో కన్యారాశిని ప్రశంసించుచు "ససస్య, దహనా, ప్లవగాచకన్యా" అని వర్ణించియున్నారు. కన్యచేతిలో పుష్పమాల ఉన్నట్లు ఖగోళచిత్రములు కొన్నిగలవు. కొన్నలు, గింజలుగల వరి సస్యపుకట్ట యొకటి కన్యచేతిలో నున్నట్లు ఆ రాశిని గూర్చిన

వర్ణన లనేకము గానవచ్చుచున్నవి. దహనమనగా అగ్ని; కన్యారాశి అగ్నితో కూడుకొని యున్నది. ఇంద్రాగ్ని దైవత్య మైన విశాఖయనెడి అగ్నికుండమునపై కన్య కలదనియు, ఆమె 'అగ్నికుండసముద్భవ' యని చెప్పబడినదనియు మనమీావఱకె తెలిసికొంటిమి. ఇక ప్లవగముకూడ కన్యప్రక్కనే కలదు. ప్లవగమనగా కోతి; కన్య ప్రక్కనే కోతిరూపము కలదని బాబిలోనియా, ఖాల్డియా, ఈజిప్టు, చీనా మొదలగు ననేక దేశముల ఖగోళగ్రంథములును, చిత్రములును, గట్టిగా సాక్ష్య మిచ్చుచున్నవి. ప్లవగమనగా నౌక, పడవయను నర్థము సంస్కృత నిఘంటువులలో లేకపోలేదు; కాని ఖగోళ మందు కాని, బహుదేశవ్యాప్తములైన జ్యోతిశ్శాస్త్రగ్రంథ, చిత్ర, రూపపట వర్ణనాదులలోగాని, కన్యారాశి ప్రక్క పడవ యున్నట్లు ఎక్కడను నిదర్శనమేమియు కానరాలేదు. కన్యతో ప్లవగమున్నదనగా ఒక నౌక అనగా పడవ ఉన్నదని బృహజ్జాతకమునుగూర్చి ఇంగ్లీషు గ్రంథము వ్రాసిన మేజర్ B. D. Basu గారు అర్థము చెప్పినారు. అది తప్పు. ప్లవగ మనగా నిచ్చట మర్కట మనియే యన్వయించుకొనుట సమంజసము. కావున బాసుగారు ఇక్కడ ప్లవగ శబ్దమునకు చెప్పిన నౌకార్థము పరిహరించి ప్లవగ మనగా మర్కటమని యన్వయించుకొనుడని జ్యోతిర్వేదవిదులైన పండిత ప్రకాండులను, విమర్శకులను వేడుకొనుచున్నాను.

---

# 53. స్వాతికి భూతేశరుద్రునితో సంబంధము*

స్వాతిని పాశ్చాత్యులు "ఆర్క్టుర్యూరస్" Arcturus అందురు. వారి Bootes బూటీస్ అనెడి చుక్కలగుంపులో నీచుక్క ముఖ్యమైనది. పాశ్చాత్యుల వాడుకలోనున్న యీ Bootes బూటీస్ పదము సంస్కృత భూతేశ శబ్దమునకు వికృతి. భూతేశుడనగా శివుడు. ఏకాదశ రుద్రరూపములలో భూతేశు డొకడు. మరుత్తులీరుద్రసూనులు. సంసత్కృభారత మున విరాటపర్వస్థమగు గోగ్రహణ పర్వములో కపి ప్రవర కేతనుడైన అర్జునుని ధ్వజము "భూతాస్యవేశయుత్" అని వర్ణింపబడినది. తిక్కన సోమయాజికూడ ఆంధ్రభారతము. (విరాట. IV. 170) లో "వానరాకారంబగు మహోగ్ర కేత నంబును, దదాశ్రితంబులైన వికృతాభీల నానాభూతంబులం బుత్తెంచె" నని తెనిగించెను. కాబట్టి హనుమంతునికి భూతేశ రుద్రునితో సంబంధము కలిగియుండుటకు ఖగోళమునకూడ హేతు వగపడుచున్నది.

---

* శ్లో॥ నమస్తుభ్యం విరూపాక్ష నమస్తే దివ్యచక్షుసే
నమః పినాకహస్తాయ వజ్రహస్తాయ వై నమః
నమః త్రిశూలహస్తాయ దండపాశాసిపాణయే
నమస్తే లోకనాథాయ భూతానాం పతయేనమః ॥

స్వాతిని గూర్చి మంత్రపాఠములలో నీక్రింది మంత్రము కలదు. "వాయుర్నక్షత్రమభ్యేతినిష్ట్యామ్ తిగ్మశృంగోవృషభో రోరువాణం సమీరయన్భువ నామాతరిశ్వా అప ద్వేషాగీంసినుద తామరాతీః" ఇందు ల్లేఖింపబడినవృషభమును గూర్చి విశాఖ నక్షత్రచర్చలో తెలిసికొందము.

---

# 54. స్వాతినక్షత్ర తేజశ్శక్తిచేత గొప్ప చిత్రవస్తు ప్రదర్శనము తెఱువబడుట

1892 సంవత్సరములో శ్రీవివేకనందస్వామి అమెరికా యునైటెడ్‌స్టేట్స్‌లోనున్న షికాగోనగరములో జరిగిన సర్వ మత మహాసభకు వెళ్లి వేదఋషుల మహిమ నుపన్యసించెను. పిమ్మట నలుబదియొక్క సంవత్సరములు గడచినతరువాత 1933 సంవత్సరములో, గొప్ప Exhibition చిత్రవస్తుప్రద ర్శన మానగరములోనే జరిగినది. చరిత్రాత్మకమైన యీ మహోత్సవము తెఱుచుటకు రమ్మని యీపౌరులే మానవ మాత్రుని పిలవలేదు. స్వాతీ నక్షత్రమునుండి వెడలు కిరణ జాలముయొక్క తేజశ్శక్తిచేతనే వారు ఆప్రదర్శన ప్రారంభో త్సవముజరిపించిరి. ఎట్లనగా :– ప్రదర్శనరంగమున కంతకును

దేదీప్యమానమగు వెలుగు ప్రసరించుటకు విద్యుద్దీపములమర్చిరి. ఆదీపములను వెలిగించు తీగెలన్నిటిని ఒక కేంద్రమునకు తెచ్చిరి. ఆతీగెలకు విద్యుత్ సంపర్కముకల్గించుటకు అవసరమైన తంత్రులను ఒక 'కీ' సాధనపు బొత్తాముతో చేర్చిరి. బొత్తాము నొక్కినంతనే విద్యుత్సంపర్కము కలిగి వేలకొలది దీపములు గప్పున నొక్కసారి రంగమంతటను వెలిగి, చిత్రవస్తువులను ప్రదర్శించును. ఆబొత్తాము మానవహస్తముచేత నొక్కించక అద్భుతములగు శాస్త్రయుక్తులచేత స్వాతి తేజస్సుచే ఈపని చేయించిరి. వైజ్ఞానికులు స్వాతినుండి వచ్చు కిరణములను చమత్కారముగా పట్టించి, వానిని యంత్రపు యుక్తులచే క్రియానిర్వాహణ శక్తిక్రింద మార్చివైచిరి. ఆశక్తిచేతనే విద్యుత్తంత్రుల కేంద్రమైన 'కీ' సాధనపు బొత్తామును, నొక్కించిరి. క్షణాంశములో ప్రదర్శనరంగము నందంతటను లక్షలకొలది విద్యుద్దీపములు గప్పున వెలిగినవి. విస్మితులైన చూపరులకు చిత్రవస్తువులన్నియు నొక్కసారి ప్రదర్శింపబడినవి. స్వాతి తేజస్సు సాధనముగా నీవిచిత్రకార్యము నిర్వహింపబడినది. మనదేశములోనే ఇట్టి యద్భుతకార్యము జరిగియుండినపక్షమున మనపురాణకర్తలు స్వాతి కధిదేవతయైన వాయుదేవుని యంశమున జనించిన హనుమంతుడో, భీముడో, ఈచిత్రప్రదర్శనము తెఱచి ప్రారంభించెనని వర్ణించియుందురు.

---

# 55. విశాఖ

"నక్షత్రాణామధిపత్నీ 'విశాఖే'" అని మంత్రపాఠములు విశాఖనక్షత్రమును ప్రశంసించుచున్నవి. ఇంతవఱకు కొలది మినహాయింపులతో మనము ఖగోళపు ఉత్తరార్ధగోళమునగల నక్షత్రములనుగూర్చి చర్చించి తెలిసికొంటిమి. ఇటుపైని విశాఖ మొదలు భరణివఱకు స్వల్పమినహాయింపులతో దక్షిణార్ధగోళమున కానవచ్చు క్రాంతిరేఖాసమీప నక్షత్రములనుగూర్చి ప్రసంగించవలసియుండును. క్రాంతివృత్తము విశాఖ మొదలుకొని దక్షిణదిశకు తిరుగుచున్నది. ఇటునుండి క్రాంతిరేఖ మరొక దిక్కునకు మరలి వేరొక శాఖామార్గమున పోవుచున్నది. జ్యోతిశ్చక్రము భిన్నశాఖానుసరణకారణమగుట నిది విశాఖయైనది. విశాఖకు మరలుటలో సిది తొలిచుక్కల గుంపు అగుటచేత నీనక్షత్రసమూహమునకు వి-శాఖ యని పేరువచ్చినదని Bentley బెంట్లీదొరగారు ఊహించినారు. వేదవాఙ్మయము నందంతటను నీచుక్కలు విశాఖలనియే తెలుపబడినవి. ఒక్క అథర్వవేదములో మాత్రము "రాధే విశాఖే" అనియున్నది. విశాఖానక్షత్రము రాధ; తరువాత నక్షత్రము అనూరాధ.

కుమ్మరిసారె రూపమున గుండ్రముగా సమకొని యున్న చుక్కలైదు విశాఖలో కలవు. కాబట్టి 'విశాఖా కులాలచక్రంపంచ' అని వరరుచి విశాఖను నిరూపించెను. చిత్ర

రెండు పాదములును, స్వాతి పూర్తిగాను, విశాఖ మూడు పాదములును చేరి తులారాశి యేర్పడినది. ఖగోళ తులారాశిలో దక్షిణపుదిశనున్న తక్కెడసిబ్బి రూపమే విశాఖ వింధ్యపర్వతము పెచ్చుపెరిగి విశ్వవ్యవహారము స్తంభింపజేసి నపుడు విశాఖ "చిఱుతవోయినమూకుటిచెలువుదాల్చి। నాత్తె నోకచోవిశాఖవింధ్యాద్రియుందు" అని కాశీఖండములో శ్రీనాథుడు వర్ణించుట యీవఱకే తెలిసికొంటిమి. ఇంగ్లీషువారు తులారాశిని లైబ్రా 'Libra' అందురు. ఆ రాశిలోని ఆల్ఫా బీటా, గామా, జీటా, ఎప్సిలాన్ గుర్తులుగల చుక్కలు విశాఖయని పడమటి జ్యోతిష్కులు నిర్ణయించినారు.

ప్రాచీనులగు గ్రీకులకు 'తుల' యను రాశి తెలియనే తెలియదు. వారికి తెలిసినరాసులు పదునొకండు మాత్రమే. వారి లెక్కలో కన్య తరువాతరాశి వృశ్చికమే. వారి వృశ్చికముయొక్క ముందు డెక్కలే రోమనుల 'తుల' యైనది. రోమనుల నాటినుండి యూరపుఖండమున Libra పేరుతో తులారాశి వాడుకలోనికి వచ్చినది.

---

## 56. సర్వసమత్వమే తులారాశి లక్షణము

మనమిపుడు తులారాశినిగూర్చి చర్చించు చున్నాము. త్రాసులో ఏదైన తూచినపుడు రెండుచిప్పలును సరిగా తూగ

వలెను. ఒక కుడుక ఎగువకును, రెండవ కుడుక దిగువకును ఉండుట పక్షపాతమును సూచించును. పక్షపాతము లేకుండ ఇరుగడలను సరిపుచ్చుటకే త్రాసుకావలెను. సూర్యుడు తులలో ప్రవేశించుటచేత సమస్తమును సరియగుచున్నట్లు తోచును. ఆవఱకు దీర్ఘతరముగానుండిన అహఃప్రమాణము తగ్గి దివారాత్రములు సమాన పరిమాణము గలవగును. శీతోష్ణస్థితి సరిసమముగను, జలసమృద్ధి, సస్యసమృద్ధి చేసి విశాఖతో మేఘములు పోవును. ఖగోళక్రాంతి చక్రములో సూర్యుడావఱకు గావించుచున్నట్లుగపడినగ ఉత్తరార్ధగోళ సంచారము చాలించి దక్షిణార్ధగోళసంచారము ప్రారంభించును. విశాఖకడ క్రాంతిచక్రమే, రెండు సమభాగములుగా చీలుచున్నది. ఇట్లు చూడగా నన్నివిషయములలో భూగోళ ఖగోళములు సమత్వము చెందినట్లు కనబడును.

---

## 57. ఔశీనరుడు శిబిచక్రవర్తి

ఉశీనరాణిప్రశంస ఋగ్వేదమందు గలదు. ఆయుంశే మునుగూర్చి యీాదిగువ చర్చించి తెలిసికోగలము. ఆమె కుమారుడు ఔశీనరుడు. అతడే శిబిచక్రవర్తి. ఆమహా మహుడు నిరుపమానధర్మనిరతుడు.

"సీ॥ గంగాప్రవహాంబు కరణి పావనమూర్తి
భుజగాధిపుని భంగి భోగశాలి".

ఆతని సర్వసమత్వమును, ధర్మబుద్ధియును విశ్వప్రసిద్ధములు. ఒకపావురము తఱుముకొనుచు నొకడేగవచ్చెను. పావురము శిబిచక్రవర్తిని శరణమువేడెను. శిబి శరణమిచ్చెను. తననోటిముందరి యాహారము పడగొట్టక పావురమును తనకిచ్చివేయుమనియు, అదితనకు వేదవిహితమైన యాహారమనియు తెలిపి, 'శ్యేనాః కపోతాన్ ఖాదయంతి' యని శ్రుతి ప్రమాణముకూడ డేగచదివి వాదించెను. "నీయత్నమహారార్థమేయైనచో నీకుకావలసినంత మాంసమితరత్ర సమకూర్చియిప్పింతును, పావురమునుమాత్రము విడువు" మని శిబి ప్రత్యుత్తరమిచ్చెను. చాలసేపు వాదప్రతివాదములు తీవ్రముగా జరిగినవి. పావురముతో సరితూగునంత మాంసము తనశరీరమునుండి శిబిచక్రవర్తి కోసియిచ్చుటకును, ఆమాంసము తీసికొని డేగ యీపావురమును విడుచుకొనుటకును ఏర్పాటు జరిగినది. అందుకు ఉభయులును సమ్మతించిరి. త్రాసు తెచ్చి ఒకచిప్పలో పావురమును పెట్టిరి; శిబి శరీరమునందలి మాంసము కోసి రెండవచిప్పలో వేయుచుండిరి; ఎంతమాంసము కోసి పెట్టినను పావురముతో సరితూగకుండెను.

తుదకు "రాజాస్వయమేవ తులామారురోహ" శిబి చక్రవర్తి స్వయముగా త్రాసు ఎక్కి తూగెను. ఇక్కడి చిత్ర

మీయంశమును విశదము చేయుచున్నది. ఆచక్రవర్తి యొక్క ధర్మనిరతికి విస్మితులై, డేగరూపము విడిచి యింద్రుడును, కపోత రూపము విడిచి అగ్నియును నిజస్వరూపములతో నా న్యాయమూర్తికి ప్రత్యక్షమై యిట్లనిరి: సంస్కృత భారతము అరణ్య 130-30 మొదలు 34 అంతము:కు

"ఇంద్రోహమస్మిధర్మజ్ఞ కపోతోహవ్యవాడయమ్
ఏషా తే భాసతేకీర్తిర్లోకా నభిభవిష్యతి
యావల్లోకే మనుష్యాస్త్వాం కథయిష్యన్తిపార్థివాః
తావత్కీర్తిశ్చలోకాశ్చస్థా స్యంతితవశాశ్వతాః
ఉశీనరోపిధర్మాత్మా ధర్మేణావృత్యరోదసే
విభ్రాజమానోవపుషా ప్రారురోహ త్రివిష్టపమ్"

(చూ. 26 వ పటము)

భూమిపై జన్మించిన మహాతపస్వులును, పుణ్యమూర్తులును నక్షత్రరూపమున నూర్ధ్వలోకమున మెఱయుచుందురని భారతీయుల విశ్వాసము. సప్తఋషులు, అగస్త్యుడు, ధ్రువుడు మొదలగు పుణ్యమూర్తులవలెనే శిబిచక్రవర్తి తులారాశిలో నక్షత్రరూపమున వెలుగుచున్నాడు. ఈపుణ్యకథా సందర్భమున మనము ముఖ్యముగా గమనింపవలసిన యంశములు మూడుగలవు:—(1) విశాఖనక్షత్రము ఇంద్రాగ్ని దైవత్యమని శ్రుతి ప్రమాణము. తులారాశి విశాఖలో మూడు పాద

ములవఱకు వ్యాపించియున్నది. కాబట్టియే ఇద్రాక్షుల కుభయులకును తులారాశితో సంబంధ మేర్పడియున్నది. ఇంద్రుడు డేగయై, అగ్నికపోతమై శిబిని చేరవచ్చిరి. (2, శిబి చక్రవర్తియొక్క ధర్మనిరతియు సమబుద్ధియు మనలోకమున శాశ్వతముగా నిలిచియున్నవి; ఖగోళమునందే కాక మనవాడుక భాషలోకూడ చిరస్థాయిమైనవి. తులాదండముయొక్క రెండు కొసలనుండి రెండు పళ్లెములవంటి చిప్పలు (Scale Pans) వ్రేలాడుచుండును కదా! ఇందొకదానిలో తూనికగుండ్లనుంచి రెండవదానిలో బరువు నిర్ణయించవలసిన పదార్థమును నిలుపు దురు. ఈ చిప్పలను కొక్కడ సిబ్బ లనుచుందురు. 'సిబ్బి' శబ్దము "శిబి" నుండి జనించినది. ఆనాడు పావురముతో నా చక్రవర్తి దేనిలో తూగెనో ఆ తులాభాగమునకు ఆ మహా త్మునిపేర 'సిబ్బి' శబ్దము తెనుగుభాషలో రూఢమైనది. మన మెప్పు డేవస్తువును తులలో తూచినను త్రాసుయొక్క 'సిబ్బి' లోపెట్టి తూనిక చేయుదము. కొంచెము యోజించి చూచిన పక్షమున "సిబ్బి" పుణ్యశ్లోకుడగు శిబిచక్రవర్తియొక్క పవిత్ర నామమును స్ఫురణకు తేగలదు. ఇట్టి ప్రాచీనగాథల మూలముగా భాషలో చక్కని పదములేర్పడి ప్రశస్తార్థస్ఫోర కములు కాగల వనుటకును, అవి శాశ్వతముగా భాషలో నిలు చుననుటకును ఉదాహరణము లనేకముగా చూపవచ్చును. ఇచ్చట ఖగోళ సంబంధముగల మరొక్క యుదాహరణము నిచ్చుట యావశ్యకము.

మన ప్రాచీన గాథలలో సూర్యభగవానుని భార్య సంజ్ఞాదేవి. భర్తగారు సూర్యభగవానుని తేజస్సు అత్యధికమై యుండి భరింపశక్యము కాకపోగా ఆదేవి ఎచ్చటికో పోయి దాగెను. సంజ్ఞాదేవి తనకు దూరమగుటకు గల కారణమును సూర్యుడు తరువాత తెలిసికొనెను. ఆమె వియోగము సహింపజాల, సూర్యుడామె తండ్రియు, దేవశిల్పియు నైన విశ్వకర్మను సందర్శించి తన తేజస్సు కొంత చెక్కివైచి తగ్గింపుమని కోరెను. అందుకు అంగీకరించి విశ్వకర్మ భ్రమయనుయంత్రము నకు సూర్యుని ఎక్కించి తేజస్సుకొంత చెక్కివైచెను. సూర్యునికి 'త ర ణి' యను నామము కలదు. తేజము తగ్గించుటకు దేవశిల్పి సూర్యుని యంత్రము మీద కెక్కించి 'త ర ణి' పట్టెను. ఈనాటి దారుశిల్పములో 'త ర ణి ప ట్టు ట' ఒక పని. మన వడ్రంగులు తయారుచేయు మంచముల కోళ్ళను 'త ర ణి' పట్టుదురు. విశ్వకర్మ చేతిలో నాడు సూర్యుడు పడిన పాట్లే, మన వడ్రంగుల చేతి యంత్రములో మంచపు కోడుకూడ పడుచున్నది. నాటికిని నేటికిని 'తరణిపట్టుట' యనగా "పరిమాణము తగ్గించి స్నిగ్ధము చేసి, దర్శనీయమైన రూపము నొందించుట" యను నర్థము తెనుగు భాషలో రూఢమైనది.

ఇదేవిధముగా పుణ్యశ్లోకుడగు శిబి నాడు తూగిన త్రాసు చిప్పకు నేటికిని 'సిబ్బి' యను నామము రూఢమైనది.

(3) ఇంద్రాగ్ని దేవతాసహితముగా, శిబిచక్రవర్తికథ నభోరంగమున విశాఖాత్మకమైన తులారాశిలో శాశ్వతముగా చిత్రింప బడినది. మహాతపశ్శాలు లైన సప్తఋషులు, అగస్త్యుడు, ధ్రువుడు లోనగు పుణ్యాత్ములవలెనే శిబిచక్రవర్తి కూడ తనను పట్టుకొని అగ్నిపరీక్షకావించిన ఇంద్రాగ్నులతోను, ధర్మనిరతి యెల్లయెడల తేటపడ తానెక్కి తూగిన తులతోను నక్షత్రమండలమున శాశ్వతముగా విశాఖతారలలో మెఱయుచున్నాడు. "సిబ్బి" శబ్దముద్వారా మనభాషలో ఈకథ నిత్యము స్మరింపబడుచున్నది.

---

# 58. ఉశీనరాణి ప్రశంస

శిబిచక్రవర్తి తల్లి ఉశీనరాణి. ఈమె ఋగ్వేదము X 59-10 మంత్రములో ఉటంకింపబడియున్నది. ఈమె బండికి పూన్చిన యెద్దును ఆవలకు తోలివేయుమని ఆతురముతో యింద్రుని వేడుకొనినది. ద్యావాపృథివీ మండలములో నెక్కడను అన్యాయము, అక్రమము, పక్షపాతము, జరుగ కూడదనియు, తలవంచుకొని సిగ్గుపడవలసిన యకార్యాచరణ మెవ్వరివలనను జరుగకుండవలయుననియు, లోకుల నెవ్వరిని పాపము దుఃఖము బాధింపకుండ నుండగాయుననియు, నామె

ప్రార్థించినది "సమింద్రదేరయ గామనడ్వాహంయుఆవదుశీనరాణ్యా ఆనః భరతామపయద్రపోద్యాః పృధివీక్షుమోరపోమోషు తేకిం చనామమత్." ఇట్టి ధర్మబుద్ధిగల మహారాణి కడుపు చల్లగా పుట్టిన పుత్రరత్నము శిబిచక్రవర్తి. ఆతడు లోకోత్తర చరిత్రుడై నిరూపమాన ధర్మనిరతుడగుటలో నాశ్చర్యములేదు.

ఇక ఉశీనరాణి బండికి కట్టిన యెద్దును తోలివేయుటను గూర్చి ఇంద్రుని వేడికొను విషయము యోజింపవలసియున్నది స్వాతినక్షత్రప్రశంసలో మంత్రపాఠములందు "తిగ్మశృంగో వృషభోరోరువాణః" అని యున్నట్లు చదివితిమి. స్వాతి సమీపమున నుత్తరముగా వాడి కొమ్ములుగల నక్షత్రరూపమైన వృషభ మొకటి యుండినది. పడమటి దేశములవారుగూడ ఆప్రాంతమున నట్టి వృషభమును గమనించినట్లు సాక్ష్యమున్నది. దాని నీదిగువ విచారింతము. వాడి కొమ్ములతో అంకెలువేయు దుందుడుకు టెద్దమూలమున శాంతిధర్మములకు భంగము వాటిల్లుట నిశ్చయముగాన, నట్టివానింబో ద్రోలి, అధర్మము నణచివైచి లోకమున పక్షపాతము, అన్యాయము, జరుగకుండ సర్వసమత్వము కొఱకు ఆమహారాణి ఇంద్రుని ప్రార్థించుట సమంజసము. శిబిజన్మమున కిదియొక విధముగా చక్కని సన్నాహము.

ఈప్రాంతమునందుగల వృషభరూపమును పడమటి జ్యోతిష్కులు గుర్తించియుండిరి. ఈయంశము నిరూపించుటకు

వారు Bootes నామముతో వ్యవహరించు చుక్కలగుంపున కాపేరు ఏలపెట్టిరో తెలిసికొనవలెను. ఇందుకు వుడ్వర్డు (Woodward) అను పాశ్చాత్య జ్యోతిర్విదుడు రచించిన ("How to enjoy the Starry Heavens", "నక్షత్రవిరాజమానమైన ఖగోళము నెట్లు చూచి ఆనందించవలెను" అను పుస్తకముయొక్క 98 వ పుటలో నేమియున్నదో చూతము."The NanreBootes has been much discussed by the learned. Some derive it from the Greek words for an 'ox' and 'to drive'" బూటీస్ శబ్ద వ్యుత్పత్తిని గూర్చి విద్వాంసులు విశేషముగా చర్చించినారు. ఎద్దును తోలుట యను నర్థమిచ్చు గ్రీకు పదములనుండి యాశబ్దము జనించినట్లు కొందరు తెలుపుచున్నారు. ఋగ్వేదము పదవ మండలము నందలి 85 సూక్తము వృషాకపిసూక్తము.

ప్రాచీనములైన వేదమంత్రార్థములకును తరువాతి గ్రీకుగాథలకు నెంతటి సన్నిహిత సంబంధము కలదో పై వివరణ వలన మనకు విశదమగుచున్నది. గ్రీకులకంటె ప్రాచీనులైన అకేడియనులు, అస్సీరియనులు నను జాతులవారు విశాఖను పవిత్రమైన అగ్నివేదికగా భావించి పూజించుకొనుచుండినట్లు ఆదేశచరిత్రల వలనను, జ్యోతిశ్శాస్త్ర సంబంధములుగల బొమ్మల చిత్రముల వలనను స్పష్టమగుచున్నది. వారి పంచాంగములో ఏడవమాసమునకు 'తుల్కు' మాసమని పేరున్నది. సంస్కృత

'తులా' మాసము ఆదేశములలో 'తులు్క' మాసమని వ్యవహరింపబడుట గమనింపతగిన విశేషము.

---

# 59. శ్రీకన్యకాపరమేశ్వరి

ద్రౌపది అగ్నికుండ సముద్భవ, అయోనిజ యని పైని చదివితిమి. వైశ్యకులమునకు పరదేవతయు, శ్రీ కనకదుర్గాంశ సంభూతురాలును నగు కన్యకాపరమేశ్వరిని గూర్చి సంగ్రహముగా ప్రశంసించుట యవసరము. వెనుకటి రోజులలో గంటమును, ఇటీవల కలమును కవులకు చిహ్నములు; క్షత్రియులకు చిహ్నము ఖడ్గము; అట్లే వైశ్యులకు తుల చిహ్నము. వైశ్యులు సాధారణముగా వ్యాపారజీవులు. వ్యాపారజీవనమునకు నిత్యమును తుల ముఖ్యముగా అవసరము. ఖగోళమున నీ తులారాశిని హస్తగతము చేసికొనిన కన్యారాశి వైశ్యులకు పరమ పూజ్యురాలు; ఆమె వారి పరదేవతయగుట సహజము. ఉత్తరఫల్గుని మూడుపాదములును, హస్తయు, చిత్ర రెండు పాదములును చేరి కన్యారాశికదా? చిత్రకు ఒక ప్రమాణము చేత అధిదేవత ఇంద్రుడు. ఇంద్రునకు వాసవుడను పేరుకలదు. కావున నీ కన్యకాపరమేశ్వరికి 'వాసవీకన్య' యను పేరుండుట కూడ ఎంతో ఒప్పియున్నది. ఆ కన్యాంశమున నీదేశములో

నొక పట్టణమున నొక వైశ్యునియింట కుమారియై జన్మించిన పరదేవతను, తుచ్ఛుడగు నాదేశాధీశు డవమానింప యత్నించెను. వానిపాపసంకల్ప మెఱిగి యామె మానసంరక్షణార్థము ప్రజ్వలితాగ్నికుండమున నురికి జోహారొనరించి, మహాపతివ్రతల మానసంరక్షణోపాయమునకు మార్గదర్శినియై శాశ్వతముగా పూజింపబడుచున్నది. మ్లేచ్ఛభీతిచే రాజపుత్ర స్థానమున పద్మిని మొదలగు రాజపత్నులు, పరమపతివ్రతా తిలకము లిట్లే జోహారొనరించి దివ్యజ్యోతులవలె కీర్తికాయముతో మెఱయుచున్నారు. శత్రుపరాభవభీతిచే బొబ్బిలి మల్లమ్మగారు కూడ బంధుమిత్ర పరివారసహితముగా సర్వశుచియగు నగ్నిహోత్రునకే దేహము నప్పగించి పవిత్ర చరిత్రయైనది. ఈ సందర్భమున మనము ద్రౌపది అగ్నికుండమునుండి జనించినదనియు, కన్యకాపరమేశ్వరి పవిత్రదేహము నగ్నికుండమునందు త్యజించి స్వస్థానము చేరెననియు జ్ఞప్తియందుంచుకోవలయును.

---

## 60. విశాఖా చంద్ర సమాగమము

జ్యోతిర్గోళములను వర్ణించునపుడును, ఆసంబంధముగల ఉపమానములను వివరించునపుడును వాఙ్మయములో పెక్కు

తావులందు మహాకవు లీ విశాఖాచంద్ర సమాగమును రమ్యముగా వర్ణించినారు. ఈసమాగమ వర్ణనమునందు కాళిదాసునకు ప్రీతి అత్యధికము. శాకుంతల, విక్రమోర్వశీయ నాటకములలో విశాఖస్థుడగు చంద్రుడు మహాకవి కాళిదాసు చేత ఎంతో చక్కగా ప్రశంసింపబడి యున్నాడు. క్రాంతి వృత్తసంచారియై తోచు చంద్రుడొకొక్కరాత్రి యొకొక్క నక్షత్రము చెంతనుండును. నక్షత్రముల ననుసరించి పోవుట చంద్రునికి నైసర్గికము. నక్షత్రములే చంద్రునివెంట బడినట్లు తోచుట విచిత్రము. ఈ విచిత్రమునే శాకుంతల నాటకములో కాళిదాసు చమత్కారముగా వర్ణించి యున్నాడు. "కి మత్ర చిత్రమ్? యది విశాఖే శశాంకలేఖామనువర్తేతే" అని చమత్కారవాక్యము. శకుంతల పూర్ణచంద్రబింబానన. ఆమె దుష్యంతునియందు బద్ధానురాగయై యున్నది. ఆమె చెలికత్తెలైన ప్రియంవదా అనసూయలు ఆమె చిత్తవృత్తి కనుకూలురై ఆమెవెంట వచ్చుట చూచి దుష్యంతుడు పైవాక్యమును పలికెను. శకుంతల ముఖము చంద్రబింబమనియు, విశాఖలో చిఱుతలై తోచు చుక్కలు ఆమె చెలికత్తెలనియు కవిభావము. ఆచుక్కలీచంద్రాస్య ననుసరించుట విచిత్రమని దుష్యంతుడు చమత్కారముగా పలికెను.

విక్రమోర్వశీయములోకూడ ఊర్వశీపురూరవ సమాగమము విశాఖ శశాంక సమాగమముతో నుపమింపబడినది.

"ఏషచిత్రలేఖా ద్వితీయాం ఊర్వశీం గృహీత్వా విశాఖ సమీపం గత ఇవ భగవాన్ చంద్రఉపస్థితో పురూరవః"

వాల్మీకి శ్రీమద్రామాయణమునందు యుద్ధకాండలో అంగదుడు శోణితాక్షప్రజంఘు నామములుగల రాక్షసులమధ్య నిలిచి పోరాడునపుడు ఎట్లు మెఱసెనో ఈక్రింది శ్లోకములో వర్ణించియున్నాడు. యుద్ధ. 76–14 :—

"తయోర్మధ్యేకపిశ్శ్రేష్ఠశ్శోణితాక్షప్రజంఘయోః
విశాఖ యోర్మధ్యగతః పూర్ణచంద్ర ఇవాభవత్."

చంద్రుడేగాక అంగారకగ్రహము విశాఖలోనున్నప్పటి రమ్యదృశ్యముకూడ వాల్మీకి వర్ణించియున్నాడు.

చూ. యుద్ధ. 103–33.

"ఆక్రమ్యాఙ్గారక స్తస్థౌవిశాఖామపిచాంబరే."

---

## 61. రాధ

విశాఖనక్షత్రమునకు రాధ యని పేరు గలదు. అధర్వ వేద మీయంశమును ఋజువు చేయుచున్నది. రాధ శ్రీకృష్ణ భగవానునికి మేనత్తయని గాథలున్నవి. ఆమె నిత్యము భగవ దారాధన తత్పరురాలు; కావున నతనికి మిక్కిలి ప్రేమా

స్ఫురించును. "రాధ is the embodiment of "ఆరాధన" అని పెద్దలు వర్ణించినారు. భగవద్భక్తి ఆమెయందు మూర్తీభవించినది. వారి ప్రణయము "గీతగోవిందము" మొదలగు సుప్రసిద్ధగీతములలో సొగసుగా వర్ణింపబడియున్నది. పున్నమనాడు విశాఖతో చంద్రుడు కూడియున్న వైశాఖమాసమునకు రాధామాసమను పేరు అమరములోకూడ కనబడుచున్నది. వేదవాఙ్మయములోనే వైశాఖము మాధవమాసము. ఆమాసములో రాత్రియెల్ల రాధామాధవులు నక్షత్రరూపులై ఖగోళమున నద్భుతముగా మెఱయుచుందురు. మరి యారు నెలలనాడు కార్తిక మాసమున సూర్యోదయాత్పూర్వము విశాఖ తూర్పున నుదయమగుచుండును. ఆదినములలో విష్ణుభక్తులు "రాధాసమేత కార్తిక దామోదరు"నికి అర్ఘ్యపాద్యములిచ్చి పూజింతురు. వైష్ణవసాంప్రదాయసిద్ధమగు భాగవతమతములో రాధ జీవాత్మగాను, శ్రీకృష్ణభగవానుడు పరమాత్మగాను, వారి సమాగమమే జీవుని పరమపదప్రాప్తిగాను భావింపబడుచున్నది. కార్తికమాసములో సూర్యునికి గూడ 'విష్ణు' వని పేరున్నట్లు ప్రమాణములు కలవు. రాధాకృష్ణులను గూర్చి మరికొన్ని వివరములు నాజ్యోతిర్వేదములో చూడనగును.

---

# 62. అనూరాధ

వేదగ్రంథములందంతటను ఈనక్షత్రసమూహము అనూరాధ యనియే పేర్కొనబడినది. "ఛత్రకారత్రయమ్" గొడుగువంటి యాకారముగల మూడు చుక్కలుకూడి యనూరాధ యగునని వరచుచి తెలిపినాడు. "తోరణాకృతిని పంచతారకే" అని కాళిదాసు వర్ణన. వృశ్చికరాశిలోని (Scorpio) బీటా, డెల్టా, పై, అను గ్రీకు అక్షరగుర్తులచే వ్యక్తము లగు నక్షత్రములు అనూరాధ యని పాశ్చాత్య విద్వాంసుల మతము. విశాఖ నాలుగవపాదము+అనూరాధ+జ్యేష్ఠ ఇవి కూడి వృశ్చికరాశియగును. వృషభ వృశ్చికరాసులు ప్రతిస్పర్థులు. ఒరయన్ (Orion) యోధుడు తేలుకుట్టగా చనిపోయెనని పడమటి గాథలు కలవు. అనూరాధ వృషభమునకు ఎట్టయెదుట (Diametrically opposite) గానున్నది. అనూరాధ కధిదేవత మిత్రుడను దేవుడు. మిత్రుడనగా మన సూర్యుడు మాత్రముకాడు. అతడు ఆర్యులచే పూజితుడైన వేరొక దేవత. ఈమిత్రుడు వృషభమును వధించుచున్నట్లును, వృశ్చికము వృషభమును కుట్టి చంపుచున్నట్లును చూపెడి ప్రతిమలు వందలకొలది చాల్డియా, బాబిలోనియా దేశములలో ప్రాచీనవస్తు పరిశోధకులకు లభించినవి. క్రైస్తవ మతాగమనమునకు పూర్వము భరతఖండమునందేగాక చాల్డియా, బాబిలోనియా గ్రీసు, రోము, ఈజిప్టు మొదలగు

దేశములలో కూడ, ఈమిత్రదేవునికి విశేషముగా పూజలు జరుగుచుండెను. మిత్రదేవునిపేరు పెట్టుకొనిన మిత్రిడేట్సు (Mithridates) మొదలగువా రనేకులు (Alexander) అలెగ్జాండరు మహామహుని మిత్రులై యుండిరని ప్రాచీనపురుషుల జీవచరిత్రలు వ్రాసిన (Plutarch) ప్లూటార్కు తెలుపుచున్నాడు. ఈమిత్రదేవుని పూజావిధానములను సంగ్రహించి క్రైస్తవమతాచార్యులు వారి క్రైస్తవ మతసాంప్రదాయములను పూజాపద్ధతులను ఏర్పఱచుకొని రనియును, వారెంత జాగ్రత్తగా మభ్యపరుపయత్నించినను ఆరహస్యము దాగక గుట్టు బట్టబయలాయెననియును నిజము బైటపడెననియును Carpenter పండితుడు పైని వివరించిన Pagan and Christian Religions అను గ్రంథములో నొక్కి వక్కాణించెను.

కాని మిత్రదేవు డనూరాధ కధిదేవతయనియు, మన ద్వాదశాదిత్యులలో నొకనికి మిత్రుడను నామము కలదనియు, ఆర్యు లీమిత్రదేవతను విశేషభక్తితాత్పర్యములతో పూజించుచుండిరనియు ఆర్యుల మిత్రపూజాక్రమమును పడమటిదేశములవారు సంగ్రహించి యనుసరించిరనియు (Carpenter) కార్పెంటరు పండితుడు కూడ గ్రహింప నేరడయ్యెను. అనూరాధ కధిదేవతయగు మిత్రుని ప్రశంస వేదములందును, బ్రాహ్మణములందును, ఉపనిషత్తులం నను కూడ విశేష

ముగా గలదు. ఉదాహరణార్థ మొక్క మంత్రము మాత్ర మిచ్చుట వ్రాయుచున్నాను. చూ. ఋగ్వేదము I. 90-9.

"శంనో మిత్రః శంవరుణః శంనో భవత్వర్యమా
శంనో ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణు రురుక్రమః."

---

## 63. జ్యేష్ఠ

కృష్ణయజుర్వేదమునం దీనక్షత్రము 'రోహిణి' యని చెప్పబడెను. మైత్రావరుణీయ, కాఠక, సంహితలయందును, తై. బ్రాహ్మణమునందును ఈనక్షత్రము జ్యేష్ఠయనియే తెలుపబడినది. ఇందును ఛత్రాకారముగల చుక్కలు మూడేగలవు; కాని భేదమేమనగా అనూరాధ చుక్కలు ఉత్తరదక్షిణములకు కట్టిన తోరణమువలెను, జ్యేష్ఠచుక్కలు తూర్పుపడమరలకు కట్టిన తోరణమువలెను కనపడును. ఈ చుక్కలు వృశ్చికరాశి (Scorpio) లో సిగ్మా, ఆల్ఫా, టా గుర్తులుగల చుక్కలని పడమటి పండితుల నిర్ణయము. అందు ఆల్ఫా గుర్తుగల చుక్క ఈరాశిలో మిక్కిలి తేజోవంతమైనది. అదియే మన యోగతార జ్యేష్ఠ. పడమటివారు జ్యేష్ఠను (Antares) 'అంటారిస్' అను [illegible]క నామముతో కూడ వ్యవహరింతురు.

ఆమాటకు (Rival of Mars) అంగారక గ్రహమునకు ప్రతి స్పర్థియని యర్థము. అంగారక గ్రహమువలెనే జ్యేష్ఠకూడ కాలిన ఉక్కుగుండువలె మిక్కిలి ఎఱ్ఱగా ప్రకాశించుచుండు రిక్క. రోహిణి, ఆర్ద్ర, స్వాతి నక్షత్రములవలెనే జ్యేష్ఠకూడ ఎఱుపు వన్నెకాంతితో తేజరిల్లు మేటిచుక్క.

---

## 64. జ్యేష్ఠ కధిదేవత ఇంద్రుడు

ఇంద్రుడు దేవతలకెల్ల రాజు. పరిమాణము, తేజస్సు మొదలగు ముఖ్యాంశములలో నెల్ల ఇంద్రదైవత్యమైన జ్యేష్ఠ నక్షత్రరూపులగు దేవతలకెల్ల రాజు కాదగియున్నది. మన సూర్యగోళముకంటె జ్యేష్ఠ పరిమాణవిషయమున తొమ్మిది కోట్లరెట్లు పెద్దదై వెలుగు బ్రహ్మాండగోళమనియు సూర్యుని కంటె నాలుగువేలరెట్లు తేజోధికమైనదనియు, మనకు మూడు వందల ఎనుబది వెలుగువత్సరముల (Light years) దూరము నందున్న దనియు జీన్సుదొర లెక్కవేసెను. అనగా అక్బరు రాజ్యారంభమున జ్యేష్ఠనక్షత్రమునుండి వెడలి ఎక్కడను ఆగక ఏకాయెకీని సెకండునకు లక్ష యెనుబదియారువేల మున్నూట ఇరువదియారుమైళ్ల త్వరతో నిరంతర ప్రయాణము సాగించు

చుండిన వెలుగు కిరణములు ఈనాడు మనభూమిని చేరుకో గలుగుచున్నవి. వానిదారిలోనే మన భూమిమీద మొగల్ సామ్రాజ్యము, మహారాష్ట్ర రాజ్యము, బ్రిటిష్ సామ్రాజ్యము కూడ పుట్టి, పెరిగి విచ్ఛిన్నమై పోయినవి. ఎంత అల్పా యుర్దాయముగల సామ్రాజ్యములివి ?

---

## 65. దేవతలు-రాక్షసులు

ప్రతి చుక్కకును స్వయముగా వ్యక్తిగతముగా కొంత గమనమున్నది. అనగా, అపారాకాశమునందు ప్రతినక్షత్ర మును, ప్రతిగోళమును ఏదో కొంత త్వరతో ఏదిక్కువైపునో వెడలిపోవుచుండును గాని, స్థిరముగా నిలిచియుండిపోదు. ఈ గమనవిధానమునుబట్టి ఖగోళమున నగపడుచుక్కలు మొత్తముమీద రెండు తెగలుగా విభజింపబడినవి. అందొక తెగకు చేరిన చుక్కలు జ్యేష్ఠ నక్షత్రమువంకకు వచ్చు చున్నవి. రెండవతెగ చుక్కలు మృగశిర—అనగా Orion వంకకు పోవుచున్నవి. మొదటితెగ చుక్కలు దేవతలనియు, రెండవతెగ చుక్కలు రాక్షసులనియు మనవారు పురాణము లలో వర్ణించి యున్నారు. జ్యేష్ఠయనగా ఇంద్రుడు. ఇంద్రుని యనుసరించు చుక్కలు దేవతలు. మృగశిర యనగా వృత్రా

సురుడు. వాడు రాక్షసులకెల్ల పెద్ద; కాబట్టి రాక్షసులు వీనిని చేరవత్తురు. ఇంద్రవృత్రులు ప్రబల ప్రతిస్పర్థులు. మృగశిరస్సుడును, మాయామృగరూపుడును నగువృత్రాసురుడు దివిజగంగాప్రవాహమున కడ్డుపడి భూమి మీద వర్షపుచినుకు పడకుండ చేయుచు ప్రజలను తపింపచేయుచుండును. అప్పుడు ఇంద్రు డీవృత్రాసురుని సంహరించి, వృత్రుని యద్ధమాన్ని సకలప్రాణులకును ఆహ్లాదకరముగా వర్షప్రదానము గావించును. జ్యోతిశ్శాస్త్రార్థములో ఇంద్రు డధిదేవతగాగల జ్యేష్ఠనక్షత్రసహితమైన పున్నమదినములలో సూర్యాస్తమానము కాగానే తూర్పున జ్యేష్ఠ ఉదయించినపుడే మృగశిర—వృత్రు డస్తమించును. దీనినే మృగశిరా ప్రవేశమందురు. మృగశిరకార్తె చొరబడినప్పటినుండి వర్షసమృద్ధి యగును.

---

## 66. "ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్టసానుమ్"

మరొక ముఖ్యవిషయముకూడ మన మిచట శ్రద్ధగా గమనింపవలెను. ఈదక్షిణ దేశములలో ఇటీవల కొంత కాలము నుండి నెలలు అమావాస్యనుండి అమావాస్యకు

లెక్కించుకొనుచున్నాము. కాని భరతఖండపు టుత్తర దేశములలో పున్నమనుండి పున్నమకే నెలలు లెక్కించుకొనుచుందురు. దాక్షిణాత్యులు జ్యేష్ఠబహుళపాడ్యమి యని చెప్పుకొనుదినమును, ఔత్తరాహులు ఆషాఢారంభప్రతిపద్దినమందురు. వారికాదినము ఆషాఢమాసములో ప్రథమదివసము. ఈసంగతి జ్ఞప్తియందుంచుకొని కాళిదాసకృతమైన మేఘసందేశములోని "ఆషాఢస్య ప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుమ్" అను శ్లోకమును అన్వయించుకోవలెను. ఇంద్రుడు వృత్రుని సంహరించిన మృగశిరకార్తె ప్రారంభములో ఇంద్రానుగ్రహమువలన వర్షమేఘములు పర్వతసానువుల నావరించి జలసమృద్ధి చేయగలవు.

(చూ. 27 వ పటము)

---

## 67. ఉదయించుచున్న ఇంద్రుడు, చనిపోవుచున్న తల్లివైపు దీనముగా చూచుట.

ఇంద్రుని దేవాధిపత్యము, నరాధిపత్యము వర్ణించునవే గాక ఇంద్రునిగూర్చి చేసిన చమత్కారవర్ణనలు ఋగ్వేదములో ననేకములున్నవి. ఇంద్రదైవత్యమైన జ్యేష్ఠ వృశ్చిక

రాశిలో నున్నది. "జ్యేష్ఠాంతమ్ వృశ్చికమ్" కదా! జ్యేష్ఠ, మూల నక్షత్రములు ఉదయించిన తరువాత వృశ్చికరాశి నక్షత్రములు ఖగోళమున దక్షిణమునకు వ్రాలి చరించు చున్నట్లు మనకగపడుచుండును. తేలు, ఎండ్రి, అరటిచెట్లు మొదలగు జంతువృక్షజీవులకు సంతానప్రాప్తికాగానే మర ణము సంభవించునని మనదేశములో జనులు పుక్కిటి పురా ణము (traditional) గా చెప్పుకొనుచుందురు. తేలు ఈనినప్పు డెల్ల విధిగా చావదు. ఈనినతరువాత పిల్లలతో కూడ బ్రతికిన తేళ్లెన్నో గలవు. యథార్థముకాని కవి సమయములలో ఈనిన తేలు చచ్చునను కొనుట యొకటి. ఇట్టి కవిసమయమును బట్టి వృశ్చికగర్భస్థుడు, ఇంద్రుడు జన్మించిన తోడనే అనగా జ్యేష్ఠ ఉదయించిన వెంటనే మాతృమరణము సంభవింపవల యునుగదా! అదెట్లు? "దీనిభావమేమి తిరుమలేశ" అన్నట్లు ఋగ్వేదములో నీవిషయమునుగూర్చి చమత్కార సమస్య యొకటి ప్రస్తావింపబడియున్నది. చూ. ఋగ్వేదము IV - 18 1, 2, 3 మంత్రములు. అప్పుడే జన్మము నొందుచున్న ఇంద్రుడు (ఉదయమగుచున్న జ్యేష్ఠ) తనలో తానిట్లు అనుకొను చున్నాడు :— "దారి చాల ఇఱుకుగా నున్నను నేను దక్షిణ పార్శ్వమార్గము నుండియే నిర్గమించవలెను". ఇట్లనుకొనుచు ఇంద్రుడు చనిపోవుచున్న తల్లివైపు తానెంతో దీనముగా చూచెను" అని పైని తెలిపిన మంత్రములలో వర్ణింపబడినది. వృశ్చికరాశియు అందున్న జ్యేష్ఠ-ఇంద్రుడును చక్కగా

మెఱయుచు మనకగపడు చుండగా, వృశ్చికము చచ్చెనని యెట్లందుము? వృశ్చికము చావక యున్నప్పుడు ఇంద్రుని తల్లి యెవరు? ఆమె చనిపోవుట యనగా నేమి? చనిపోవుచున్న తల్లివైపు ఇంద్రుడు దీనముగా చూచెననుట కర్థమేమి? అని మనము జాగ్రత్తగా యోజించి చూడవలెను.

దేవతల కందరకును తల్లి అదితిదేవి యని పురాణ ప్రసిద్ధము. దేవప్రభుడగు ఇంద్రుని తల్లికూడ అదితియే. పునర్వసు నక్షత్రము అదితి దైవత్యమని మన మీవఱకే తెలిసికొంటిమి. జ్యేష్ఠ నక్షత్రము తూర్పున నుదయమగు నప్పటికి పునర్వసు చుక్కలు పడమట చాలవఱకు వ్రాలియుండును గాని అస్తమింపవు. అస్తమింపబోవుచుండును. నక్షత్రభాషలో పునర్వసు (అదితి) ఇంకను 'చనిపోలేదు' త్వరలో అస్తమింపగలదు. 'చావనైయున్నది'. ఈఖగోళాంశమే ఋగ్వేదములో పైవిధమున కట్టుకథగా వర్ణింపబడినది. అదితికి ఇంద్రుడు తొలి పుట్టువు; దేవతలకు రాజు. ఇట్లుండగా బలి చక్రవర్తి ఇంద్రునోడించి రాజ్యభ్రష్టుని జేసెను. ఇంద్రునికి పునః రాజ్యప్రాప్తికోరి అదితి ఎన్నోనోములు పట్టి వ్రతము లాచరించెను. ఆమెచేసిన పూజలకు సంతుష్టుడై విష్ణుభగవానుడు అదితికశ్యపులకు ముద్దుబిడ్డడై వామనుడై యవతరించెను. కాబట్టి వామనుడు ఇంద్రుని తమ్ముడు; ఉపేంద్రుడనబఱుగు చున్నాడు. వృత్రసంహారసమయమున నింద్రుడు

విష్ణుని సాహాయ్యము వేడినట్లును, ఆప్రార్థన నంగీకరించి విష్ణు డడుగులు వేసెననియు ఋగ్వేదమంత్రములున్నవి. నాడు త్రివిక్రముడై నక్షత్ర స్వరూపు డగు శ్రీమహావిష్ణుదేవుని స్థానము స్వాతికి తూర్పుగాను, జ్యేష్ఠ కుత్తరముగాను కనబడుచు ఆకాశమంతటికిని నేత్రమో యనునట్లు మెఱయుచున్నది. సూరిజనులావంక సదా చూచుచునే యుందురు. "తద్విష్ణోఃపరమంపదమ్ సదాపశ్యంతిసూరయః దివీవచక్షురాతతమ్" అని శ్రుతి. ఋగ్వేదము I-22-20

---

## 68. మూల

కృష్ణయజుర్వేదమున నీనక్షత్రమునకు 'విచృతౌ' అని పేరు కనబడుచున్నది. తైత్తిరీయబ్రాహ్మణమునందు 'మూల బర్హిణి' యనియు, తదితరగ్రంథములందు 'మూల' యనియు నిది చెప్పబడినది. 'కుప్యత్కేసరీపంచ' కోపించి గంతువేయునై యున్న సింహమువంటి యాకారముగల నక్షత్రము లైదుచేరి 'మూల' యగునని వరరుచి వర్ణన. అంకుశమువంటి చుక్కలు 'మూల' యని దేశవ్యవహారము. వృశ్చికరాశి యనబడెడి చుక్కలు జ్యేష్ఠతో నంతమగును; కాని తేలు తోకలో మిగిలిన చుక్కలు మూలయగునని చెప్పవచ్చును. ఇందు

పడునొకండు చుక్కలగపడుచున్నవి. ఇవి తేలు తోకలోని పూసలవలె నుండును. కొన చుక్కలు రెండును తుదిపూసయు, కొండియు ననదగి యుజ్జ్వలముగా మెఱయును. మూలకు పితృదేవతలును, నిరృతియుకూడ అధిదేవతలు. మంత్రపాఠములలో "ప్రజాపతిర్వా.అకామయత మూలమ్ ప్రజామ్ విందేయతి" అని యున్నది.



## 69. పూర్వాషాఢ - ఉత్తరాషాఢ

ఇవి "ద్వేద్వేచాకం" మంచపుకోళ్లవలె రెండేసి చుక్కలని వరరుచి తెలిపెనుగాని, యీచుక్కలు ఫల్గునీ నక్షత్రములవలె సమకోణములుగల దీర్ఘచతురస్రాకారముకలిగి యుండవు. ఇంగ్లీషులో (Rhombus) రాంబస్ అనబడెడి అసమకోణచతురస్రరూపముతో నగపడుచుండును. కాళిదాసు వీనిని "శూర్పాకృతి తారాచతుష్టయము"ని వర్ణించెను. చేటరూపముగల నాలుగు చుక్కలివియని కాళిదాసు నభిప్రాయము. ఇవియేనుగుదంతములవంటి యాకారముగల నాలుగు చుక్కలు "గజదంతాకృతి ద్వితారకాత్మకా" అని జ్యోతిషకారునిమతము. ధనుర్ధారి (Sagittarius) అను తారాసముదయములో డెల్టా, ఎప్సిలాన్, గుర్తుగల చుక్కలు పూర్వాషాఢ

యనియు, జీటా, ఒమిక్రాను గుర్తులుగల చుక్కలు ఉత్తరాషాఢ యనియు మేక్డొనెల్ (Macdonell) పండితుడు నిర్ణయించెను.

---

# 70. ధనుస్సురాశి యనబడు ధనుర్ధారి మన్మథుడే!

మూల+పూర్వాషాఢ+ఉత్తరాషాఢ పాదము, ఇవి ధనుస్సురాశిలోని చుక్కలు. ఈనక్షత్రముల తేజోవిశేషములనుబట్టి "దీప్యమానోధనుర్ధరః" అని చక్కగా వర్ణింపబడినది. ఏమాసములో సూర్యాస్తమానము కాగానే ఆషాఢనక్షత్రములు తూర్పున నుదయమగునో ఆమాసము ఆషాఢమాసమనబడుచున్నది. ఆనెల పున్నమనాడు చంద్రుడీచుక్కలతో కూడియుండును. అప్పటికి ముందుగానే మృగశిరా ప్రవేశమై వర్షములు కురిసి తాపము చల్లారును. వాకిట మంచములింటిలో పడును. స్త్రీ పురుషుల కన్యోన్యసమాగమాకాంక్షలావిర్భవించును. అంతకుముందు ఎనిమిది నెలలనుండి ఏకాంతవాసము చేయుచున్న యక్షునికిగూడ ఆషాఢవర్ష మేఘమును చూడగానే ఔత్సుక్య మతిశయించి, తన్నువిడిచి అలకా

పురిలో నొంటిగానున్న భార్యపై ధ్యానము నిలిచి మేఘముద్వారానే ఆమెకు సందేశ మంపెనని కాళిదాసు మేఘసందేశకావ్యమున రసవంతముగా వర్ణించియున్నాడు. కప్ప మొదలు కమలగర్భునివఱకు ప్రేమకాంక్ష లువ్విళ్లూరు మాసము ఆషాఢము. "ఆబ్రహ్మకీటాంత మిదం నిబద్ధమ్। స్త్రీపుంప్రయోగేనజగత్సమస్తమ్" అను ప్రకృతి సత్యము ఆమాసములో చక్కగా ఋజువగుచున్నది. మంత్రపాఠములు కూడ నీయాషాఢానక్షత్రములకు కామునితో సంబంధము తెలుపుచున్నవి. "అపోహ ఆకామయత సముద్రం కామ... సముద్రాయస్వాహా కామాయస్వాహా" అని యందుకలదు. కృష్ణయజుర్వేదమున పూర్వాషాఢకు ఆపోదేవతయు, ఉత్తరాషాఢకు విశ్వేదేవతలును అధిదేవతలని కలదు. కావున పూర్వాషాఢకు జల, జలరాసులతోను, కాముడనబడు మన్మథునితోనుకూడ సంబంధమేర్పడుచున్నది. ఇదంతయు

(చూ. 28 వ పటము)

చక్కగాతఱచి చూచిన పిమ్మట నీరాశినక్షత్రములు మన్మథుడగునని పూర్వఋషులు నిర్ణయించియున్నారు. విరాట్పురుషుని తేజోరూపము వర్ణించుచు బాదరాయణులవారు "మేషఃశిరోధవదనమ్ ... ధన్వీచ + ఊరుయుగమ్" అని తెలిపియున్నారు. విరాట్పురుషుని ఊరు ప్రదేశము మన్మథుడు. అహేతువుచేతనే దేవతలకును మానవులకును కూడ మనస్సు

లలో సంభోగచింతలు పుట్టించి హృదయములను చలింపచేయు మని యీప్రేమ వ్యాపారములకు మన్మథుడు భగవంతునిచే నియమింపబడెనని చెప్పనైనది. నిశ్చలచిత్తముతో తపోనిష్ఠుడైయున్న ఈశ్వరునికి పూజాసపర్యలు చేయుచున్న పార్వతి పై మనసు నిలుచునట్లు చలింపజేసిన మన్మథుడా సహాదేవుని ఫాలనేత్ర జ్వాలలోబడి మడసిన వృత్తాంతము ఆర్ద్రా నక్షత్ర చర్చలో నవగతము చేసికొంటిమి. నాటినుండి మన్మథుడ నంగుడై యుండియు నీశ్వరుని గెలిచి పార్వతి కర్థశరీర మిప్పించినాడు. ఒక్క ఈశ్వరునేకాదు మన్మథుడు "సకల భువనం వ్యాకులయతి" విశ్వమునగల నమస్త ప్రాణులను పూవుటమ్ములతో కొట్టి వేధించునని యొకకవయిత్రీమతల్లి చమత్కారముగ వర్ణించి, అక్షరలక్షలు బహుమానమందు కొనియెనని భోజచరిత్ర తెలుపుచున్నది. శృంగార రసార్ణవాధిపతియగు శ్రీనాథుడు నైషధములో మన్మథుని వర్ణించిన పద్యభాగము నీక్రిందవ్రాయుచున్నాను. చూ. శృం. నై VII-41

సీ॥ "గుడుసైనపూవింటగూడి కమ్మని తూపుకటకాముఖపు కేలగరము మెఱయ । కటిమండలంబుపై కనకంపుచెఱగుల జిలుగుపచ్చని పట్టుచేల మమర । నాలీఢ పాదవిన్యాసంబు శృంగార వీరాద్భుతములకు విందుసేయ । జన్నిచిగురాకు బేరోకల చేతపట్టి । పేరుటామని రాచిల్క తేరునడువ । నుక్కడీడయి యేతెంచె నుక్కుమిగిలి"

ఋగ్వేదములో మన్మథుడు కృశానుడని వర్ణింపబడినాడు. చూ. VI 3-5 ; కృశానుడు సానబట్టిన లోహపు మొనగల వాడియలుగును తన వింటికి సంధించి మానవులపై ప్రయోగించునని యావేదములో తెలుపబడినది. శృంగార నైషధములో శ్రీనాథుడు మీనకేతనుడగు మన్మథుని దివ్య శరంబులు "పువ్వు మొగ్గలో యూహయొనర్పగా పిడుగులో కులిశంబులో?" అని పృచ్ఛచేసినాడు.

కీ॥ శే॥ గురజాడ అప్పారావుపంతులుగారు కన్యాశుల్క-నాటకములో ఈవిషయమై "బా గా ఉ ప న్య సిం చా రు" మన్మథునిగూర్చి గిరీశం స్వగతంగా అనుకున్న మాటలివి:- "పిడితస్సాగొయ్యా! పీడి బాణాలు పువ్వులటోయి! ఆమాట లెవడు నమ్ముతాడు? వెఱ్ఱి కుట్టె ఎవడైనా నమ్మాలిగాని! అనుభవైకవేద్యమైన దీని నిజం ఏవిటంటే — మంచిపదునుబట్టిన లోహం మొనకి డైమండ్ పోయింట్ (Diamond point) అనగా వజ్రపుమొనవేసి (Poison) పోయిజన్ అంటే విషములో ముంచి కంటికి కనపడకుండా మంత్రించి విసురుతాడు. అందుచేతనే పైకి గాయం పడదు. కాని పోలీసువాళ్ల దెబ్బలలాగలోపల తహతహ పుట్టిస్తాయి."

---

# 71. పుష్యమాసము - శూన్యమాసము

పుష్యమాసము సాధారణముగా ధనుర్మాసమగును. ఆమాసములో ధన్వి సూర్యునితో కూడియుండును; సూర్యునితోనే ఉదయించి సూర్యునితోనే అస్తమించును. ఆరాత్రులలో ఆకాశమున నేవేళను కనపడడు. (Privelge) 'ప్రివిలేజి' సెలవుమీద నున్నాడో యనునట్లు మన్మథుడానెలరోజులును తన విధికృత్యము లేవియు నెరవేర్చడు. సంధానకర్త లేక, ప్రేమాంకురములైన తలయెత్తి పొడచూపరాని శూన్యదినములవి. కాబట్టి పుష్యమి శూన్యమాస మనిపించుకొనినది. క్రొత్తమిధునములమాట యటుండనిండు—ప్రాతదంపతులమధ్యనైనను ప్రేమపూర్వకమైన సమాగమాభిలాష కలిగించు సంధానకర్త—శృంగార రసాధిదేవత—పుష్పబాణుడేడీ? కనబడడే! మామూలుగా నిర్వహించవలసిన ప్రాతకార్యములైనను నిర్వహించక మన్మథు డెక్కడికో పోవుటచేత నీధనుర్మాసములో శ్వశురగృహములనుండి కోడండ్రను పుట్టినయిండ్లకు తీసికొని వచ్చుటయును, మకర సంక్రమాణమయిన తరువాత—అనగా మన్మథుడు తూర్పున మరల పొడచూపి, తన మెప్పటి (Duty) డ్యూటీ—పనిలో ప్రవేశించిన తరువాత యువతులను భర్తలతో కాపురమునకు తిరిగి పంపు నాచారము మనదేశములో నమలు జరుగుచున్నదని చమత్కరించి చెప్పవచ్చునుగదా? శ్రీనాథకవిసార్వ

ఛాముడు శివరాత్రి మాహాత్మ్యము (IV. 26) లో చెప్పినట్లే

"ఇనుడు కోదండరాశి మీఁదెక్కువేళ
ఇక్షుకోదండవల్లి యెక్కిఁడు మరుండు."

మరుని చిత్ర మిట చూడఁదగును.

(చూ. 29 వ పటము)

---

## 72. విష్ణుపదము

మన్మథునికిని బ్రహ్మదేవునికిని కూడ తండ్రి విష్ణుభగవానుడు; ఇంద్రునకు సోదరుడగుట నుపేంద్రుడని పైని చదివియున్నాము. ఇంద్రస్థానమైన జ్యేష్ఠకు మీఁదుగా నుత్తరమున విష్ణుపదమున్నది. విష్ణుపదమనగా ఆకాశమనియు, ఆకాశమార్గము విష్ణుపదవీథియగు ననియు ప్రయోగములు లేకపోలేదు కాని, అసలు విష్ణుపదమను స్థానము ఖగోళపు టుత్తరభాగమున నున్నది. మానవశరీరమునకు నేత్రమువలెనే యూర్ధ్వగోళమంతటిలో చాల ముఖ్యమైన స్థాన మీవిష్ణుపదము. ఈపరమపదము ధ్రువునకును సప్తఋషి మండలమునకు నూర్ధ్వోత్తరముగా, స్వాతీశ్రవణముల మధ్యనున్నది.

శ్లో॥ ఊర్ధ్వోత్తరాం ఋషిభ్యస్తు ధ్రువోయత్రాస్తి వైస్మృతః ఏతద్విష్ణుపదం దివ్యం తృతీయం వ్యోమ్ని భాస్వరమ్ ”

అని విష్ణుపురాణము తెలుచున్నది. సప్తఋషులున్న బృహద్వృక్షముయొక్క పుచ్ఛము ననుసరించి పోయినచో స్వాతీనక్షత్రము తగులును. స్వాతి వాయుదైవత్యము. “మారుతస్య వేధసః॥ వాయుదేవుడెప్పుడును విష్ణుని సన్నిధానమున నా ప్రక్కనే యుండి సదా సేవించుచుండును. ఇది ఋగ్వేదవాక్యము. మంత్ర పాఠములలోని వాక్యమును గూడ గమనింతము. “కింతద్విష్ణోర్బలమాహుః? కాదీప్తిః? కింపరాయణమ్ః?

వాతాద్విష్ణోర్బలమాహుః అక్షరాద్దీప్తిరుచ్యతే; త్రిపదాద్ధారయద్దేవ యద్విష్ణోరేకముత్తమమ్ ”

రామాయణార్థములో శ్రీరాముడు “సదాహనుమదాశ్రితుడు.” ఎప్పుడును ఆంజనేయుని సేవగొనుచుండును. స్వాతితోకలసి నక్షత్రమయమయిన వానరరూపము ఖగోళమున కానవచ్చుచున్నట్లు బహుదేశ చిత్రసంచయము సాక్ష్యమిచ్చుచున్నది. వాయుదైవత్యమై వానరరూప విలసితమగు స్వాతీ నక్షత్రము ప్రక్కనే విష్ణుభగవానుడు నక్షత్రరూపమున మెఱయుచున్నాడు. మనశరీరములలో మనము పీల్చుగాలి ప్రక్కనే హృదయసీమను పరమాత్ముడు కలడని మన విశ్వాసము. ఖగోళములో కూడ పరమాత్మ పరముపదము ప్రక్క వాయువుండుట గమనింపవలసిన విశేషము. మోక్ష

ద్వారమునకు ద్వారపాలకుడు వాయుమూర్తి. వాయుదేవుని యంశమున జనియించిన రామభక్తుడు - హనుమంతుని గూర్చి తులసీదాసు వ్రాసినవాక్యము లిట వ్రాయుచున్నాను:

"రామ ద్వారేతుంరఖ్వారే। హోతన ఆజ్ఞాబిన్ పైసారే అష్టసిద్ధినవనిధి కేదాతా అసవరదనహేజానకిమాతా। రామ రసాయున తుమ్వారెపాసా। సాదరతుంరఘుపీరకే దాసా। తుమ రేభుజనేరామ కెపాలై జన్మజన్మ కోదుఃఖబిస్రావై। తులసీదాస సదాహరి బేటా। కీజై దాసహృదయమే ఢేరా" తులసీదాసునకు బహుశతాబ్దములు ముందుండినమధ్వాచార్యులవారు వాయుమూర్తి ద్వారానే మానవులకు మోక్షము సిద్ధించునని బోధించిరి.

స్వాతికి తూర్పుభాగమందు శేషుని సంబంధముగల చుక్క లున్నవి. ఈచుక్కలను పడమటి జ్యోతిష్కులు (Serpens) అనుచున్నారు. (Milky way) అనివారు తెలిపెడి క్షీరసాగరములో శేషశయనముపై విష్ణుమూర్తి పవ్వళించి యున్నట్లు నక్షత్రరూపము గోచరించుచున్నది. శేషునికి వాయువే ఆహారమని కవిసమయము. కావున వాయుదైవత్యమైన స్వాతి ప్రక్కనేయుండి శేషుడు "అమృతమధురంబులగు గాడ్పులానియాని బొజ్జపెంచును. ఇట్లు బొజ్జపెంచిన పెనుపావ సెజ్జమీద పాలమున్నీటిలో శౌరి పవ్వళించు" నని రమ్యా

ముగా, బహుసాభిప్రాయముగా శ్రీనాథ మహాకవి వర్ణించి యున్నాడు.

మఱియును శివరాత్రి మహాత్మ్యములో గూడ శ్రీనాథుడిట్లు వర్ణించెను II. 73 "అమృతవారాశిలోన శేషాహిమీాద పవ్వళించిన కౌస్తుభాభరణుడు"

మఱియు నాదేవదేవుని శిరస్సు నలంకరించిన కిరీటము ధగధగ మెఱయుచు నవరత్ననిర్మితమైనదో యనునట్లు ఉజ్జ్వలతారామయమై భాసిల్లుచున్నది. చూపఱల కాశ్చర్యము గొల్పు నాకిరీటకాంతులను వాయుస్తుతి "శిరసిపరిసరద్రశ్మికోటీరకోటా" అని చక్కగా వర్ణించుచున్నది.

(చూ. 30 వ పటము)

విష్ణుని నాభీకమలమునుండి మరొక చక్కటి కమలము ఉద్భవించినట్లగపడును. కమలాకారముగల యీాధవళదృశ్యమును పడమటివాగు ఉంగరమువలె గుండ్రని వెలిమబ్బుగా భావించుచున్నారు (Ring-Nebula) దాని చిత్ర మిచ్చుట చూడనగును. అది ఉంగరమువలె సరిగా గుండ్రముగాలేదు. తూర్పు పడమరలకు "పొడవు మిగిలిన పొందమ్మిపూవువలె" నున్నదని శ్రీనాథుడు చేసిన వర్ణన దీనికెంతయు యొప్పియున్నది. ఈ వెలిమబ్బునుండి చతుర్ముఖబ్రహ్మ ప్రాగుర్భ

వించెను. పడమటి పరిశోధకు లచ్చటనున్న చుక్కలగుంపు వీణె యాకారమున నుండుటచేత దానికి Lyra వీణె మండల మనియే పేరుపెట్టిరి. ఆచుక్కలగుంపులో 'ఎప్సిలాన్' అను గ్రీకు అక్షరసంజ్ఞ గల చుక్కగలదు. అది సామాన్యముగా ఒక చుక్కవలె కనబడినను, జాగ్రతగా పరిశీలించినచో నందు రెండు చుక్కలజత కనబడును. యంత్రసాహాయ్యముతో పరి శీలన చేసిన పక్షమున నందొకొక్క చుక్క రెండుగా కనబడును. కాబట్టి అందులో నాలుగుచుక్కలు గలవని తేలు చున్నది. ఈ నాలుగు చుక్కలును బ్రహ్మదేవుని నాలుగు ముఖములని మనవారు తెలిపిరి. ఆముఖముల నాశ్రయించి సరస్వతి వీణె పాణియై విరాజిల్లుచున్నది. ఈ వాణీహిరణ్య గర్భులను గూర్చి వివరములు తరువాత తెలిసికొందము. ముందు విష్ణుదేవుని రూపవిశేషముల నారయుదము. ఈక్రింది చాటువు ఆవిసయములను చాలవఱకు చక్కగా వివరించు చున్నది :—

"సీ. నాలుగుమోములబాలునితో దనబొడ్డున బాలెంత పూవుదనర । అడుగు గెందామర బొడమిన తేనియ ముల్లోక ములమీద వెల్లిగొలుప । ఉరమున నున్న యిందిరచేతి కమ లంబు మెలగు తుమ్మెదల కామెతలు గొలుప । కరమున నొక మనోహరతరశంఖంబు పాలివోని నిండువెన్నెలలుగాయ । పాల మున్నీటికరుడు లుయ్యాలలూప । ముదురునాగువుపై గను

మోడ్చి యున్నవాని లోకంబు లేలెడు వరుసవాని। కనులు చల్లగ కనుగొంటి కమలనేత్రు.''

(చూ. 31 వ పటము)

విష్ణు నాభీకమల సంజాతుడగు బ్రహ్మకును, అతని సతీమణి, వీణాపాణి వాణికిని వాహనము హంస. (హగ్ంస). పడమటివారు దీనిని (Cygnus) అనుచున్నారు. సిగ్నస్ శబ్దము హగ్ంస శబ్దవికృతి. హంస ప్రశంస వేదములో పెక్కుచోట్ల గలదు. హంసచుక్కలు వీణకు తూర్పుగా మెఱయుచుండును. ఆ ప్రదేశము పాలసముద్ర ప్రాంతము; బ్రహ్మ తెలుపు; సరస్వతి సర్వశుక్ల. ఆమెకూడ తెలుపే. స్వతస్సిద్ధముగా ధవళ కాంతులతో తేజరిల్లు నాదంపతులకు హంస వాహనమగుట విశేషము. ఆ తెలిపిట్ట ధావళ్యము ఈ దంపతుల శోభను ఇంకను అతిశయింప చేయుచున్నది.

(చూ. 32 వ పటము)

ఈ యంశమునే ఉపమానముగా గైకొని వాగనుశాసనుడు, నన్నయభట్టారకుడు ద్యావాపృథివీ దంపతులకు శరత్కాలచంద్రికల మూలముగా శోభయతిశయించెనని, వర్ణించుచు నాచంద్రికల ధావళ్యము నీహంస ధావళ్యముతో చక్కగాపోల్చినాడు. ఆంధ్రమహాభారతము అరణ్య IV 143

ఉ॥ భూసతికిందిపంబునకు పోల్పనగంగ శరత్సమాగమం బా
సకల ప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో । పాసితరాజ
హంసగతి భాతి ప్రసన్న సరస్వతీకముజ్జ్వా । సన శోభితంబగుచు
నబ్జజుయానముతో సమానమై॥

మఱియు నీబ్రహ్మ - సరస్వతీ ధామమగు వీణామండ
లమునుండి వెడలిన మహానినాదమును ఆంధ్రకవితా పితామ
హుడు, అల్లసాని పెద్దనామాత్యుడు, మేరుపర్వత గుహాలనుండి
ప్రచండవాతూలహతిచే జనించు రొద తో పోల్చి, ముని
ముఖ్యులమధ్య పద్మాసనాసీనుడై మేరువువలెనున్న బ్రహ్మ
దేవుడుకృష్ణరాయలను విభవోజ్జ్వలుని గావించుగాక యని మను
చరిత్రలో నాశీర్వదించియున్నాడు. ఈ రొద యనుటలో
గొప్ప విశేషమున్నది. పెద్దన్న జ్యోతిశ్శాస్త్రరీత్యా
వైజ్ఞానిక దృష్టితో నీరొద శబ్దము గూర్పకపోవచ్చును గాని
భూగోళమున కెన్నో వెలుగు వత్సరముల దూరమందున్న
యీాసరస్వతీ - వీణామండల ప్రాంతములనుండి వెడలివచ్చు
నొకానొక ఝూంకార రొదను Cosmic Hiss, దూర
ఖగోళ జ్యోతిర్మండలముల నుండి వినదగు నొక శబ్దమును
జాన్‌స్కీ (Janskey), షార్ప్ (Sharp) మొదలగు
జ్యోతిశ్శాస్త్రవేత్తలు, వైజ్ఞానికోత్తములు విని బహువిధ
పరిశోధనలు చేసి తుదకు విశ్వమునకంతకును శబ్ద వ్యాప్తి
గావించు స్థానము ఈవీణామండలమున కలదని సిద్ధాంతము

చేసిరి. ఈస్థానమును వారు Celestial Broadcasting Station అనుచున్నారు. సున్నితములైన నేటి రేడియో శబ్దగ్రాహకులలో (Radio Receiving Sets) నీ వింత రొద బాగుగా వినవచ్చుచున్నది. ఇంకను పరిశోధనలు జరుగుకొలది నేమివిశేషములు బయల్పడునో ఎవరు చెప్పగలరు? ఇదివఱకు జరిగిన పరిశోధనలవలన నొక్కయంశము నిర్ధారణమైనది. మనబ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, వాణీ, దుర్గాది దేవతలు - వీరందరును మన పూర్వఋషులు కల్పించిన వ్యక్తులుగారు. ఊహమీద ఊహలల్లి భావనమీద భావనచేసి కవిత్వములు పన్ని కపటముచేసి చెప్పినమాయ దేవతలుకారు. (Scientific view) శాస్త్రదృష్టితో తెలిసికొని ఆమహనీయులిచ్చిన వాహన ధ్వజాదిసంజ్ఞావివరములతో నక్షత్రరూపమున నేటికిని జ్యోతిర్లోకములలో వారు కానవచ్చుచున్నారు. "అహోరాత్రే పార్శ్వే న క్ష త్రా ణి రూ ప మ్" అని శ్రుతి స్పష్టముగా తెలుపుచునే యున్నదికదా?

(చూ. 33 వ పటము)

సరస్వతి చేతిలో వీణకు కచ్ఛపమని పేరు. కచ్ఛపమనగా తాబేలు. వీణె అడుగుచుక్కలు తాబేలు ఆకారము కలిగియున్నవి. అరేబియాదేశములో (Alsufi) అల్ సుఫీ అను పేరుగల జ్యోతిర్విదుడు కూడ ఈవీణె చుక్కలలో తాబేలు రూపమును గమనించెను. ఈనాడు కూడ ఆదేశపు

వృద్ధవనితలు ఈవీణెచుక్కలలో ముక్కాలిపీట రూపమును పోలిన చుక్కలున్నవందురు. ఆదేశవ్యవహారములలో నివి ముక్కాలిపీట చుక్కలని తెలుపబడుచున్నవి ఈ నాటి పడమటి చదువులలో నారితేరితి మనుకొను మన దేశపు యువతీయుకులకు నక్షత్రవిజ్ఞానము శూన్యము. చదువురాని ముసలమ్మలకే చుక్కలనుగూర్చి బాగుగా తెలిసినట్లగ పడుచున్నది.

---

## 73 అభిజిన్నక్షత్రము

"బ్రహ్మలోకమభి జయేయమితి తదేతం బ్రహ్మణో భిజతే" అని మంత్రపాఠములలో కలదు. వీణామండలములో తుంబీఫలముండుచోట వెన్నముద్దవంటి తెల్లనిచుక్క కలదు. దానినే మనవారు 'అభిజిత్' అని చెప్పెదరు. పడమటిదేశముల వారా నక్షత్రమును 'వేగా' (Vega) అందురు. ఉత్తరాకాశపు తారలన్నిటిలో నది యత్యుజ్జ్వలమైనది. ఇంచుమించు మృగ వ్యాధరుద్రునంతటి తేజస్సుతో ప్రకాశించుచుండు నక్షత్ర మభిజిత్తు; అయ్యది మనసూర్యునికంటె ఏబదిరెట్లు ఎక్కువ ప్రకాశమానమైనది. ఆచుక్క వెలుగు మనకు చేరుటకు ఇరువది

యారు వెలుగువత్సరములగును. అభిజిన్నక్షత్రము బ్రహ్మ లోకమున నున్నది. బ్రహ్మలోకము విష్ణుమండలములోని భాగము.

---

## 74. సూర్యకుటుంబ గమ్యస్థానము

(The Apex of the Solar System)

చంద్రుడు భూమిచుట్టుతిరుగు చున్నాడు. భూమి ఇతర గ్రహములతోపాటు సూర్యునిచుట్టు తిరుగుచున్నది. సూర్యుడు తనలోతాను ఇరువదియారు దినములలో నొకసారి తిరుగుకొనుచున్నాడు. తనచుట్టు పరిభ్రమించు గ్రహములు, గ్రహాకణములు (Asteroids), ఉపగ్రహములు, ధూమ కేతువులు, ఉల్కలు మొదలగువానినెల్ల వెంటగొనుచు సూర్యుడు ఒకసెకెండుకు పంద్రెండు మైళ్ళు చొప్పున, నిమిటు నకు ఏడువందల యిరువదిమైళ్ళచొప్పున, గంటకు నలుబది మూడువేల రెండువందల మైళ్ళచొప్పున, దినమునకు పదిలక్షల మైళ్ళకుమించిన గంభీరవేగముతో ఉత్తరదిశాగతుడై, ఈయభి జిన్నక్షత్రము చెంతకు పోవుచున్నాడు. సూర్యునితోపాటు భూగోళమును, భూగోళవాసులమైన మనమును, ఈప్రయాణము

సాగించుచున్నాము. సక్రమముగా పోయినయెడల తుదకు మన గతి విష్ణుభగవానుని పరమపదమే కాగలదు. "యోసౌసర్వ గతో విష్ణుః" అను శ్రుతివాక్యము, భౌతికముగాను, జ్యోతి శ్శాస్త్రదృష్టిలోను కూడ గొప్పసత్యము; వైజ్ఞానికముగా యథార్థము. సూర్యకుటుంబమీ ప్రయాణమును దక్షిణము నుండి యుత్తరదిక్కునకు సాగించుచున్నది. సూర్యునితోపాటు మనము కూడ ఉత్తరదిక్కునే పొందుచున్నాము. తుదకు మనకు ఉత్తరమే గతి; విష్ణులోకమే ప్రాప్తిస్థానమునని వైజ్ఞానిక పరిశీలన విశదము చేయుచున్నది. దక్షిణదిశ గడిచి గతించిపోవుచున్నది. గతించిపోయిన దిక్కున కధిపతి యమ ధర్మరాజు. యమునికి దక్షిణాధిపత్యము నిర్ణయించినపుడే మనపూర్వఋషులు ఉత్తర దిశాప్రాముఖ్యమును గమనించి యుండిరి. కాబట్టి ఉత్తరాయనమే పుణ్యకాలమని భావింప నైనది. ఉత్తరదిక్కుగా కొంతమేరనైన ప్రవహించిన నదీనదములు ఉత్తరవాహినులు. ఉత్తరవాహినీ స్నాన మనంత పుణ్యప్రదము. ఉత్తరదిశాకాశమున ఖగోళమునకంతకును చక్షుస్సువలె మెఱయు విష్ణుభగవానుని పరమపద మున్నది. మహాభారతము. అరణ్యపర్వము 260-42లో ఆ పరమపదము ఇట్లు వర్ణితము:—

శ్లో॥ "బ్రహ్మణః సదనాదూర్ధ్వం తద్విష్ణోః పరమంపదమ్
శుద్ధం సనాతనం జ్యోతిః పరబ్రహ్మేతియంవిదుః"

---

# 75. విశ్వరూప సందర్శనయోగము

ఒక్క సూర్యకుటుంబమే కాదు, విశ్వమంతయు నీవిష్ణు స్థానమునుండియే ప్రాదుర్భవించినది; తుద కిందే లీనమగు చున్నది. భగవద్గీతలో విశ్వరూపసందర్శనయోగ మీయంశ మును చక్కగా విశదము చేయుచున్నది. భారతారంభము నందు ఏయే దేవతల యంశములం దెవ్వరెవ్వరు జనించిరో తెలుపబడినది. భారతయుద్ధమునందును, యుద్ధానంతరమునను ఆయా యోధులు పూర్వస్థానములను చేరుకొనిరి. నదులు వేవేగ ప్రవహించి, తుదకు సాగరమును చేరుకొని యందు లీనమై పోవుసట్లు భారతయోధులందరును లోకక్షయకారకు డును, కాలస్వరూపుడును, శ్రీకృష్ణావతారుడును నగు విష్ణుభగ వానుని స్థానము చేరుకొనుచున్నట్లు విశ్వరూపసందర్శన సమ యములో పాండవ మధ్యముడగు నర్జునునికి స్పష్టమయ్యెను. విశ్వప్రభుడగు విష్ణుడే కృష్ణుడని యప్పుడే విశదమయ్యెను. "సఏషభగవాన్ విష్ణుః కృష్ణేతి పరికీర్త్యతే అనాద్యంత మజం దేవం సర్వలోక నమస్కృతం."

విశేషించి కృష్ణుడువిశ్వరూపమునుసందర్శించినపుడు అర్జు నుడు చూచిన దేమి? చూచినదానికి నేటి జ్యోతిర్విజ్ఞానముతో సమన్వయము కుదురునా? అని పాఠకులు ప్రశ్నించవచ్చును. అర్జునుడు చూచినదంతయు నక్షత్రలోకములలో మనము కూడ

స్పష్టముగా చూడగలము ; సమన్వయము చక్కగా కుదిరి యున్నదని నిస్సందేహముగా చెప్పగలమని నావిన్నపము. విశ్వరూపమును సందర్శించి అర్జునుడు ఏమేమిచూచెనో ఇట్లు వర్ణింపఁబడినది :—

బ్రహ్మాణమీశం, కమలాసనస్థం ఋషీంశ్చ సర్వా నురగాంశ్చదివ్యాన్ -కి రీటినమ్ గదినమ్ చక్రిణంచ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్.

ఇందు కమలాసనస్థుడైన బ్రహ్మ జ్యోతిశ్శాస్త్రములో (Ring-Nebula in Lyra) గుండ్రని వెలిమబ్బు కమలముపై నున్నాడని మనవారు తెలిపిరి. అది పొడవు మిగిలిన పొందమ్మి పూవు; ఆపైని జంటచుక్కలునాలుగును చతుర్ముఖుడు. ఈజంట చుక్కలు ఎప్సిలాన్ అక్షర సంజ్ఞగల నక్షత్ర పరిసరములోనివి ఋషులు సప్తఋషులు. ఆప్రక్క బృహదృక్షములోని వారు. దివ్యసర్పము చక్కని పడగలతోనున్న శేషుడు- (Serpens) కిరీటము, గద, చక్రము లోనగునవి విష్ణుని అలంకారములు- ఆయుధములు - విష్ణుభగవానుని పరిసరమున నీరూపముగల నక్షత్రములున్నవి. వీనిని తెలిసికోవలెనని, చూడవలెనని సత్సంకల్పముకల వారందరును అర్జునుని వలెనే జ్యోతిర్లోకములో నక్షత్రరూపమున ప్రత్యక్షముగా నీదివ్యమూర్తులను సందర్శింపగలరు. ఇందులో మాయలేదు; మర్మములేదు;

పెద్దయంత్రసాహాయ్య మవసరములేదు; తదేకధ్యానముతో తపస్సు- అనగా దృఢసంకల్పముతో సూక్ష్మపరిశీలనము మాత్రము చేయవలసియున్నది- అప్పుడిది యంతయుస్పష్టముగా కనబడును.

---

# 76. 'శ్రవణ' మనబడు శ్రోణానక్షత్రము

(Auuila)

కృష్ణయజుర్వేదమున నియ్యది శ్రోణానక్షత్రమని చెప్పబడినది. తైత్తిరీయ బ్రాహ్మణ, మైత్రావరుణీయ సంహిత లందుకూడ నీనక్షత్రము శ్రోణానక్షత్రమనియే పేర్కొనబడినది. కాఠకసంహిత మాత్రము దీనిని 'అశ్వత్థ' మనుచున్నది. "మత్స్యాకారత్రయము" శ్రవణమని వరరుచి దీనిని వర్ణించినాడు. శ్రీనాథ కవిసార్వభౌముడు కాశీఖండములో వింధ్యపర్వతార్భాటసందర్భములో "శయుచింక నొకచోట శ్రవణనక్షత్రంబు గుంటిమీదటి ప్రత్తికొడుపువోలె" నని వర్ణించెను. అనగా వ్యవసాయము సాగించుగుడ్డమీద ప్రత్తి చేనిలో ప్రత్తికాయలు పేలినపుడు బయల్పడు తెల్లని ప్రత్తిభాగలనెడి కొడుపులవలె ధవళతేజముతో మెఱయు నక్షత్రములతోకూడి శ్రవణము వినువీధిని వడియుం[illegible]గుని యుప

మానము. ప్రతిచేనిలో కాయలుపగిలి మూడు కొడుపులు గాలికెగిరి యొకచోట చేరుకొని నిలిచిన ప్రకృతి దృశ్యము చూచినపుడు ఖగోళశ్రవణరూపమును శ్రీనాథుడెంత చక్కగా వర్ణించెనో మనకు బోధపడగలదు.

పడమటి ఖండములవారు శ్రవణనక్షత్రములను 'ఏక్విలా. (Aquila) అనుచున్నారు. ఆపదమున కర్థము గరుడపక్షి. ఋగ్వేదమునం దిది "సనుపర్ణో గరుత్మాన్" అని దివ్యముగా వర్ణించబడెను. ఇందుమధ్యచుక్క మిక్కిలి తేజోవంతమైనది. కాబట్టి పడమటివారు దీనిని 'అల్ఫా ఏక్విలా' అనుచుందురు. ఈచుక్క సూర్యునికంటె సుమారు తొమ్మిదిరెట్లు తేజోధిక మైనది. పదునారు వెలుగు వత్సరముల దూరమున నున్నది. మనసూర్యుడు, మృగవ్యాధుడు మొదలగు చుక్కల జట్టులో చేరినది.

గరుడుడు దేవదేవుని సింహాసనము ప్రక్క నెప్పుడును కనిపెట్టుకొని యుండునని గ్రీకుల గాథలున్నవి. ఆగాథలకు బహుకాలము పూర్వమునుండి మన వేదపురాణవాఙ్మయ మంతయు గరుడ ప్రశంసతో నిండియున్నది. శ్రవణముపై విష్ణుపదమున్నది. శ్రీమహావిష్ణువా పరమపదమున నున్నాడు. గరుడుడెప్పుడును ఆదేవదేవుని సమీపముననుండి ఆయనకు వాహనమును, ధ్వజమునుకూడ నైయున్నాడు. ఆంధ్రమహా భారతము ఆ॰ 106 లోని గరుడ విష్ణు సంవాద మీ విష

యమును విశదము చేయుచున్నది. శ్రీమన్నారాయణునకు నమస్కరించి గరుడుండిట్లనియె:— సీ॥ అమృతాశనంబు సేయక యును దేవనాకజరామరత్వంబు నందుటయును। అఖిలలోకంబుల కగ్రగాణినైన నీయుగ్రంబునందు నిన్నధికభక్తి। గొలుచుచు నునికియు గోరితి కరుణతో దయసేయు ముద్ధతదైత్యభేది। యన వుడు వానికి నభిమతంబులు ప్రీతుడై యిచ్చి హరియిట్టులనియె: నాకు నీవనఘవాహనంబవై మహాధ్వజమునై యుండు మనిన బక్షియును ప్రసాదమనుచు మ్రొక్కె"...

వృషభము పార్వతీపరమేశ్వరులకు వాహనము, ధ్వజమునైనట్లే విష్ణుదేవునకు గరుడుడు వాహనమును, ధ్వజమునై యున్నాడు. విష్ణునక్షత్రములుదయమైనపుడు గరుడుడు వాహనమగును; అస్తమించునపుడు ధ్వజమును కాగలడు. మంత్రపాఠములలో గరుడునిగూర్చి యీక్రింది శ్లోక మగపడుచున్నది. "శృణ్వంతి శ్రోణామమృతస్య గోపామ్ పుణ్యామస్యా ఉపశృణోమివాచమ్"

---

## 77. ఆకాశగంగ

(చూ. 34 వ పటము)

ఆర్ద్రానక్షత్రప్రశంస సంద మనమాకాశ గంగనుగూర్చి సంగ్రహముగా మేఘ

చ్ఛన్నముకాక ఆకాశము స్వచ్ఛముగా నిర్మలముగా కనబడు చున్నప్పుడు "నభోరమా వక్షోజ హార లతిక" యని చెప్పతగిన ఒకానొకధవళ దృశ్యము జ్యోతిర్లోకములో కాన వచ్చును. శేషమండల ప్రాంతము లందును, జ్యేష్ఠమూల నక్షత్ర ప్రాంతము లందును, ఈరంగముమిక్కిలి సాంద్రధవళమై గోచరించును. శ్రవణనక్షత్ర ప్రాంతమున ఖగకులాధిపుడు గరుత్మాను డీ క్షీరోదమును దాటుచున్నట్లు కనబడును. అటుపై నుత్తరదిశను వాణీహిరణ్య గర్భులవాహనమైన రాజ హంస కలదు. భూగోళఖగోళములందు హంస నీరక్షీరవిభా గము చేయుచున్నది. ఏలయన, హంసచుక్కలకు దక్షిణ ముగా దిగుననున్న సాంద్రతర ధవళదృశ్యమే మనవారి 'క్షీరో దము' దానికెగువ నుత్తరముగా పలుచగా తెలతెల్లగా తోచు నదియే ఆకాశగంగ. ఈగంగ విష్ణుపాదోద్భవి; శంకర శిరో భూషణము. మన కవీశ్వరు లీయంశముల నెంతో చక్కగా వర్ణించుచుందురు. అనంతామాత్యకవి భోజరాజీయము(7-28) లో నీయంశమిట్లు వర్ణించినాడు :—

చ॥ సరసిజనాభ! యో నిగమసన్నుత! నీచరణారవింద సుం
దరమకరందబిందువుగదా వియదాపగ? తజ్జలంబు శం
కరుడు శిరోవిభూ[illegible]ణముగా ధరియించె, బ్రియంబుతో,
సుధా
కరశక[illegible] కైవడి నొప్పగ తత్తటంబునన్!

విష్ణుపాదమునుండి వియద్గంగ జారి దిగువకు పడునప్పుడు ఆజలములుమిక్కిలికలఁగి స్పందించుచు నురఁగలుగ్రక్కుచుండును. ఈజలముల కల్లోలముడిపి శాంతమూర్తియైన హంస వానికి నెమ్మదినొసగును. హంసచేయు ఘనకార్యములు రెండు (1) నీర క్షీరవిభాగము చేయుట. దీనినే భర్తృహరి "గుంభసమున దుగ్ధజీవన విభాగ విధాననిరూఢనైపుణి" యని సొగసుగావర్ణించి నాఁడు. ఖగోళార్ధములో (Milk way), పాలసముద్రపు పాల కును (Celestial Ganges) ఆకాశగంగకును మధ్య నిలిచి వానివేరుచేయుట (2) ఆకాశగంగా జలపాతముయొక్క కల్లోల ముడిపి శాంతినెలకొల్పుట. ఈరెండవయంశమును ఋగ్వేద మీాక్రింది మంత్రములో కన్నులకు కట్టినట్లు వర్ణించుచున్నది:-

"బీభత్సూనాంసయుజం హంసమాహుః । అపాందివ్యా నాంసఖేచరంతం॥ ఈహంస మూలముగా కల్లోల ముడిగి యటుపై నెమ్మదిగాప్రవహించు నాకాశగంగను విష్ణుపురాణ మిట్లువర్ణించుచున్నది:- "ఇట్లు విష్ణుపాదాంగుష్ఠ నిర్మూత్యతి యును, త్రిలోకాధారభూతయు, సకలపాప నివారిణియును, దేవాంగనా విహారకారణయు నైన యాకాశగంగ నిర్భంగ తరంగ డోలాలోల మరాళజాలమై" ప్రవహించుచు నుత్తర దిఙ్ముఖముగా పోవుచుండును. ఈదివిజగంగాప్రవాహము తీర్చి దిద్దినట్లుగా సరిగావెడలదు. ఒకచోటవెడల్పుగాను, ఒకచోట సన్నముగాను, ఒకచోటలోతుగాను, ... మెరకగాను,



ఒకచోటకోరుచు, ఒకచోటలోగుచు, వంకరగ, టింకరగ, పోటెక్కుచు పాటుగనుచు. "చిన్నలై చిదపలై జాలై, తరంగంబులై" యనేకచిత్రవిచిత్రములతో ప్రవహించి ప్రవహించి తుదకు, ఈగంగాభవాని ఆర్ద్రారుద్రుని జటాజూటముపై చేరుకొనుచున్నది. విష్ణుపాదమున నుద్భవించుటయు, దివిజగంగ శివజటాజూటము చేరుకొనుటయు గంగోత్పత్తి, గంగావతరణము ననబడుచున్నది. దీనిసంపూర్ణదృశ్యము వైశాఖశుద్ధ సప్తమి నాటిరాత్రి తొలిజామున నగపడుచున్నది. అంతకుముందు ఈ 'గంగకు ప్రాదుర్భవ స్థానమైన' విష్ణుపాదము కనబడదు. ఆసప్తమి తరువాత ఆరుద్రనక్షత్రమస్తమించువఱకు గంగ విష్ణుపాదమున వెడలుట, ఈశ్వరజటాజూటము చేరుట అను నీరెండు దృశ్యములును ఖగోళమున ఏకకాలమున చక్కగా చూచుటకు నదుపాయమైన దినములలో ప్రథమదివసమున పంచాగకర్తలు గంగోత్పత్తియని వ్రాసిరి. ఆరుద్రకార్తె ప్రారంభమగువఱకు సాయంకాలనక్షత్రములలో నీదృశ్యము చూడగలము.

---

## 78. శ్రీ విష్ణుభగవానుని కుటుంబము ; పరివారము.

"మ॥ ధర సింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై । పర... మ్నాయము వెల్లవందిగణమై బ్రహ్మాండ

మాగారమై । సిరిభార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై । వరలు న్నీ ఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా" అని హృద్యముగా విష్ణుని స్తుతించు చాటు వున్నది. పైనపేర్కొన బడిన వారుగాక, విష్ణునికి మన్మథుడు రెండవ కుమారుడు, ఇంద్రుడు సోదరుడు నైయున్నారు. ఇక పరివార విషయములో, విష్ణుమూర్తి "శ్వసన, విహగప, అనంత, రుద్ర పరివృతుడని వాయుస్తుతి తెలుపుచున్నది. ఇందు శ్వసనుడు వాయుమూర్తి; విహగపుడు గరుత్మానుడు; అనంతు డాతని శేషపాను. మా మాధ్వాచార్య సాంప్రదాయ ప్రకారము భూతేశుడగు రుద్రుడుగూడ విష్ణుపరివారములో చేరినవిష్ణు భక్తుడు. ఈయంశములను సొగసుగా వర్ణించు శ్లోకములను, పద్యములను కొలదిగా చదువుదము.

శ్లో॥ లక్ష్మీర్యస్య పరిగ్రహః కమలభూస్సూను ర్గరుత్మాన్ రథః- పౌత్రశ్చంద్ర విభూషణఃసురగురుః శేషశ్చశయ్యాపునః బ్రహ్మాండం వరమందిరం సురగణాయస్య ప్రభోస్సేవకాః సఃత్రై లోక్యకుటుంబ పాలన పరా కుర్యాద్ధరిర్మంగళమ్॥ వాదిరాజు

శ్లో॥ యన్నాభీ సరసీరు హాంతరపుటే భృంగాయ మానో విధిః । యద్వక్షః కమలావిలాస వదనం యచ్చక్షుషీసీన్దినౌ (ఇంద్రు+ఇనౌ) యత్పాదాబ్జవినిస్సృతా సురనదీశ్శ మ్భోశ్శి రోభూషణమ్।యన్నామస్మరణం ధునోతిదురితం పాయాత్సనః కేశవః—

—కృష్ణకర్ణామృతము

సీ॥ పదపల్లవంబున ప్రకటిల్లు చదలేరు కడలెత్తిధాత్రి వెల్వాడిచిపార । కటియందురంజిల్లు కనకశాటి చెఱంగుగెళువులరేయెండ తళుకులీన । పాక్కిటనెత్తమ్మిపూవును మునకేదు నళులుఝుమ్మనుచు సంకులతదిరుగ । తులసీపలాశమంజులదామకంబులు కౌస్తుభపదకంబు గ్రందుపఱుప ।

—శ్రీనాధుడు

సీ॥ అడుగున ప్రభవించు ఆకాశగంగతో కటినందమగు పీతపటముతోడ। భూతప్రపంచంబు పుట్టించు శిశువుతోతనరారు నాభి పద్మంబుతోడ । పదునాల్గుజగములు భరియించు కుక్షితో సిరికివాస్పదమైన యురముతోడ । కన్నులదోలకాడు కరుణారసంబుతో సుప్రసన్నాననస్ఫూర్తితోడ । వైనతేయునెక్కి వర భూషణ ప్రభాజాల మెసగ శంఖచక్రకలిత । హస్తుడగుచు నభయహస్తంబు పొడచూపి నిలిచె దనుజసూదనుండు ప్రేమ.

—అనంతామాత్యుడు

(చూ. 35 వ పటము)

శ్లో॥ ఓదామోదర! యిందిరాయువతి విద్యుల్లేఖితో నూత్నఘం । ఛాదామత్రిదశేంద్ర కార్ముకముతో సవ్యాకర్ణా పాదృష్టితో । నీదేహంబను చాతకాంబుదము మన్నేత్రద్వయీచాతకా । హ్లాదంబుంబొనరించుగాక భవతాపటోపముం బాపుచున్.

—శ్రీనాధుడు

# 79. ఏకాదశులు

శ్రీవిష్ణుభగవానునికి మిక్కిలి ప్రీతికరమైన దిన మగుట చేత ఏకాదశీవాసరము హరివాసర మనబడుచున్నది. ప్రతిమాసములో పున్నమనుండికాని అమావాస్యనుండికాని లెక్కించినపుడు పదునొకండవ దినము ఏకాదశి యగును. ఆయా మాసములలో శుక్లపక్ష ఏకాదశినాడు విష్ణునక్షత్రములు ఖగోళమున మనకగపడు క్రమము ననుసరించి ఏకాదసులకు ప్రత్యేక నామము లేర్పడినవి.

(1) శయన ఏకాదశి:— ఆషాఢ శుక్లయేకాదశి నాడు సూర్యాస్తమానము కాగానే విష్ణుభగవానుడు ఉత్తరాకాశమున చక్కగా శయనించినట్లగపడును. కాబట్టి యీయేకాదశి 'శయనఏకాదశి'అనబడుచున్నది. చాతుర్మాస్యనియమము లీనాటినుండి ప్రారంభింతురు. ఆనాలుగు నెలలలో నీ యేకాదశి మొదటిదగుటచేత దీనిని 'తొలియేకాదశి' అనిగూడ చెప్పుచుందురు.

(2) పరివర్తన ఏకాదశి:— స్వాతినుండి శ్రవణము వఱకు బహుదూరము వ్యాప్తము కావున విష్ణుస్థానము మరి రెండు నెలలకుగాని సాయంకాలమస్తమించుట జరుగనేరదు. భాద్రపదశుద్ధ ఏకాదశినాటికిగాని విష్ణువు పడమట నస్తమింపనారంభింపడు. ఆనాటినుండి క్రమముగా అంతర్హితుడగు

చుండును. కావునను, మరిరెండు నెలలనాటికి తూర్పున సూర్యోదయా త్పూర్వము ఉదయమగుటకు ప్రారంభించును కావునను, ఈమార్పును బట్టి భాద్రపదశుక్ల యేకాదశికి 'పరివర్తన ఏకాదశి' యనిపేరు వచ్చినది. పరివర్తన యనగా మార్పు - ప్రక్కమారుట - దిశమారుట - పడమట నస్తమించి తూర్పున లేచుటకుముందు దిక్కు మార్చుట యని యర్థము. నిద్రలో మనుష్యులు మొదట నొకప్రక్కపండుకొని తరువాత మరొక వైపునకు తిరుగుదురు. ఈతిరుగుటనే 'ఒత్తిగిల్లుట' యందురు. భగవంతుడుకూడ నిద్రలో ఒత్తిగిలి దిశమార్చి క్రమముగా తూర్పున నుదయము కాగలడు. కావున నిది పరివర్తన యేకాదశి యనబడుచున్నది.

(3) బోధన ఏకాదశి :— విష్ణుమూర్తి పడమటనుండి రెండు నెలల కాలము పరివర్తనలోనుండి, పిమ్మట దిశమార్చి కార్తికశుక్ల ఏకాదశినాడు సూర్యోదయా త్పూర్వము తూర్పున మొదట పొడచూపును. ఆనాడు ఆదేవదేవుడు నిద్రనుండి మేల్కొని లేచినట్లు భక్తులు భావింతురు. కాబట్టి కార్తిశుద్ధ ఏకాదశి "ఉత్థాన ఏకాదశి" "బోధన ఏకాదశి" యనబడుచున్నది.

(చూ. 36 వ పటము)

(4) మధ్యనాగులచవుతి :— బోధన ఏకాదశికి ముందు వారము రోజులలో విశిష్ట దినమొకటిగలదు. దానిని

కూడ మన మీా సందర్భమున జ్యోతిశ్శాస్త్రదృష్ట్యా చర్చించి తెలిసికోవలెను. విష్ణువు శేషశాయి. బోధన ఏకాదశినాడు సూర్యోదయాత్పూర్వము విష్ణుదేవుని శిరోనక్షత్రములను గమనింపక పూర్వము శేషుని ఫణములను మనము ముందు చూడవలయునుగదా? ఆయేకాదశికి వారముదినముల ముందు కార్తికశుద్ధ చవుతినాడు సూర్యోదయా త్పూర్వము విష్ణుని "మడుగుపానుపు" శేషుని పడగ లనదగు చుక్కలను చక్కగా చూడగలము. శేషభోగీంద్రుని ఫణములను సూర్యోదయాత్పూర్వము తొలిసారి సందర్శించిన పవిత్ర దివసమును మనవారు 'నాగులచవుతి' యందురు. ఆనాడు మన స్త్రీలు నాగమయ్యను పూజించి, 'నాగులగావంచా' ను సమర్పించి, పుట్టలో పాలుపోసి, చలిమిడి చిమ్మిలిముద్దలను నైవేద్యము చేతురు. పాముపడగలచుక్కలు తొలిసారి ప్రొద్దుట కనబడిన దినమున మనస్త్రీలు ఎక్కడెక్కడి పాములపుట్టలను వెదకి ఆపుట్టలలో పాములకు పాలు పోయుదురు. కొందరు స్త్రీలు ఉపవాసములుకూడ చేయుదురు. ఈవిధముగా నాగపూజ బహుపురాతన కాలమునుండి మన తెనుగునాట విశేషముగా వ్యాపించియున్నది.

ఈచవుతి తరువాత వారముదినములకే బోధన ఏకాదశి రాగలదు. అయేకాదశినిగూర్చి శేషధర్మములోని యీాక్రింది శ్లోకములు చదువతగినవి :—

శ్లో॥ ఏకాదశ్యాంశుక్లపక్షే హ్యాషాఢస్యసురోత్తమః
స్వమాయయా పవిత్రాంగ్యానిద్ర యానర్తితేప్రభుః
ప్రసన్నమూర్తిర్భగవాన్ కార్తిక్యాంభవతిప్రభుః
తస్యప్రసన్నదివస ముత్థానాఖ్యం విదుర్బుధః
ఉత్థితే దేవదేవే శేషపర్యంకశాయినే
పూజయేత్తం ప్రయత్నేన పూజాభిస్తత్పరంవ్రజేత్.

ఇట్లు కార్తికశుద్ధచవుతినాడు నాగపూజయు, నేకాదశి నాడువిశేషించి విష్ణుపూజయు జరుపుచుండుటకు కారణము 'ప్రాతర్యావాణా ప్రథమాయజధ్వ' మను ఋగ్వేదశ్రుతి ప్రమాణమే. బోధనైకాదశినాడు అప్పుడేనిద్ర మేల్కనిన విష్ణుభగవానుని దివ్యమూర్తి మనకన్నులకుకట్టినట్లు శ్రీనాథ కవి సార్వభౌముడు కాశీఖండములోని యీక్రింది పద్యమున వర్ణించెను.

సీ॥ అభినవోన్మేషచిహ్నంబైన తొలిచూపు కౌస్తుభాలోకరేఖలకు నలగ । సాంగభంగంబైన యావులింతకు వేళ్ళు లంగుళీస్ఫోటంబులాచరింప । సాఖశాయినికుతై సంవర్తభృగ్వాది మునులు హస్తాంభోజములు మొగడ్ప । ధృతచేతనంబులై దివ్యాయుధంబులు జయజయధ్వనులతో సంస్తుతింప । కలువరేకులువోని పెంజీలువతేని । యరటికుబుసంబుపొరలు నైనంటి యాడ । నిదురమేల్కాంచి కూర్చుండెను దధినదుచు । విష్ణుడఖిలేశ్వరుడు శరద్వేళయందు.

(4) భగవద్గీత ఏకాదశి:- కార్తికశుక్లయేకాదశి తరువాత నెలనాటికి మార్గశిరశుక్లఏకాదశి రాగలదు. ఆనాటి సూర్యోదయాత్పూర్వము విష్ణుదేవుని ఊరువులు, పాదములు తప్ప ఊర్ధ్వదేహమంతయు పూర్తిగా కనబడును. ఈయేకాదశినాడే అర్జునునికి కృష్ణుడు భగవద్గీత ఉపదేశించెనని జనశ్రుతి. జ్యోతిశ్శాస్త్రరీత్యా ఈవాక్యముసత్యమని ఋజువగుచున్నది. శ్రీకృష్ణుడు పార్థసారథియై భగవద్గీత అర్జునుని కుపదేశము చేసెను. రథసారథియొక్క దేహమునందలి యూర్ధ్వభాగమే ముఖ్యముగా చూపరుల కగపడును; వాని చరణములును, ఊరువులును కనబడవు. సూర్యుని రథసారథి అనూరుడు. వానికి ఊరువులసలు లేనేలేవు కనుక 'అనూరు' డైనాడు. పార్థసారథియైన శ్రీకృష్ణునికి ఊరువులు, చరణములు ఉన్నవి; కాని మార్గశిర శుక్లఏకాదశినాటికి అవియింకను తూర్పున నుదయము కావు; దృష్టిగోచరములు కావు; ఊర్ధ్వభాగమంతయు పూర్తిగా కనబడును. కాబట్టి భగవద్గీతోపదేశకర్త విభూతి యోగములో "మాసానామ్ మార్గశీర్షోహమ్" అనిబహుసాభిప్రాయముగా — సారథిరూపమే తానని జ్యోతిర్విజ్ఞాన దృష్ట్యా యదార్థము నిర్వచించినాడు. కావున నీ యేకాదశి 'భగవద్గీదోపదేశము' జరిగిన 'యేకాదశి' యనియు, సంగ్రహముగా 'భగద్గీతయేకాదశి' యనియుచెప్పుట ఎంతయు ఒప్పియున్నది. భగవద్గీతలో పదునొకండవ అధ్యాయము విశ్వరూపసందర్శన యోగమగుటయు, అదిమార్గశిరశుక్ల యేకా

దశినాడు పార్థునియెదుట ప్రదర్శింపబడుటయు, గమనింపతగిన విశేషములు.

(5) వై కుం ఠ - ఏ కా ద శి:- మార్గశిరశుక్ల - ఏకాదశి పిమ్మటనెలకు పుష్యశుక్లఏకాదశి రాగలదు. ఈఏకాదశినే వైకుంఠఏకాదశి యందురు. ఆనాటియుదయమున, సూర్యోదయాత్పూర్వము నక్షత్రరూపుడగు విష్ణుదేవుని పూర్తి స్వరూపము- ఆపాదమస్తకమును- సందర్శింపగలుగుదుము, ఆనాడు వైకుంఠపురములో గల నాలుగు దిక్కుల గోపురముల ద్వారములు పూర్తిగా తెరువబడునని వైష్ణవజనుల విశ్వాసము. శ్రీరంగము, పండరీపురము మొదలగు గొప్ప విష్ణు క్షేత్రములలోనేగాక, కుగ్రామములందున్న వైష్ణవాలయములలో కూడ ఆనాడు విశేషపూజలు ప్రత్యేకభజనలు మహా వైభవముతో జరుగుదురు.

(చూ. 37 వ పటము)

(6) భీ ష్మ - ఏ కా ద శి:- వైకుంఠ ఏకాదశి తరువాత నెలకు వచ్చునది మాఘశుక్ల-ఏకాదశి. దానినే 'భీష్మఏకాదశి' అందురు. భీష్ముడు అష్టవసువులలోనొకడు. ధనిష్ఠయనబడెడు శ్రవిష్ఠకధిదేవతలు వసువులు. వసుదేవతాత్మకమైన ధనిష్ఠ సూర్యునితో కూడియున్న దినము లవి- ఆనాడు- మాఘశుక్ల- ఏకాదశినాడు- సూర్యుడుత్తరాయన గతుడగుచుండెను. కావున భీష్ముడు పరమపదము చేరుకొనిన పుణ్యదిన మగుట

చేత మాఘశుక్ల - ఏకాదశి, భీష్మఏకాదశి యనుట సమంజసము. మాఘమాసమును గూర్చియు ధనిష్ఠ నక్షత్రములను గూర్చియు మరికొన్ని వివరములు ఈదిగువ ధనిష్ఠను గూర్చిన చర్చలో తెలిసికొందము.

(౭) ఫాల్గున శుద్ధ - ఏకాదశి :— ఈయేకాదశి రాత్రి అర్థరాత్రమునకే భగవద్దర్శనము కాగలదు. జనసామాన్య దృష్టిలో ఇప్పటికి భగవంతునికి "వివాహయోగ్యమైనవయస్సు" వచ్చియున్నది కనుక శ్రీకూర్మము, ఉపమాక, వాడపల్లి లోనగు పుణ్యక్షేత్రములలో దేవుని కళ్యాణము ఈ రాత్రి జరిపింతురు —

(౮) చైత్రశుక్ల - ఏకాదశి :—కొన్నిచోట్ల స్వామి కల్యాణమును చైత్రమాసములో జరుపుదురు- చైత్రశుద్ధ నవమి శ్రీరామనవమి- శ్రీరామునిజన్మదినము, ఈ నవమి నాడే కొందరును, ఏకాదశినాడు కొందరును భక్తిప్రపత్తులతో సీ కల్యాణమహోత్సవములను జరుపుదురు.

(9) వైశాఖ శుక్ల ఏకాదశి :— ఫాల్గున చైత్ర మాసములలో జరుగనిచోట్ల వైశాఖశుక్ల ఏకాదశినాడు దేవుని కల్యాణము జరిపించుట కలదు. అన్నవరములో సత్యనారాయణస్వామి కల్యాణము వైశాఖశుక్ల ఏకాదశినాడే జరుగును. వైశాఖమునకు రాధామాసము, మాధవమాసము నను నామములుగలవు. ఆమాసములో పూర్వాస్తమాసము కాగానే రాధామాధవులు-విశాఖన [illegible] శుద్ధైన విష్ణు

మూర్తి, నక్షత్రరూపమున ఖగోళమున రాత్రియెల్ల మెఱయు చుండును. జ్యేష్ఠమాసమున త్రివిక్రమునిగా విష్ణుదేవుని పూజలు జరుగును. ఆషాఢ మాసమున మరల శయన ఏకాదశి వచ్చుచుండును. "ఏవం ప్రవర్తితం చక్రమ్" అనునట్లు సంవత్సరము పొడుగునను ఈహరివాసరచక్రమిట్లే ప్రవర్తిల్లు చుండును. ఇయ్యది "తారంతారకమండలోపరి లసజ్జ్యోతి స్ఫురత్తారకాతీత" మైనదని ఆదిశంకరులు వర్ణించిరి.

---

# 80. ధనిష్ఠ

వేదవాఙ్మయమునందీ నక్షత్రము 'శ్రవిష్ఠా' యని పేర్కొనబడినది. "శీర్ష త్రయమ్" శిరస్సువంటి యాకారముగల మూడు చుక్కలు ధనిష్ఠ యగునని వరరుచి చేసిన వర్ణన సరిగా నున్నట్లు కనబడలేదు. మద్దెలవంటి ఆకారముగల ఎనిమిది చుక్కలు ధనిష్ఠయని లోకవ్యవహారముగలదు. ఆవర్ణనయే ధనిష్ఠకు సరిపడునట్లు తోచుచున్నది. ధనిష్ఠకు అధిదేవతలు వసువులు. వారెనమండుగురు. అందు భీష్ముడొకడు. భీష్ముని లక్షణములు ధనిష్ఠలో గోచరించుచున్నవి. ఇట్లనుటకు ఈక్రింద నుదహ[illegible]రణములు పరిశీలింపతగును.

(1) భీష్ముడు బ్రహ్మచారి ఖగోళార్థములో బ్రహ్మచారి యనగానేమి? కన్యకును, మిథునమునకును దూరమైనవాడు బ్రహ్మచారి యగును. చిత్రనక్షత్రములు రెండు పాదముల వఱకు కన్యారాశికదా? అటనుండి స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, గడచిన తరువాత తొమ్మిదవయిల్లు ధనిష్ఠ - భీష్ముడు; ధనిష్ఠ నుండి, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర రేవతి, అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి ఎనిమిదియిండ్లు దాటి తొమ్మిదవదగు మృగశిరలో రెండుపాదములైన తరువాత మిథునము. ఇట్లు కన్యకును, మిథునమునకునుకూడ బహు దూరమందున్న భీష్ముడు బ్రహ్మచారిగాక మరేమి కావలయును?

(2) భీష్ముడు తాలధ్వజుడు-తాటిచెట్టు ధ్వజముగాగలవాడు. ఏమి? భీష్మునికి తాటిచెట్టుతప్ప మరొకధ్వజ మేదియు దొరకలేదా? లేదు. లేదనియే జవాబు చెప్పవలెను. ఏమనగా ధనిష్ఠకు పైనున్నది కుంభరాశి కుంభము వరుణ దైవత్యము. వరుణసంజాత వారుణి అనగా కల్లు. కల్లు తాటిచెట్లనుండి తీయుదురు. వారుణికి చిహ్నము తాటిచెట్టు. కనుక భీష్ముడు తాలధ్వజుడు కాకతప్పినదికాదు. భీష్ముని తాలధ్వజమును గూర్చి ఉత్తరగోగ్రహణ సందర్భమున తెలిసికొంటిమి.

(3) అర్జునుడు భీష్మునిప్రత్యక్షముగా నెదుర్కొని పోరి పడద్రోయలేదు. గాండీవమును తనవి... చేత ముట్టించి



ఓరగా దొంగదెబ్బలుకొట్టి పడద్రోయగల్గెను. భీష్ముడు-(ధనిష్ఠ) అర్జునునికి - (ఉత్తరఫల్గునికి) పదునొకండవ యింటి వాడుకాని ఎట్టయెదుట (Diametrically opposite) ప్రతి కాడు. కాబట్టి అర్జునుడు ఓరగానిలిచి, దొంగ దెబ్బలు ప భీష్ముని పడగూల్చెను కాని ప్రత్యక్షముగా ఎదుట ధర్మయుద్ధముచేసి చంపలేదు.

(4) పడినవెంటనే భీష్ముడు మరణమునొందలేదు. కొంత కాలము శరతల్పముపైనుండి, ఉత్తరాయణ పుణ్యకాలము కొఱకు నిరీక్షించెను. మాఘశుక్లములో ఉత్తరాయణము రాగానే ఏకాదశినాడు పరమపదమునొందెను. ఆనాటికి ధనిష్ట కార్తె ప్రవేశమగును. కావున నాదినములలో ఖగోళములో ధనిష్ఠ కానరాదు.

---

## 81. "మాఘమాసే గవామివ"

భారతీయుద్ధము జరుగుచున్నపుడు, భీష్ముని పదవనాటి సమరసందర్భములో శిఖండిచేత ముట్టించి అర్జునుడే బాణ ప్రయోగముచేసి భీష్ముని వేధించుచుండెను. ఒకప్పుడు స్త్రీగా నుండి పిమ్మట పురుషుడైన శిఖండిని ఎల్లప్పుడు స్త్రీగానేభావించి ధర్మయుద్ధనిపుణుడగు భీష్ముడు శిఖండితో పోరలేదు — ఆనంక కన్నెత్తిచూడ లేదు. ఈమిషమీద అర్జునుడు

శిఖండిని తనరథముపై నెక్కించుకొని తానుప్రయోగించు ఘోరాస్త్రములు శిఖండిచేత ముట్టించి భీష్మునిపై నేయు చుండెను. ఈకుత్సితమునెఱిగి, నాడు భీష్ముడిట్లనెను. "అర్జునస్య ఇమే బాణా నేమే బాణాశ్శిఖండినః। కృదంతిమమగాత్రాణి మాఘమాసే గవామివ" భీష్మ 170-64. ఇవి యర్జునుని బాణములేకాని శిఖండి బాణములుకావు. మాఘమాసము గోవులను యాతనబెట్టునట్లే ఈశరములు నన్నుయమయాతన బెట్టుచున్నవి" అని భీష్ముడు తెలిపియున్నాడు. సంవత్సరము పొడుగునను అన్నిమాసములలో కంటె మాఘమాసమునందు గోవులు అధికసంఖ్యలు మరణమునొందును. చావక మిగిలినవి చచ్చినంతబాధపడును. ఈయంశము ద్రోణపర్వములో నిట్లు స్పష్టముగా తెలుపబడినది. ద్రోణుని దివ్యాస్త్రములచే పాండవ సైన్యము మిక్కిలి పీడింపబడె ననుటకు "శిశిరేకంపమాననై కృశాగావ ఇవప్రభో" అను నుపమానము కూర్పబడినది. మాఘఫాల్గునములు శిశిరఋతువు. ఈఋతువులో బాధలకు తాళజాలక కంపించిపోవుచు కృశించుగోవులవలె ద్రోణునిపరాక్రమమున కోర్వక పాండవసేన కంపించికృశించెనని నాటి యుద్ధమునందు వర్ణింపబడెను. మాఘమాసపు చలి 'పులి' వలెపీడింపగా దానికితట్టుకోలేక గోగణము మరణించును. అదియునుగాక ఈమాఘమాసములోనే పశువులకు 'గాళ్లు' అను జబ్బులుతగిలి వాటిని మిక్కిలిబాధించును. ప్రకృతిలో మాఘమాసము గోవులకుమిక్కిలి ప్రతికూలమైన మాసము. ప్రకృతి

కంటెను మానవుడాదినములలో గోవులయెడమిక్కిలి క్రౌర్యము వహించెడివాడు. ఋగ్వేదకాలమువాడు మనుజులు మాఘ మాసములోగోవులను చంపి గోమాంసముతో ఊరుగాయలు ఉప్పుకాయలు ఇటువంటి భోజ్యములను తయారుచేసి యుంచు కొని ఫాల్గునమాసములో పెండ్లిండ్లు చేసికొనుచుండిరి. చూ. ఋగ్వేదము X 85-13 "అఘాసుగావో జిఘ్నంతే అర్జున్యోః పర్యుహ్యాతే". పుష్యమాసములో పంటలునూర్చుకొని గింజ లింటికి నడిపినతరువాత ఆనాటికర్షకులకు మాఘమాసములో పశువుల అవసరమంత కనబడకుండెను. తొలకరించిన తరువాత నెమ్మదిగా చూచుకోవచ్చునని యానాటివారు ముందు శిశిర ఋతువులో పశుహింసచేసి యామాంసము నుప్పులో ఊరవేసి విశేషముగా తినుచుండిరి. ఈదురాచార మాతరువాత మంద గించినది. బుద్ధభగవానుని బోధనల మూలముగా నశించి పోయినది.

ఇక ఖగోళము పరిశీలించిచూడగా, ధనిష్ఠ ప్రాంతము గోవీథి, గోలోక మనబడుచున్నదని ఉత్తరగోగ్రహణ సందర్భ మున తెలిసికొంటిమి. చీనావారు కూడ ఈప్రాంతములో నక్షత్రరూపముపైన పశువులను గమనించిరి. ఇప్పటికి సుమారు రెండువేల ఐదువందల సంవత్సరములు క్రిందట చీనాలో నుండిన (Confucious) కన్ఫ్యూషియస్ నామకు డగు మహావిద్వాంసుడు చెప్పినమాట ఇంగ్లీషులోని కనువ దింపబడినవి :—

' Brilliant show the draught - oxen

But they do not serve to draw our carts "

అనగా గోవీధిలోని పశువులు మంచికాంతితో దివ్యముగా ప్రకాశించుచున్నవి. కాని (ఖగోళస్థనుగుట చేత) అవి భూమి మీూద మనబండ్లకు పూన్చి కట్టుకొంకమన్న నందుబాటులో లేకున్నవని అర్థము. శ్రవణధనిష్ఠ శతభిషములు మూడును కూడి జారద్గవవీధియని మత్స్యపురాణమునందు గలదు. జారద్గవ మనగా ముసలి యెద్దు అని యర్థము.

వీటి కంటె ఋగ్వేదములోనే దివ్యమైన ప్రమాణము గలదు. శ్రీ విష్ణుభగవానుని పరమపదనిరూపణము చేయుచు, యత్రగావోభూరిశృంగా అయాసః" పెద్ద కొమ్ములుగల గోగణము ఎక్కడనున్నదో- ఆప్రక్కనే ఆదేవదేవుని పరమపదము కలదని స్పష్టముగా వేదము తెలుపుచున్నది. ధనిష్ఠకాన్తిలో ఈగోగణము కానరాదు. కాబట్టి, మహాజ్ఞానియుఁ సమస్త ధర్మముల నెఱిగిన వృద్ధుడు నైన భీష్ముడు, భూగోళ ఖగోళ విశేషములను బాగుగా గమనించి, ఎంతో సాభిప్రాయముగా తన యాతనను "మాఘమాసే గవామివా" అని యుపమించిపలుకు టెంతయు సమంజసము.

ఈ శ్లోకపాదమును మాఘమా+సేగవా+ఇవ-అని మూడుముక్కలక్రింద విరిచి, చమత్కారముగా మరొక అర్థమును కొందరు తెలుపుచున్నారు. మాఘమా=కర్కటి,

ఎంగ్రడియొక్క, సేగవా=సంతానము గర్భమునుండి వెడలి పైకి వచ్చునపుడు ఈనుచున్న తల్లికి గలుగు ప్రసవసమయ యాతన, ఇవ=వలె, దుస్సహమైన బాధను అర్జునుని బాణములు భీష్మునికి కలిగించెనని వీరియర్థవివరణము. కవి బ్రహ్మ తిక్కనసోమయాజి కూడ ఈరెండవ తెగలో చేరి కర్కటి యర్థమునే గ్రహించి, 'అర్జునస్యఇమే బాణా' శ్లోకమును ఇట్లు తెనిగించినాడు :—చూ- భీష్మ 405.

సీ॥ 'అశని కల్పములివి యర్జునుబాణముల్ గాని శిఖండివి గావు సుమ్ము.... కర్కటిగర్భముకరణి గాత్రముప్రవచ్చె... జముదూతలట్లు ప్రాణములు వేలార్పంగ "శిఖండి" యెన్న డేసె?...

ఈకర్కటి యుపమానము ఖగోళదృష్టితో నన్వయింతము. ఖగోళములో ధనిష్ఠకు కర్కటము ప్రతిస్పర్థి. ధనిష్ఠ అస్తమించువేళకు కర్కటకము ఉదయించును; కావున నస్తమింప నైయున్న భీష్మునికి ఎట్టయెదుట కర్కటకము తోచినను తోచవచ్చును. కాబట్టి ఈయర్థమును ఒకవిధముగా సరిపెట్టుకోనచ్చును. కాని యొకభేదము గమనింపతగి యున్నది. ఈనుచున్న కర్కటియాతన దానిగర్భములోనుండి సంతానము పైకి వెడలివచ్చుటచే కలిగినది. భీష్ముని కన్ననో అర్జునుడు పైనుండి ప్రయోగించిన బాణములు తన శరీరము.

భేదించుకొని లోపలచొచ్చి కలిగించుచున్న దారుణయాతన. మాఘమాసములో గోవులకు కలుగుబాధ బాహ్యప్రకృతి వలనను, మానవుల క్రౌర్యము వలనను కలుగుచున్నది. అంతే కాని కర్కటి ప్రసవవేదనవలె గర్భములోపలినుండి సంతానము బైటకువెడలుటచే కలిగినదికాదు. కాబట్టి, కర్కటియర్థము ప్రస్తుతముకాదు; ఉచితముకూడ కాదని తోచుచున్నది. గోయాతననుగూర్చిన యుపమానము ఉచితము ప్రస్తుతమునని రూఢియగుచున్నది.

విశేషించి శాంతిపర్వము 139-38 శ్లోకములో కూడ "మాఘమాసేగవామివ" అను నుపమానము కనబడుచున్నది. శ్లో॥ "గృహాస్నేహావబద్ధానాం నరాణామల్పమేధసామ్ । కుస్త్రీఖాదతిమాంసాని మాఘమాసేగవామివ ". "మాఘమాసము గోవులను తినివేసినట్లే దుష్టస్త్రీ మందబుద్ధిగలిగి తనకువశుడైన మనుష్యుని కొరకి తినివేయును ". ఈశ్లోకము నన్వయించుటలో కర్కటి ప్రసవేదన సంబంధమైన యుపమానము ఎంతమాత్రమును వర్తించదు.

ఈసందర్భము లన్నియు జాగ్రత్తగా గమనించి విమర్శించినచో శ్లో॥ "అర్జునస్యఇమేబాణా" శ్లోకమునందలి "మాఘమాసేగవామివ" అను రచనకు కర్కటి యుపమానము చెప్పి అన్వయించుటకంటె, గోహింసాత్మకమైన

యర్థము తెలుపు నుపమానము గ్రహించి అన్వయించుట మేలని విన్నవించుచు ఇంతటితో ఈచర్చ చాలించి ఉత్త రాంశము నందుకొనుచున్నాను.

---

# 82. శతభిషము - గజేంద్రమోక్షము

వేదగ్రంథములందంతటను ఇది 'శతభిషజ్' అని చెప్ప బడినది. వరరుచి 'శతతార' - ఇది "నూరునక్షత్రములగుంపు" అని తెలిపెను. కాళిదాసు "మండలాభశతతారకాకృతైః" అని దీనిని వివరించెను. దీనికధిదేవత వరుణుడు. ఈవరుణ దేవునికి వాహనము మకరమని ఇటీవలి గ్రంథములు తెలుపు చున్నవి. ఉత్తరాషాఢ మూడుపాదములు+శ్రవణము+ధనిష్ఠ రెండు పాదములు; ఇవన్నియు చేరి మకరరాశి యగును. ఈమకరముపైని శతభిషనక్షత్రమున కధిదేవతయై వరుణు డున్నాడు, గాన నిది వరుణునికి వాహనమనదగును. మకరము ధనుర్ధారియగు మన్మధునిపై నుండుటచేత మన్మధుడు మకర ధ్వజుడన బడునని ధనస్సురాశిచర్యలో తెలిసికొంటిమి. కాబట్టి యీరాశిమకరము మన్మధునికి ధ్వజమును; వరుణునికి వాహ నమును అయియున్నది. అంతేకాదు మనదేశములో నాబాలగోపాలము నతిభక్తితో పఠించు గజేంద్రమోక్షణ

కథలో గజేంద్రునిపట్టిపల్లార్చిన మకరముకూడ ఈరాశి మకరమే యని స్పష్టముకాగలదు. సంస్కృత భాగవతము నుండి యీకథను తెనిగించిన బమ్మెర పోతరాజుగారు

సీ॥ "రాజేంద్ర వినుసుధారాశిలో నొక పర్వతము త్రికూటంబన దనరు చుండు యోజనాయుతమగు నున్నతత్వంబును నంతియ వెడలుపు నతిశయిల్లు" ...నని యేమేమో వ్రాసినారు. కాని యొకముఖ్యవిషయము నెందుచేతనోగాని చల్లగా జారవిడిచినారు. అదేమనగా :— "తస్యద్రోణ్యాంభగవతో వరుణస్యమహాత్మనః" అని సంస్కృత గజేంద్ర మోక్షకథా మూలమున నున్నది- అనగా త్రికూట పర్వతసానువు మీద వరుణదేవుడు నివసించుచున్నాడని యర్థము- పోతరాజుగారి తెనుగు గజేంద్రమోక్షములో నీవాక్యార్థము విడిచి పెట్టబడినది- త్రికూటపర్వతముపై వరుణుడును, దిగువ సరస్సులో అతని వాహనమైన మొసలియు నున్నట్లు స్పష్టము. ఆమకరమే శాపవశమున నేనుగు రూపముననుండి ఆసరస్సులో నీరు త్రాగ వచ్చిన ఇంద్రద్యుమ్నుని పట్టి ఘోరముగా పీడించినది- ఇంద్రద్యుమ్నుడేల యేనుగు కావలసివచ్చెనో తెలిసికొందము-అగస్త్యుడను మహాఋషి తపస్సుచేసికొనుచున్న ఇంద్రద్యుమ్నుని కడకు వచ్చెను. ఇంద్రద్యుమ్నుడు లేచి అర్ఘ్యపాద్యము లిచ్చి అగస్త్యునిపూజింపలేదు. భగవధ్యాన పరాయణుడై నృపాలుడు అగస్త్యుని రాకగమనించనేలేదు. జ్యోతిశ్శాస్త్రార్థములో

అగస్త్యనక్షత్రము (Canopus) ఉదయమగువేళకు ఇంద్రద్యుమ్నుడు ఉదయించలేదు. అందుకు కోపించి అగస్త్యుడింద్రద్యుమ్నుని ఏనుగుకావలెనని శపించెను. అనగా ఏనుగు రూపము ధరించి సింహరాసికెదురుగా పడియుండుమనిశాపము. ఈశాపప్రకారము ఇంద్రద్యుమ్నుడేనుగై యుండి మకరముచే పీడింపబడెను. తుదకు, విష్ణుదేవుని చక్రము ఆ మకరిశిరస్సు ఖండించెను. మకరము సూర్యునిచేరెను. ఇంద్రద్యుమ్నుడు "విష్ణురూపుడై వెలుగుచున్నాడు."

ఇంద్రద్యుమ్ననక్షత్రమును పాశ్చాత్యులు "ఫోమలో" (Fomalhaut) అనుచున్నారు. దక్షిణాకాశమున మిక్కిలి మెఱసెడి నక్షత్రములలో నిదియొకటి. అగస్త్యుడు కాశీపురభ్రష్టుడై దక్షిణమునకు వచ్చినపుడు "ద్రవిడాధీశుడతండు పుణ్యాతము డింద్రద్యుమ్న నాముండు" అని భాగవతము తెలుపుచున్నది. భారతారణ్య పర్వములో కూడ ఇంద్రద్యుమ్నుని ప్రశంసకలదు. పుణ్యాతముడగు నామహారాజుస్వర్గములో కొంత కాలము నివసించినతరువాత, దేవతలు "రాజా! నీపుణ్యాక్షయమైనది. క్షీణేపుణ్యేంమర్త్యలోకం విశంతి." కనుక పొమ్మ, మర్త్యలోకమునకు పొమ్మ"ని త్రోసివేయజూచిరి. "భూమిమీద నాపేరు, మాసిపోలేదు; పేరున్నంతకాలము పుణ్యాముక్షయము కాజాలదని యతడు వాదించి సాక్ష్యమిప్పించెను. నాళీకజంఘు డనుబకమును, ప్రావారకర్ణుడను ఘూకమును ఇంద్ర

ద్యుమ్న నెఱుగ మునినవి కాని మంధరుడనుకూర్మము తానున్న కొలనికి ఇంద్రద్యుమ్నసరస్సని పేరుకలదనియు, ఆనాడు బంగారు కొమ్ములతో బంగారుగొరిజలతో ఆమహారాజు దాన మిచ్చిన గోవుల గొరిజల యొత్తిడిచే గొప్ప పల్లమేర్పడి యాతనిపేర నింద్రద్యుమ్నమనబడు సరస్సు అయ్యె ననియు, ఆసరస్సులో బహుకాలమునుండి తాను జీవించుచున్నదనియు సాక్ష్యమిచ్చెను. పిదప వారికందరికి నమరత్వము సిద్ధించెను. ఇంద్రద్యుమ్న నక్షత్రీ సమీపమున బకఘూకకూర్మములను దక్షిణాకాశమున నొక్కచోట చూడగలము. వీరందరును నక్షత్రరూపములు ధరించి దివ్యముగా వెలుగుచు నేటికిని మనకు నేత్రోత్సము చేయుచున్నారు. మహాభారతమునకు ముందుకాలమునుండియు నీనక్షత్రరూపులను భారతీయులెరుగు దురు. పాశ్చాత్యదేశములవారీ చుక్కల గుంపులను మొన్న టిదాక ఎరుగరు. మూడువందల యేండ్లక్రిందట దక్షిణసముద్ర ములపై నౌకాయానము సాగించిన ( Bayer ) బేయర్ దొర తొలిసారి యీచుక్కలను చూచి వాటికి పేరులు పెట్టెను. నాళీకజంఘ బకమును అతడు (Grus) గ్రస్ అనెను. ఆమాటకు లాటిన్ భాషలో కొంగ అని యర్థము. ప్రావారకర్ణ ఘూకమునకు (Phoenix) ఫేనిక్సు అని యతడుపేరుపెట్టెను. గ్రీకు గాథలో ఫేనిక్సు ఒక వింతపక్షి. గుడ్లగూబవంటిదే. పిమ్మట 1752 సంవత్సరములో దక్షిణాకాశ వేధ చేసిన 'లా కె యిల్ ' అను పడమటి పరిశోధకుడు మంధర కూర్మరూపమైన

చుక్కలకు (Scu[illegible] చిత్రకారసుందరమని పేరుపెట్టెను. ఆచుక్కల కూర్పురూపమిచట చిత్రములో చూడనగును.

(చూ. 38 వ పటము)

---

## 83. కుంభరాశి—(Aquarius)

ధనిష్ఠ ½+శతభిషము+పూర్వాభాద్ర మూడు పాదములుచేరి కుంభరాశి యగుచున్నవి. ఖగోళమున వరుణదేవుడు జలప్రపూర్ణమైన కుంభమును దిగువకువంచి భూలోకమునకు జలప్రదానము చేయుచున్నట్లు ఋగ్వేదము వర్ణించుచున్నది. బహుదేశముల జ్యోతిషగ్రంథములును, చిత్రములును కుంభరాశి యనగా నీళ్ళు పోయుచున్న రూపమునే (Water -Pourer) నిరూపించుచున్నవి. బృహజ్జాతక కర్తయైన వరాహమిహిరుడు కుంభరాశిని "రిక్తకుంభస్కంధదారీ" వట్టికుండను భుజముమీద మోయుచున్న నరరూపము కుంభరాశియనుటకు కారణము తెలియదు. రిక్తకుంభ ప్రశంసగాని, దానిని నరుడొకడు స్కంధమునధరించిన వర్ణనగాని వేదములో కనబడలేదు. పాశ్చాత్యజ్యోతిష గ్రంథములలోనైనను 'రిక్తకుంభస్కంధధారి' ప్రమేయ మగపడదు. ఆకాశమున కుంభరాశిలోని నక్షత్రరూపముకూడ అట్లు కానవచ్చుటలేదు.

లోకవ్యవహారములో మంచివర్షము కురిసినపుడు 'కుంభవృష్టి గురిసెను" అందుము. గ్రామీణులు "కడవలు కుమ్మరించినట్లు వానకురిసె" నందురు. వర్షాగమనమునకై ధనిష్ఠాపంచకమన బడు నక్షత్రములతో చంద్రసమాగమును ప్రతీక్షింతుము. అట్టిసందర్భములో వరుణరాజు చేతుల బట్టుకొని దిగువకు నీరు దిమ్మరించుచున్న పూర్ణకుంభమును కుంభరాశియనక రిక్తకుంభస్కంధ భారిస కుంభరాశియని వరాహమిహిరు డనుటకేమి హేతువో తెలిసికోవలెను. వరాహమిహిరుడే గాక అతని వ్యాఖ్యాతలు ననుసరించుటకూడ కుంభమును రిక్తకుంభమేల చేసిరో విజ్ఞులు విచారింతురుగాక! విశేషించి "పాడవుమిగిలిన పొందమ్మిపూవు"వంటి హంసపుచ్ఛము వరుణ రాజునకిడిన చామరమువోలెనున్నదని శ్రీనాధునివర్ణన ఎంతో చక్కగానున్నది. హంసతోకప్రక్క వరుణుడున్నాడు.

---

# 84. పూర్వాభాద్ర; ఉత్తరాభాద్ర

తైత్తిరీయ సంహితయందు ప్రోష్ఠపదానక్షత్రము లని చెప్పబడినవి తైత్తిరీయ బ్రాహ్మణమునందు "పూర్వేప్రోష్ఠపదా, ఉత్తరేప్రోష్ఠపదా" అని తెలుపబడెను. ఈభాద్రపదా నక్షత్రములు నాలుగు; నాలుగుచుక్కలును చక్కని సమచతు

రత్నరూపమున మెఱయుచుండును. తేజస్సునందును, ఆకారము నందును ఈ తారలు ఒకదానికొకటి తీసిపోక జోడాజోడీలన నొప్పుచు, జట్లుకట్టుకొని కదలుచున్నట్లు మింట నగపడును. అందుచేతనే శ్రీమద్రామాయణకవి వాల్మీకి బాలకాండలో దశరథపుత్రులు శ్రీరామలక్ష్మణ భరతశత్రుఘ్నులు నలువురు సోదరులును పుట్టి పెరుగు సందర్భములను వివరించుచు వారు "రుచ్యాప్రోష్ఠ పదోపమా" అని వారినీ 'నాల్గునక్షత్రములతో చక్కగా పోల్చినాడు. ఖగోళమున భాద్రపదా నక్షత్రములను తెలిసికొని, చైత్రమాసములో సూర్యోదయాత్పూర్వము తూర్పుదిక్కున నుదయించి మెఱయు నీనక్షత్రములశోభను కనులారచూచినపు డీయుపమానముయొక్క మనోజ్ఞత మనము గ్రహించి యానందింపగలము. చూ. బాల 18-15 "రాజ్ఞా పుత్రామహాత్మానశ్చత్వారో జజ్ఞిరేపృథక్ । గుణవన్తోను రూపాశ్చ రుచ్యాప్రోష్ఠపదోపమా."

---

## 85. పేద్వఘాశ్వము (Pegasus)

పేద్వఘాశ్వమనునది ఋగ్వేదప్రసిద్ధమైన దివ్యాశ్వము. అశ్వినీదేవతల కత్యంతప్రియుడై పారిరక్షణము పొందుచున్న 'పేదు' అను రాజఋషికి ఆదేవతలొక 'అఘాశ్వము' నను గ్ర

హించి యిచ్చిరి. ఆగుఱ్ఱమునకు (పేదు+అఘాశ్వము) పేద్వ ఘాశ్వమనిపేరు. ఈయశ్వముయొక్క విశేషమేమనగా దీనికి "శ్యేనస్యపక్షా హరిణస్యబాహూ" డేగఱెక్కలవంటి ఱెక్కలును, లేడికాళ్లవలె త్వరితగమనముగల కాళ్లును గలవు. (చూ. ఋ I. 163. 1) ఈయశ్వము "అహిహానము" అనగా సర్పవిరోధి; పామును చంపునది. ఆశ్రేషనుండి ఖగోళమున స్వాతీ నక్షత్రమువఱకు నక్షత్రమయమైన మహాహిరూపమొకటి మనకు దృగ్గోచరమగుచున్నది. ఆశ్రేష తరువాతనున్న యహిరూపము ప్రోష్ఠపదానక్షత్రములకు ప్రతిస్పర్థి; ఎట్టయెదుటనున్న యీసర్పమును పేద్వఘాశ్వము చంపునని చెప్పతగును. ఈసర్పరూపమునే మంత్రపాఠములు అజగరమనుచున్నవి.

"అజగరోనామసర్పస్సర్పి రవిషోమహాన్
తస్మిన్విసర్పిసుధితస్తే నత్వాస్వాపయామసి
సర్పస్సర్పో అజగరస్సర్పిరవిషోమహాన్
తస్యసర్పాత్సిం ధస్తస్యగామశీమహి"

భారతమునందు అజగరోపాఖ్యానమున్నది. వృత్రవధమైన తరువాత బ్రహ్మహత్య ఇంద్రుని స్థానభ్రష్టుని గావించి మిక్కిలి పీడించెను. అందుకు తాళజాలక ఇంద్రుడెక్కడనో దాగిపోయెను. ఇంద్రస్థానమున దేవతలు నహుషిని నిలిపి మూడు లోకములకధిపతినిచేసి పట్టాభిషేకము గావించిరి.

దేవేంద్రత్వము సార్థకముచేసికొనుటకు నహుషుడు ఇంద్రుని భార్య ఇంద్రాణి శచీదేవి పొత్తునభిలషించెను. తనగృహాము నకు సప్తఋషులచే పల్లకి మోయించుకొని నహుషుడు తన కడకు వచ్చినపక్షమున నంగీకరింతునని శచీదేవి కబురంపెను. 'అదెంతలోపని' యనుకొని నహుషుడు సప్తఋషులను తన పల్లకి మోయమని యాజ్ఞాపించెను. ఋషులు బ్రహ్మారథము పట్టి నహుషుని మెల్లగా పల్లకితో మోసితెచ్చుచుండిరి. ఇంద్రాణి సమాగమునకై యువ్విళులూరుచున్న నహుషునికి ఋషులగమనము మందమనిపించెను. ఇంకను త్వరగా నడువు డని బోయీలైన యాఋషుల నతడు హెచ్చరించెను. అగస్త్యుడు 'సర్పోభవతి' యని శపించెను. నహుషుడజగరమై పడెను.

ఈకథ యొక్క ఖగోళసామరస్యము మిగుల మనోజ్ఞ మైనది. మఘనక్షత్రములందలి చుక్కలు పల్లకియాకారము కలిగి మెఱయుచుండును. సప్తఋషులు ఉదయమైనపుడే మఘ చుక్కలుకూడ ఉదయమగును. అలంకారభాషలో సప్త ఋషులు మఘ-పల్లకిని మోయుచున్నట్లు చెప్పవచ్చును. సప్తఋషులు తన్ను మోయుచుండగా మఘపల్లకినెక్కి వచ్చు నహుషుడు అంతలో అగస్త్యుని శాపముచే నజగరమై కూలి నాడు. ఈఅజగరము పాండవుల వనవాసములో భీమునిపట్టు కొనినది. అనగా స్వాతినిచేరి పట్టినది. ఈయజగర మడిగిన

ప్రశ్నలకు ధర్మరాజు జవాబులిచ్చి భీముని విడిపించుకొని అజగరమునకు శాపాంతము కలిగించెను. పూసగ్రుచ్చినట్లీకథ యంతయు నక్షత్రాక్షరములతో ఖగోళమున చిత్రింపబడి యున్నది. ఈకథ 'బ్రహ్మరథ' మనుపేర ఈమధ్య (Film) ఫిల్ము తీయబడినది. అజగరరూపము ఖగోళమున స్వాతివఱకే వ్యాపించియున్నది.

మరొక విశేషమేమనగా :— కొన్ని యజ్ఞకర్మలలో మొదటనొక మేకయు. తరువాత దానివెనుకనే ఒకగుఱ్ఱమును వెడలుచుండుట ఆచారమైయున్నది. "ఏషచ్ఛాగః పురోఅశ్వేన వాజినోపూష్ణోభాగః" అని శ్రౌతము. మనమిప్పుడు మకర మనుకొను రాశి వేదములో అజము, ఛాగమునని చెప్పబడిన బడినది. ఆజంతువునకు మేక ముఖమును నడుమును మాత్ర ముండెను. అధోభాగమంతయు చేపరూపము. ఈవిచిత్ర జంతువును పడమటి దేశములవారిప్పటికిని (Capricorn) కేప్రి కార్న అందురు. ఆమాటకు (Fish - Goat) సగముచేప సగము మేక అని యర్థము మకరరాశి వాడుకలోనికి రాక పూర్వము ఖగోళమున చేప - మేకను గుర్తించి యునవారు మన్మథుడు మీనకేతనుడు, ఝషకేతనుడు నని తెలుపుచుండిరి. ముందుమేకను, ఆవెనుక గుఱ్ఱమును, కొన్నిక్రతువులలో నడి పించుట యీఖగోళదృశ్యమునకు కేవలము ననుకరణము. ఆ గుఱ్ఱమీపేద్ద్వపూర్వమే. దీనితరువాత వచ్చునక్షత్రము రేవతి.

రేవతికధిదేవత పూషుడు. పూషుని రథమునకు మేకనే పూచుట జ్యోతిశ్శాస్త్ర దృష్ట్యా సమంజసము కావుననే పూషుడు వేదములలో పెక్కుచోట్ల అజాశ్వుడని తెలుపబడెను.

(చూ. 39 వ పటము)

పేద్వఘూశ్వము పడమటి గ్రీకులనోళ్ళలోబడి నలిగి తుదకా దేశపు గాథలలో పెగసస్ (Pegasus) అయిపోయినది. గ్రీకు గాథలలోకూడ పెగసస్ గుఱ్ఱము దుష్టసర్పపిశాచ సంహారకారణము. (Bellerephon) బెల్లరిఫోనను యోధునకీ గుఱ్ఱముతో సంబంధముకలదు.

---

## 86. రేవతి

ఈనక్షత్ర మీపేరుతోనే తైత్తిరీయ సంహితాదులయందు పేర్కొనబడినది. 'మత్స్యాకారత్రయము'ని వరరుచి దీనినిగూర్చిచేసిన వర్ణన సరియైనదని తోచుచున్నది. "దంతసంఖ్యభవతే" ముప్పదిరెండు చుక్కలని కాళిదాసు చెప్పినదే బాగుగానున్నది. మీనరాశిలో రేవతి కడపటిది. ఈరాశిలోనున్న చేపలు రెండు. అందు మొదటిది పేద్వఘూశ్వమునకు దక్షిణముగా తూర్పు, పడమరదిక్కులకు వ్యాపించి యున్నది.

రెండవచేప ఆయశ్వమునకు పడమట ఉత్తర దక్షిణములకు వ్యాపించియున్నది. ఈచేపలతోకలకు మధ్యనొక పట్టీవంటి (Ribbon-like) పాశముగలదు. ఈపాశమునకు ఏడుమెలిక లున్నవి. అందు మూడుపెద్దవి, నాలుగుచిన్నవి. ఈమెలికల పాశమే వరుణుని పాశమని అథర్వవేదము తెలుపుచున్నది. "సప్త సప్తత్రేధాతిష్ఠంతే" అనిశ్రుతి. చేపలమధ్య గానవచ్చు నీపాశపుగోలుసును శ్రీనాథకవిసార్వభౌముడు ఈక్రిందవివరించిన విధమున బహుసొగసుగా వర్ణించియున్నాడు. మనదేశములో స్త్రీలుచెవులకు "చేపబావిలీలు - మచ్చెపుబావిలీలు" అనబడు కర్ణభూషణములను ధరించుట ఆచారమైయున్నది. నలదమయంతుల వివాహానంతరము వరుణుడు స్వగృహోన్ముఖుడై పడమట కరుగునపుడు అతని చేతిపాశము శృంగారనైషధమున (7-33) లో నిట్లువర్ణితము :—

"గీ॥ అధిక దూరమగుట నాకాశలక్ష్మికి
కర్ణపాశమగుచు కరముఁ బొలిచె
దివ్యభవ్యకాంతి దేదీప్యమానమై
పాశపాణిపాణి పాశవల్లి॥

ఆకాశలక్ష్మి యను చక్కని స్త్రీయొక్క చెవులను మెఱయుచున్న చేపబావిలీలవిధమున వరుణపాశము గగన సీమను మెఱసెనని తాత్పర్యము. ఇట్లే కుమారసంభవ కావ్యములో కాళిదాసుకూడ వరుణపాశమును చేవచెడి పడియున్న

పాముమెలికలతో నుపమించినాడు. అట్లు వర్ణించిన సందర్భము ముందు సంగ్రహముగా విమర్శింతము. తారకాసురుడు దిగ్విజయము చేయునపుడు దేవతలెవ్వరును వానియెదుట నిలువలేక పోయిరి. వారిఆయుధములు చేవచెడి నిష్ప్రయోజనములైనవి. "......... ..పాణౌ పాశః ప్రచేతసః । మన్త్రేణహతవీర్యస్య ఫణినో దైన్యమాశ్రితః" తారకాసురునెదుట వరుణపాశము స్వశక్తిగోల్పోయి మంత్రబద్ధమైన పామువలె దీనముగా పడి యుండెనని భావము. వరుణపాశపుమెలికలు పాముమెలికలతో పోల్చబడుట విశేషము.

---

# 87. అశ్విని

వేదగ్రంథములలో నీనక్షత్రమునకు అశ్వయుజౌ అని పేరు. "అశ్వముఖా అశ్వినీత్రిః" గుఱ్ఱపుతలకాయ వంటి ఆకారముగల మూడుచుక్కలు అశ్విని యని వరరుచివర్ణన. మేషరాశిలోని కాంతివంతములైన చుక్కలలో మొదటి మూడును - ఆల్ఫా, బీటా - గామా (Arieties) సంజ్ఞగల చుక్కలు అశ్విని యని పడమటి జ్యోతిశ్శాస్త్రజ్ఞులు తెలుపు చున్నారు. అశ్వినికి అధిదేవతలు అశ్వినీదేవతలు. వీరు దేవతలకు వైద్యులు. వీరికి మూడు స్థానములున్నవి గనుక వీరు 'త్రిమ

ధస్థు'లని వేదమువర్ణించుచున్నది. వీరికి వాహనమైన రాసభము లను గూర్చి పునర్వసు, అశ్వతర మండలనక్షత్ర చర్చలో కొంత వఱకు తెలిసికొంటిమి. అశ్వతరమనగా సంస్కృత భాషలో గుఱ్ఱమును, గాడిదెయును కాని కంచర గాడిదె. ఈచుక్కల గుంపును పశ్చిమటివారు Centaurus అందురు. ఆల్ఫా, బీటా. సెంటారస్ చుక్కలు, అశ్వినీ దేవతల అంశమునందు పుట్టిన కవలవారు; నకులసహదేవులని భారతకథను గూర్చి చర్చించునపుడు తెలిసికొంటిమి. ఇక అశ్వినీస్థానమందు ఈ దేవవైద్యుల రథమునకు వృషభము, శింశుమారముపూన్చ బడెనని ఋగ్వేదము తెలుపుచున్నది. చూ. ఋ I. 116-18 "యదాయాతం దివోదా సాయవర్తిర్భరద్వాజా యాశ్వి నాహయంతా। రేవదువాహసచనోరథోవం వృషభశ్చశింశుమార శ్చయుక్తా॥ ఈమంత్రమునకు విద్యారణ్యులు వ్రాసిన వ్యాఖ్యా నమిది. "వృషభో అనడ్వాన్; శింశుమారో గ్రాహశ్చ. పరస్పర విరుద్ధావపి స్వసామర్థ్య ప్రకటనాయ యుక్తౌ వాహన తయా సంయుక్తావాస్తాం" వృషభ మనగా ఎద్దు; శింశు మార మనగా మొసలి; పరస్పరవిరుద్ధము లైన యీజంతు వులను తమ రథమునకు పూన్చి తమసామర్థ్య మిట్టిదని ప్రక టించు కొనుటకు అశ్వినులు ఆరథముమీద నెక్కి దివోదాసు డను రాజ్ఞకుల గురువగు భరద్వాజునింటికి విశేషధనముతో వెళ్ళిరని విద్యారణ్యులు పైమంత్రమున కర్థము చెప్పిరి. శింశు మార మనునది ఘోరరూపముగల జలచరము. అది మొసలి

కాదు. ఆజాతి యిప్పుడు నశించిపోయినది. దాని రూపము 25 చిత్రములో చూచితిమి. మొసలికంటెను తిమింగలము కంటెనుకూడ శింశుమారము చాల పెద్దది. అదినోరు తెరచి నపుడు దానిమీదపండ్లకును క్రిందిపండ్లకును మధ్యనొక మనుజుడు గుఱ్ఱమెక్కి నిలబడగలంత విశాలమైన ఖాళీప్రదేశమున్నది. పండ్లవరుసల మధ్యనంత యెడములుగల రాకాశిజంతువు శింశుమారము. మన బాలబాలికలు చేగోడీముక్కలను తినినట్లే శింశుమారము వృషభమును అవలీలగా నమిలిమ్రింగి పొట్టను పెట్టుకోగలదు. పెద్దపులిని మేకను, సింహమును లేడిని, పిల్లిని ఎలుకను బండికికట్టి తోలుట ఎట్టి విడ్డూరమో వృషభ శింశుమారములను ఒకరథమునకు పూన్చి నడిపించుట కూడ అట్టియద్భుతవిషయమే. అశ్వినీదేవతలు తమ సామర్థ్య విశేషమును ప్రకటించుకొనుటకు ఈవృషభశింశుమారములను తమరథమునకు పూన్చుకొని తోలి భరద్వాజునింటికి వెళ్లిరని విద్యారణ్యవ్యాఖ్య. ఆమధ్య మనదేశములో కార్లెకార్ (Karlekar) సర్కస్ కంపెనీవారు సింహమును, పెద్దపులిని, మేకను ఒకతొట్టిలో నీళ్లు త్రాగించిరి. అయినను సింహముగాని పెద్దపులిగాని మేకను ఏమియు చేయలేదు. ఈవన్యమృగములతో కలిసి నీళ్లు త్రాగుటకు మేక భయపడలేదు. అశ్వినులుకూడ ఇటువంటి ఘనకార్యమే సాధించి స్వసామర్థ్యమును ప్రకటించుకొనిరని సమన్వయించి విద్యారణ్యస్వామి తృప్తిపడెను.

పైని వ్రాసిన వేదమంత్రములో ఖగోళ సంబంధమైన రమ్యసన్నివేశ మొకటి బహుచమత్కారముగా వర్ణింపబడినది. అశ్వినీ నక్షత్రములకు అధిదేవతలు అశ్వినులు. అశ్వినికి సమీపముగా నీశాన్యదిశను నక్షత్రపథములో వృషభరాశి (Taurus) ఉన్నది; రెండవప్రక్కను నైఋతిదిశను శింశుమారమున్నది. పాశ్చాత్యులీ శింశుమారరూపమును సీటస్ (Cetus the Whale) తిమింగిలమనుచున్నారు. ఈనక్షత్ర రూపములపై దృష్టినిలిపి ఖగోళవేధచేయుచుండిన వేదఋషుల చక్షుర్మనములకు ఈయద్భుతసంఘటన గోచరమైనప్పుడు ఆవేశముతో నామంత్రద్రష్టలీ ఋక్కులను రచించిరని నావిన్నపము. ద్రష్టలనగా చూచువారలు "శ్రుతిఃపశ్యన్తిమునయః"అని కదా పెద్దలు చెప్పుచున్నారు? అశ్వినీనక్షత్రరూపులగు నశ్వినీదేవతలపై ధ్యానముంచి ఆనక్షత్రములను ఆనక్షత్రముల కుభయపార్శ్వములను గల వృషభశింశుమార నక్షత్రరూపములను గమనించిన వేదఋషుల కవిత్వదృష్టికి భరద్వాజునింటికి వచ్చుచున్న అశ్వినీదేవతలు ఈ వృ ష భ శిం శు మా ర ము ల ను పూ న్చి న ర థ ము నె క్కి వ చ్చి న ట్లు స్ఫు రిం చు ట సహజసిద్ధము. ఆఋషీశ్వరులు ఏదృష్టితో ఈవిశ్వమును గమనించిరో, ఏచక్షుర్మనములతో తిలకించి మంత్రద్రష్టలై ఆమహనీయులు వేదఋక్కులు రచించిరో ఆదృష్టితోనే మనము ఖగోళమును, విశ్వమును చూడగలిగితిమేని వేద

వాఙ్మయము మనకు అరటిపండు ఒలిచిపెట్టినట్లు కాగలదని సవినయముగా విన్నవించుకొనుచున్నాను.

(చూ. 40 వ పటము)

వేదవాఙ్మయమునకు వ్యాఖ్యానము ప్రారంభించునపుడు విద్యారణ్యులిట్లు ప్రతిజ్ఞచేసిరి. కర్మాంగతాయాఃకృక్ వర్ణితాబ్రహ్మణేనతాం బోద్ధంశబ్దార్థమాత్రస్యవివృతిః క్రియతేస్ఫుటా" అనగా కర్మపరముగా వేదమునకు శబ్దార్థమాత్రమునే గ్రహించి భాష్యమువ్రాయుటకే వారుపూనుకొనిరి. వేదమునం దుటంకింపబడిన (Astronomical and Scientific topics) ఖగోళవైజ్ఞానిక శాస్త్రాంశములను వారు వివరించలేదు; వివరింతుమని ప్రతిజ్ఞచేయలేదు. వారిసంకల్పమునుబట్టి ఈవిషయములు వివరించవలసిన యవసరముకూడలేదు. కాని వైజ్ఞానిక శాస్త్రీయదృష్టితో వేదవాఙ్మయ . సమన్వయ మిప్పుడత్యావసరముగా జరుగవలసియున్నది.

---

## 88. భరణి

వేదవాఙ్మయమునందు అపభరణి యనియు, భరణి యనియు, రెండునామములతో నీనక్షత్రము వ్యవహరింపబడినది. కృత్తికాదిగాగలక్రాంతి వృత్తనక్షత్ర చక్రములోనిది

యంత్యనక్షత్రము కాబట్టి దీనియధిదేవత యముడు. మేష రాశిలో 35 సంఖ్యగల చుక్కలివియని పాశ్చాత్యుల సమన్వయము. 'ఘుస్లి కాత్రీణి' (ప్రాయ్యిప్రాకిళ్ళవంటి మూడుచుక్కల గుంపు భరణియని మనవారు తెలుపుచున్నారు. అశ్వినీకృత్తికలమధ్య భరణిని సులభముగా గుర్తించగలము.

చూ. 41 వ పటము

---

## 89. అగస్త్యుడు

మృగవ్యాధ మహానక్షత్రము (Sirius) దిగువ దక్షిణాకాశమున నత్యుజ్జ్వలముగా మెఱయుచుండు మేటిచుక్కయే అగస్త్యుడు. పాశ్చాత్యులీనక్షత్రమును 'కేనొపస్'(Canopus) అందురు. "అందరునొకయెత్తు; అగస్త్యులవారొక యెత్తు" నను మనదేశములో సామ్యమున్నది. మనసూర్యుని కంటె అగస్త్యుడు ఏబదిలక్షలరెట్లుఅధికుడని పాశ్చాత్య జ్యోతిర్విద్యావిదులు తెలుపుచున్నారు. అట్టిమహనీయమూర్తి మనభూమిమీది సముద్రోదకములను పుడిసిటబట్టి ఆచమనముచేసెనను టలో నాశ్చర్యములేదు. మనపంచాంగకర్తలు అగస్త్యాస్తమయ అగస్త్యోదయ తిథులు వ్రాయుచుందురు. అగస్త్యోదయమగునాటికి నదులలో ఎఱ్ఱబురదనీరు విరిగి వినీలమై స్వచ్ఛ

మైన జలములతో ప్రవహించునని కవులు వర్ణించుచుందురు. "అగస్త్యోదయే విషవిశుద్ధి" యని బాణుడు. "అధిగతాగస్త్య యగు దక్షిణాశవోలె" అని శ్రీనాథుడు. శ్రీకృష్ణదేవ రాయలు. ఆముక్తమాల్యద. IV-178.

కం. హంసము క్రౌంచము తొలిరా
మాంసలరుచి వచ్చెదాను మలయముశిఖ బా
ల్హాంస విఱుప నీర్వెఱిచెను
హంసమునకగస్తిపరమ హంసంబగుటన్

క్రౌంచపర్వత బిలమునుండి హంస రాగా అగస్త్యుడు మలయ పర్వతాగ్రమున నుండి, మాంసలరుచి, అనగా అధిక కాంతిచేత ఉదయించెను. మామూలుగా హంస పాలను నీరును విఱిచి విభాగముచేయగలదు. అగస్త్యుడన్ననో పరమహంస-హంసకంటె నధికుడుగనుక, బురదటనీటినివిఱిచి, తేటనీటిని, బురదను వేరుచేయగలిగెను.

అగస్త్యుడు దక్షిణనక్షత్రము కనుక మలయపర్వతశిఖరమున పొడిచినట్లుతోచును ; మహోజ్జ్వల తేజముగల యానక్షత్రమును ఒకచోట నేమని (Tennyson) చెన్నిసన్ మహాకవి వర్ణించెననగా దేదీప్యమానముగా వెలుగు దీపములు అగస్త్యుని కంటె మెఱయుచున్న వనెను......... "Lights that out-burned Canopus"

---

# 91. ఈశ్వరుని విశ్వరూపము

అగస్త్యుడు పరమశైవుడు. శివపూజా ధురంధరుడు. ఈశ్వరుడు విశ్వరూపుడు. మహేశ్వరుని విశ్వరూపవిశేషములను నలుడుఖగోళమున దమయంతికి చూపుచున్నట్లు నైషధమూలములో శ్రీహర్షుడు చమత్కారముగా నీక్రింది శ్లోకమున వర్ణించినాడు.

చూ. XXII 18:-శ్లో॥ తారాస్థిభూషాశశి జహ్ను జాభ్రభూచ్చంద్రాసుపాంశుచ్ఛురితద్యుతిర్ద్యోః। ఛాయాపథాచ్ఛద్మఫణీంద్రహారః। స్వంమూర్తి మాహాస్ఫుటమష్టమూర్తే॥ శ్రీనాథుడీ శ్లోకరత్నము నెంతసొగసుగా తెనిగించినాడో గమనింపుడు:- శృం. నై VIII-194.

శా॥ ఛాయామార్గ భుజంగహారము గుంజంచత్తారకాకుండల।
స్ఫాయద్దివ్య కపాలభూషణము జ్యోత్స్నాభస్మ గౌరంబునై।
యీయాకాశము శంభుమూర్తియగుటన్నేర్పాటునందెల్పెదున్।
త్రైయక్షాణిమభూతి సూక్ష్మతరమధ్యా దేవి! వీక్షింపుమీ!

ఈపద్యభావము చక్కగా నర్థముచేసికొనుటకు మన మీశ్వరుని రూపలక్షణము లెట్టివో ఒక్కసారి స్మరించుకోవలెను. దిగువ పద్యము వానిని విశదము చేయగలదు:-

(చూ. 42 వ పటము)

చ॥ ఉరగవిభూషణంబులును, నుగ్రగజాసురచర్మవస్త్రమున్
గరమున నొప్పుశూలమును కంఠముకప్పును వాలభాగసుం
దరుడగు మొద్దుకెప్పలును నొదలగంగయు జూటకోటిపై
పరగుశశాంకరేఖయును......

ఈశ్వరునికి మెడలో పామున్నది; కపాలాస్థిమాలిక లున్నవి; శిరమున గంగ, చంద్రకళ ఉన్నవి - శరీరమునకు భస్మము పూయబడినందున తెల్లగా నున్నది. ఖగోళమున, విశ్వరూపుడగు శివుని మెడలో వ్రేలుపామువలె ఛాయాపథ మున్నది- ఛాయాపథమనునది మనము పాలవెల్లయనియు, పాశ్చాత్యులు (Milky Way) యనియు వర్ణించు ధవళ దృశ్యమే. ఈశ్వరునికంఠమున తెల్లని కపాలాస్థులు మెఱయు చున్నవి; ఆకాశమున ధవళకాంతులతో నక్షత్రములు తేజ రిల్లుచున్నవి. ఈశ్వరుని శిరస్సుపై చంద్రుడు ప్రకాశించు చున్నాడు; ఆకాశమున చంద్రుడు ప్రకాశించుచు పిండియార బోసినట్లు లోకమున వెన్నెలను వ్యాపింపచేయుచున్నాడు. ఈవెన్నెల విశ్వరూపుడగు పరమేశ్వరుని శరీరమునకు పూసిన విభూతి పూతవలె నొప్పారుచున్నది. కాబట్టి భూగోళఖగోళ వ్యాప్తమైన విశ్వమంతటను శంభుమూర్తియొక్క అద్భుత రూపమే గోచరించుచున్నదని నలుడు దమయంతికి చూపు చున్నాడని పై పద్యమున శ్రీనాథుడు మనకు విశదము చేసియున్నాడు.

# 91. నక్షత్రవీధులు

ఇట్టి యద్భుత విశ్వరూప విరాజితమగు పరమేశ్వరు నంబరమున దాపించినముత్యాలవలె నక్షత్రసహస్రము లాకాశమున మెఱయుచున్నవి. ఇందు క్రాంతి వృత్తమునకు సంబంధించినచుక్కలిరువదేడింటినిగూర్చి సంగ్రహముగా కొన్ని విషయములు తెలిసికొంటిమి. విష్ణుపురాణము వాయుపురాణము మొదలగు పురాణములలో వీధివివరములతో నక్షత్ర విభజన మగపడుచున్నది. అశ్విన్యాదినక్షత్రము లిరువదేడును మూడు మార్గములుగాను, ఒక్కొక్క మార్గము మూడేసి వీధులుగాను వర్గీకరణము గావింపబడినవి. విష్ణుపురాణముల లోని వర్గములను ముందు పరిశీలింతము :-

నక్షత్రవీధులు: విష్ణుపురాణ వాయుపురాణముల ప్రకారము.

1. ఉత్తరమార్గము.

అశ్వని+భరణి+కృత్తిక — ఇవి మూడును నాగవీధి

రోహిణి+మృగశిర+ఆర్ద్ర „ „ గజవీధి

పునర్వసు+పుష్యమి+ఆశ్లేష „ „ ఐరావతీవీధి

2. మధ్యమ మార్గము.

మఘ+పూ. ఫల్గుని+ఉ. ఫల్గుని ఇవిమూడును ఆర్షభవీధి

హస్త+చిత్ర+స్వాతి „ „ గోవీధి

విశాఖ+అనూరాధ+జ్యేష్ఠ „ „ జారద్గవవీధి

3. దక్షిణ మార్గము.

మూల+పూర్వాషాఢ+ఉత్తరాషాఢ „ „ అజవీధి

శ్రవణము+ధనిష్ఠ+శతభిషము „ „ మృగవీధి

పూర్వాభాద్ర+ఉత్తరాభాద్ర+రేవతి „ „ వైశ్వానరవీధి

మత్స్యపురాణము మొకటి నాలుగు వీధులను పైవలెనే తెలిపి, అటుపిమ్మట హస్తత్రయమును అజవీధియనియు, విశాఖాత్రయము మృగవీధియనియు, మూలత్రయము వైశ్వానరవీధియనియు, శ్రవణాది మూడును జారద్గవవీధియనియు, పూర్వాభాద్రత్రయము గోవీధియనియు వివరించినది. ఈ వివరములకు కూడ సరిపోయిన పురాణగాథలు కొన్ని మనమీ గ్రంథమున చర్చించితిమి. మిగిలిన గాథల సమన్వయము జ్యోతిర్వేదములో చూడగలము.

---

# 92. సమాప్తము

పంచఖండ పంచమహాసముద్రముద్రితమైన మన భూగోళము యొక్క వ్యాసము సుమారు ఎనిమిదివేల మైళ్లు; చుట్టుకొలత ఇరువది యైదువేలమైళ్లు. సూర్యగోళవ్యాసము ఎనిమిది లక్షల అరువదియేడువేల మైళ్లని నవీన వైజ్ఞానికులు గుణించి తేల్చియున్నారు. సీ॥ "ఆకాశమధ్యస్థమగు భానుబింబంబు విను లక్షయోజన విస్తృతంబు" అని కాశీఖండమున శ్రీనాథుడు తెలిపెను. ఈలెక్కయించుమించుగా నేటిలెక్కలతో సరిపోవుచున్నది.

సూర్యగోళపు చుట్టుకొలత సుమారు ఇరువదియైదు లక్షలమైళ్లు ఇంత పరిమాణముగల సూర్యుడు మనకెంతో గొప్పగా తోచుచున్నాడు. మనము తిను అన్నము "ఆదిత్యమయము" సమస్తజీవజంతువుల ఆహారము "ఆదిత్యమయమే" ఉష్ణతేజో విద్యుత్కాంతి శక్తులచే మనల పోషించి రక్షించి యేలుకొనుచున్న సూర్యభగవానుడు మన భూమికంటె పదమూడు లక్షలరెట్లు పరిమాణమున గొప్పవాడే. అయినను రోహిణి, ఆర్ద్ర, మఘ, స్వాతి, జ్యేష్ఠ, అగస్త్యాది మహాగోళములతో పోల్చి చూచినపుడు మన సూర్యుడొక మిణుగురుపురుగు! అంతే! అంతమాత్రమే! ఈవిశాల విశ్వమంతటిలో సూర్యుడే మిణుగురుపురుగు వైనపుడు మన

భూమి ఎంతదో గచ్చకాయంత మట్టియుండ మైనను కాజాలదు. భూమిమీాదనున్న సమస్తసముద్రతీరముల యిసుక ప్రోగుచేసి యాయిసుకరాశిని తారతమ్య నిర్ణయము కొఱకు విశ్వమనుకొంటిమేని, అందొక్క ఇసుకరేణువునందలి దశ లక్షాంశముకూడ కాజాలదు. అంతచిన్నది మనభూగోళమని సర్ జేమ్సుజీన్సుదొరగారు వక్కాణించి యున్నారు.

మనము వెలుగువత్సరమనగా ఎంతో తెలిసికొంటిమి. సెకెండునకు లక్షయెనుబదియారువేల మున్నూట ఇరువది యారుమైళ్ళచొప్పున నిరంతరప్రయాణము సాగించుచు మహ నీయ సూర్యులని చెప్పతగిన కొన్నినక్షత్రగోళములనుండి వెడలి వచ్చు కాంతికిరణములు మనభూమిని చేరుకొనునరికి వందలు, వేలు, లక్షలు, కోట్లకొలది సంవత్సరముల కాలము పట్టు చున్నది. ఈగోళములను "నక్షత్రదిశో నానాసూర్యాః" అని వేదము నిరూపించుచున్నది. మహత్తరపరిమాణముగలిగి, అఖండతేజస్సుతో వెలుగుచు, దురూహ్యమైన దూరముననున్న సూర్యకోటులతోనిండియున్న యీావిశ్వరచననుగూర్చి యోజిం చినపుడు, మనభూమియొక్కయు దానిపై నివసించు జీవజాతు లలో నగ్రగణ్యులమని విఱ్ఱవీగు మానవులయొక్కయు అల్ప త్వము గోచరించుచున్నది. ఇంతటి విశాలవిశ్వమునురచించి రక్షించి యేలుచున్న విశ్వాత్ముని నిరుపమానమహిమ మనకు ఒకింత తెలియుచున్నది. ఇంతటితోసరియని నిరూపించి చెప్పు టకు సాధ్యముకాని కాల రూప వ్యాప్తులు కలవాడగుటచేత

బ్రహ్మ జిజ్ఞాన కల కవులు, శాస్త్రపరిశోధకులు, పండితులు, మేధావులు, వేదాంతులు, విమర్శకులు లోనగు సూరిజనము ఆ విశ్వభర్త "అ నం తు డు" అని చేతులు మోడ్చి యొక్క దండము పెట్టిరి.

దేవశబ్దమునకు ప్రకాశమానమైనదని యర్థము. ఆకాశరంగమున ననేకవిధములుగా ప్రకాశించు నక్షత్రములే మనవారి దేవతలని నామనవి. ముగ్గుబొట్లు ననేకవిధములైన గతులతో కలిపి యనేక రూపములుగల ముగ్గులు పెట్టినట్లే చుక్కలగుంపుల యాకారమునుబట్టి కవులు, ఖగోళ పరిశోధకులు నాయాగుంపుల కాయానామములుపెట్టి జ్యోతిశ్శాస్త్రమును పెంపొందించినారు. "క విః క వి త్వా ది వి రూ ప మా న" ఋ X. 12 – 47; తన బుద్ధిబలముచేత కవి ఆకాశమున మెఱయుచున్న చుక్కలగుంపుల రూపమును నిశ్చయించుచున్నాడు. "అహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూపమ్" అను శ్రుతి దేవతల నక్షత్రరూపమును ఖండించి తెలుపుచున్నది. ఈగుంపుల సామీప్య, రూపసామరస్యములవలన ఆయాదేవతల వాహన ధ్వజాది చిహ్నము లేర్పడినవి. వాని వాని ఉదయాది విశేషములనుబట్టి ఆయాదేవతల పండుగు లేర్పడినవి. So strange is the Scripture of the Heavens! జ్యోతిర్వేద మెంతచిత్రమైనది! భూమిమీది వారి పుణ్యకథలు, గాథలు, వేడుకలు, పండుగలు, పర్వములు, సమస్తమును ఆకాశనాటకము ననుసరించియున్నవి. The

Drama of the Earth runs parallel to the Drama of the Sky. అని (Carpenter.) కార్పెంటరు మహాశయుడు చక్కగా తెలిపినాడు. వేదఋషులు ఖగోళార్థము చెప్పక పోవుటచేత వేదమర్మము గోచరముగా నున్నది. ఖగోళతాళపు చెవితో వేదపేటికను తెఱచిన యెడల మనపూర్వుల విజ్ఞానము కరతలామలకముగునని విశ్వసించుచు నీ నక్షత్రచర్చ ముగించుచున్నాను.



ఓమ్ - తత్ - సత్

శ్రీ కృష్ణార్పణమస్తు

# మహాపండితుల సదభిప్రాయములు



"గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు వేదవిహితమైన ధర్మములను పూర్ణముగా విమర్శించి తెలిసికొన్నవారు. వీరు మేషాది రాసులను, అశ్విన్యాది నక్షత్రములను విమర్శించి వీటితత్త్వములను తెలిసికొని భారతాది కథాసందర్భములను సమన్వయించిరి. వీరి మేధాప్రతిభాశక్తులు సకల విద్వజ్జన శ్లాఘ్యమైనవి గనుక నిరంతరము ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి పరమేశ్వరుడు ఆచంద్రతారార్కముగా వీరిని, వీరి కుటుంబమును రక్షింపవలెనని సర్వేశ్వరుని నేను ప్రార్థించుచున్నాను.

పేరూరు
10 – 5 – 1947

ఇట్లు విన్నవించు బుధజనవిధేయుడు
కావ్య నాటకాలంకార, న్యాయ వేదాంత శాస్త్రజ్ఞుండును,
పేరూరు గ్రామ సంస్థాన పండితుండును, అమలాపుర
తాలూకానగర బుచ్చమ్మ అగ్రహార వాస్తవ్యుండును నగు
మరువాడ శంభన్నశాస్త్రి (అని యున్నది.)

* * * * *

"Like a lightning flash, stars dazzle and twinkle before our eyes. The moment we hear his surname Gobburu", Visalandhra, Vijayavada.

"వారింటిపేరు – గొబ్బూరు అనగానే మెఱుపు మెఱిసినట్లు మనకళ్ళయెదుట నక్షత్రము తళుక్కుమంటవి"– విశాలాంధ్ర – విజయవాడ.

* * * * *

"He has been giving Ferguson - Lectures, because he is Ferguson himself." Prof. B. V. Rama Narusu. M. A. Principal. Warangal College, Warangal.

"రాఘవరావుగారు ఫెర్గుసన్ ఉపన్యాసాలు ఇస్తున్నారు. ఎందుచేతనంటే ఆయన ఫెర్గుసన్ గనుక." ప్రొఫెసర్ బి. వి. రామనరుసు ఎమ్. ఏ. గారు, వరంగల్ కాలేజీ ప్రిన్సిపాల్ గారు.

* * * * *

"Andhra Saraswata Parishad" welcoming him said "He is our Andhra Galileo."

హైదరాబాద్, ఆంధ్ర సారస్వత పరిషత్ వారి స్వాగత వచనము "రాఘవరావుగారు మన ఆంధ్రదేశపు గెలీలియో"

* * * * *

Said Prof. R. S. Ramachandra Rau, M. A., L. T. Berhampur College Ganjam:-" He is a University in himself"

గంజాము – బరంపురం కాలేజీ ప్రొఫెసర్, శ్రీ రావి కంటి సీతారామచంద్రరావుగారు. M. A., L. T. "రాఘవ రావుగారంటే ఆయన ప్రత్యేకంగా ఒక సర్వకళా పరిషత్ అన్నమాట"

సరస్వతీ పవర్ ప్రెస్ - రాజమహేంద్రవరము 8274/54

1



19 పుట 3 చిత్రము



నారాయణమూర్తి

14 పుట 4 చిత్రము




ధ్రువనక్షత్రమును పోల్చుకొనుట - పులహాక్రతురేఖ ధ్రువసూచకము

25 పుట 5 చిత్రము



ధ్రువునిచుట్టు సప్తఋషులు పరిభ్రమించుట

29 పుట 6 చిత్రము




లఘువృషమనే చిన్న యెలుగు

37 పుట ౮ చిత్రము



మిధునరాశి - పార్వతీపరమేశ్వర మిధునము

37 పుట 7 చిత్రము



వృషభరాశి

53 పుట 7 చిత్రము



గిరిజా - శంకర్

57 పుట 8 చిత్రము



మహేశ్వరుని చిచ్చుకంటి మంటలోపడి మిడుతవలె మన్మథుడు భస్మమగుట

58 పుట 9 చిత్రము



ఉమామహేశ్వరులు వృషభధ్వజులు

58 పుట 10 చిత్రము



ముసలియెద్దే మీకు సినిమాహోదా గిరిజాశంకరుల వాహనము ఎద్దు (నంది)

62 పుట   13 చిత్రము




విష్ణుపాదోద్భవి - ఆకాశగంగ - ఈశ్వర జటాజూటము చేరుకొనుట

63 పుట   14 చిత్రము



మృత్యుంజయుడు-ఆకాశ - లింగమూర్తి విశ్వస్వరూపి

67 పుట 15 చిత్రము



పునర్వసు చుక్కలు

71 పుట 17 చిత్రము



పుష్యమి-పెండిరంపములో అశ్విని దేవతలవారి వాహనములు-

గాడిదెల జత తిని త్రాగుట

72 పుట 18 చిత్రము



కర్కాటకరాశి

73 పుట   19 చిత్రము



కాంబకీభిల్లుడు-ఉమ

76 పుట 20 చిత్రము




సప్తఋషుల ప్రక్క మెఱయు గణేశనక్షత్రములు-క్రింద ఎలుక చుక్కలు
గణేశుడు ఆశ్లేషతో నుదయించుటవలన నాగయజ్ఞోపవీతుడు

76 పుట 21 చిత్రము



కవులు – కళాకోవిదుల దృష్టిలో విఘ్నేశ్వరుడు

80 పుట 23 చిత్రము



అర్జునుడు తెగవేసిన మత్స్యయంత్రము మీనరాశి
ఇందలి joints ఐదులైదింటిని పడగొట్టుటకు ఐదుబాణముల ప్రయోగము
అవసరము

77 పుట 22 చిత్రము



సింహరాశి

81 పుట 24 చిత్రము



మత్స్యయంత్రమును గొట్టిన అర్జునుని పూలహారముతోవరించిన ద్రౌపది (కన్య)

పుట 83 25 చిత్రము



దురాశా దౌర్జన్యమూర్తులు – కౌరవుల – ఘోర మకరాకారస్వరూపము
శింశుమారము

109 పుట 26 చిత్రము



తులారాశి

శిబిచక్రవర్తి కథ. విశాఖ ఇంద్రాగ్నిదైవత్యము దేగ-ఇంద్రుడు ; పావురము అగ్ని
శిబిపేరిట 'తక్కెట సిబ్బి' లేర్పడినవి

134 పుట 29 చిత్రము





మకర రాశి

132 పుట 28 చిత్రము



ధనుస్సు రాశి – ధనుర్ధారి - మన్మధుడు

126 పుట 27 చిత్రము



వృశ్చిక రాశి

141 పుట 32 చిత్రము



రాజహంస

142 పుట 33 చిత్రము



సరస్వతి చేతిలోని వీణ
" కచ్ఛపి "

156 పుట 35 చిత్రము



" పొడవు మిగిలిన పొందమ్మిపూవు "   " వరుణరాజున కిడిన చామరము "
సరస్వతికి బ్రహ్మను వాహనము   మహర్షి మండలోపాసిత రాజహంస

156 పుట 35 చిత్రము



బ్రహ్మప్రాదుర్భవించిన కమలము
Ring Nebula in Lyra

158 పుట 36 చిత్రము



25

176 పుట 38 చిత్రము



కుంభరాశి — వరుణరాజు



4

ఈశ్వరుని విశ్వరూపము



184 పుట 39 చిత్రము



మేషరాశి

198 పుట 40 చిత్రము



వృషభ - శింశుమార యుక్తమైన రథము నెక్కిన అశ్వినీదేవతలు,



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA111B160 |
| పుస్తకం పేరు | నక్షత్రములు |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 263 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 16,32,30 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |